# మీ నడుము నుంచి కొన్ని సెంటీ మీటర్లు తగ్గించుకోవడం...ఎ, బి, సి లంత సులభం.

ఎ. ఈ రెండు సులభ మైన వ్యాయామాలూ సౌనా సిస్టమ్ తో రోజూ 10 నిమిషాలపాటు చెయ్యండి.




బి. వ్యాయామం పూర్తయ్యాక, కనీసం 20 నిమిషాలపాటు సౌనా సిస్టమ్ ను అలాగే వుంచుకొని విశ్రాంతి తీసుకోండి: ఆ సమయంలో మీరు చదువుకోవడం, సంగీతం వినడం మొదలైనవి చేయొచ్చు.




సి. సౌనా సిస్టమ్ తీసేసి ఫలితాలు ఎలా వున్నాయో చూసుకోండి. మీ నడుము బిగువుగా, చదునుగా, దృఢంగా ఉంటుంది. మొదటిసారికే మీరు 3 సెం.మీ. తగ్గవచ్చు.



ఇవి సౌనా సిస్టమ్ వాడి అద్భుత ఫలితాలు సాధించినవాళ్లు అన్న మాటలు (ప్రమాణ పూర్వకమైనవి, పూర్తిగా నిజమైనవి). అందరికీ ఇంత సాఫల్యం చేకూరకపోవచ్చు. కాని వీళ్లు ఇంతగా సాఫల్యం పొందారంటే, మీరు సౌనా సిస్టమ్ తో తొందరగా ఎన్ని పౌన్ల బరువు, ఎన్ని సెంటీమీటర్ల లావు తగ్గగలరో ఆలోచించండి మరి!

మొదటి రోజు నుంచే మీరు కొలుచుకోగల ఫలితాలను మీరు చూసుకోవచ్చు. ఏ గొడవ లేకుండా ఫలితాలను మీకు మీరే చూసుకోండి. ఒకవేళ మీరు 14 రోజులలోగా, సెంటిమీటర్ల కొద్దీ తగ్గకపోతే, నాజూగ్గా, గట్టిదనంతో రూపొందకపోతే పూర్తి డబ్బు వాపస్ (రవాణా నిర్వహణ ఖర్చులు మినహా) కొరకు అన్నింటినీ తిరిగి పంపించెయ్యండి. ఏ ప్రశ్నలూ వేయబడవు. దీన్ని నమ్మకంగా వ్రాసిన వారు (గట్టిగా, ఘంటాపథంగా చెప్పినవి) చెప్పిన కథలను చూడండి. ప్రతివారూ బాగా చేయొచ్చు అలాగే, అయితే ఎన్ని పౌన్లు, సెంటిమీటర్లను సౌనా సిస్టమ్-900 తో మీరు త్వరగా తగ్గిపోతారో ఆలోచించండింక.

**ఇంట్లో 14 రోజులు ఉచిత పరీక్షకు సదుపాయం!**

## శాస్త్ర యుక్తంగా సన్నపడండి. మాడిపోయే అవస్థ లేకుండా!

సంవత్సరాల తరబడి పరిశోధన, పరీక్షల ఫలితంగా రూపొందించబడిన అద్భుతమైన సౌనా సిస్టమ్-900 మీ శరీరంలో ఎక్కువైన లావును ఎక్కడ కావాలంటే అక్కడ డయిటింగ్ వ్యవహారం లేకుండా తగ్గించుకునేందుకు తోడ్పడుతుంది. తగ్గించే ఆహారాల ఫలితంగా మిగిలే వదులైన, పెలుసైన చర్మాన్ని మిగల్చదు. నిజానికి అందుకు వ్యతిరేకంగా పనిచేస్తుంది! ఎక్కువైన కొవ్వు మీలో తగ్గిపోతూ వుండగా మీ శరీరం మరింత నాజూగ్గా, గట్టిగా రూపొందుతుంది.

సౌనా సిస్టమ్-900 ఎంత త్వరగా, అపూర్వంగా పనిచేస్తుందంటే, మొదటి రోజునే తేడా ఏమిటో కొలుచుకు చూసుకోవచ్చు మీరు!

**కొవ్వు ఎందుకు మీకు...వదిలించుకోండి!**

మీరు తగ్గాలనుకుంటే సౌనా సిస్టమ్ మీ మాట కాదనదు. దాని ప్రత్యేకమైన కట్టుబడే విధానం మీరు తగ్గుతూ వుంటే ఆ మీ తీరుకు సరిగా అయిపోతుంది. మీరు మీ నడుము, తొడలు, తుంటిలోని కొవ్వు ఎంతెంత తగ్గిపోతున్నా సౌనా సిస్టమ్-900 మీకోసం పనిచేస్తుంది. దీని హెచ్చు తగ్గులమే తీరు ఓ అద్భుతం.

**గ్యారంటీగా ఫలితాలు, లేకపోతే మీ డబ్బు వాపస్**

మీ వయస్సు, పొడవు, మగ, ఆడ, ప్రస్తుతం వున్న తీరు ఏది ఏమైనా ఈ సత్వరమైన ఋజువైన విధానం, వేలాది పురుషులకు స్త్రీలకు చేసిన మేలు మీకూ చేస్తుంది. సౌనా సిస్టమ్-900 ఆయాస పడకుండా వళ్ళు తగ్గించుకునేందుకు అనువు.

సౌనా సిస్టమ్ తనదైన ఓ సులభ వ్యాయామ కార్యక్రమంతో లభిస్తుంది, తొందరగా మీ లావు తగ్గిస్తుంది.



బరువు తగ్గినవన్న బిడ్డవాడు
శ్రీ గుర్మీత్ సింగ్—లూధియానా
"నా నడుము, తుంటి మొత్తం 8 సెం.మీ. లావు తగ్గింది! సౌనా సిస్టమ్ అద్భుతంగా పనిచేసింది! కేవలం 6 నెలల్లో! 15 పౌన్ల బరువు తగ్గాను!"



శ్రీమతి మిల్డ్రెడ్ సి శేబర్—లాండ్ ఓ లేక్స్, ఫ్లోరిడా.
"సౌనా బెల్టుతో, వ్యాయామ కార్యక్రమంతో 32 పౌన్ల బరువు తగ్గాను! నా నడుము 8 సెం. మీ., తుంటి 11 సెం.మీ. లావు తగ్గాయి!"

**ఉచితం**






రోజు రోజుకూ మీరు తగ్గుతూంటే సాటిలేని ఫ్యాట్ మెజర్ తో మీరు సాధించినది కొలుచుకోండి.

వ్యాయామాలు, పౌష్టిక ఆహార విషయాల్లో చిట్కాలు పటాలతో 16-పేజీల పుస్తకంతో లభిస్తుంది. అన్ని స్పోర్ట్స్ దుకాణాలలోనూ. రూ. 196/-కి వివిపి ద్వారా. బుల్వర్కర్-డిపార్ట్మెంట్ ఎస్ఎస్-101 ఆర్ఆర్/85 మెహతా మహల్, 15 మేథ్యూ రోడ్, బొంబాయి. 400 004 నుండి కూడా దొరుకుతుంది.

## నేడే ఈ కూపన్ ని పోస్ట్ చేయండి!

**బుల్వర్కర్, మెహతా మహల్, 15 మేథ్యూ రోడ్, బొంబాయి-400 004.**

దయచేసి నాకు సౌనా సిస్టమ్ ని 14 రోజుల ఉచిత ఇంటి పరీక్ష కోసం వెంటనే పంపండి. ఫలితాలు నాకు పూర్తి సంతృప్తినివ్వకపోతే, నా పరీక్ష కాలం ముగియగానే నేను వస్తువులన్నిటినీ తిప్పి పంపి, వెంటనే డబ్బు (ప్యాకింగ్, పంపకం మొదలైన ఖర్చులు మినహాయించి) వాపసు చేయమని కోరవచ్చు.

SS-101-RR-Tel
SW-50

దయచేసి [illegible] గడిలో టిక్కు పెట్టండి.

☐ రిజిస్టర్డ్ పోస్టు పార్శిల్ లో పంపండి. నేను రూ. 196/- [illegible] ఓ./ఎమ్.ఓ. ద్వారా పంపుతున్నాను. [illegible] నెంబరు .......... (బుల్వర్కర్ ప్రై. లి. వారికి చెల్లించవలసినది).

☐ వి.పి.పి. ద్వారా పంపండి. పరపు అందిన మీదట పోస్టుమన్ కు నేను రూ. 196/- చెల్లించ గలనని మాట [illegible].

పేరు ..........

చిరునామా ..........

.......... పిన్ కోడ్ .......... సంతకం ..........

# ఉత్తరాలు

## సీరియల్స్

27 డిశంబర్ 85–2 జనవరి 86 సూపర్ హీరోయిన్ సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ముగ్ధమనోహరంగా ఉంది కాంచనసౌధం సీరియల్ ముగింపు చాలా బాగుంది ఇటువంటి సీరియల్‌ను అందించిన రావినూతల సువర్ణాకన్నన్ గారికి మా హృదయపూర్వక అభినందనలు

కొర్లపాటి ప్రదీప్‌కుమార్ అంబాజీపేట

* * *

నీడలు–నిజాలు సీరియల్ చదువుతుంటే లేఖ వ్రాయాలనిపించింది

ఈ సీరియల్‌లోని శారద జీవిత మలుపులు చదువుతుంటే మా హృదయాన్ని ఎంతో పట్టి పిండినట్లుగా మా దగ్గర ఆత్మీయులలో ఎవరికో ఏదో అన్యాయం జరుగుతుంది అన్నట్లుగా ఉండి మాకు తెలియకుండానే మా కనుల వెంట జలజల కన్నీరు కారిపోతుంది రచయిత్రికి అభినందనలు

షేక్‌శిలార్ ఇతరులు తక్కెళ్ళపాడు

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన సీరియల్ త్రివేణి సంగమం చాలా సహజంగా ఉంది సీరియల్ చిన్నదైనా మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది వర్తమాన సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని యదాతధంగా రచయిత వర్ణించారు

జయంతి కళ్యాణి బచేలి

## కథలు

13-19 డిశంబరు 85 తేదీగల ఆంధ్రసచిత్ర వారపత్రిక నటి భానుప్రియ ముఖచిత్రంతో సర్వాంగ సుందరముగా వెలువడి మమ్ముల నానందాబ్ధిలో ఓలలాడించింది ఈ వారం ప్రచురితమైన కథలలో కాకాని కమలగారి పుష్ప విలాపం మమ్ముల నాకర్షించింది ఏది వంచితమైన (స) రోజాను నేల రాలిన పూలతో సరిపోల్చటం బాగుంది రవీంద్రలాటి విశాల హృదయం గల యువకులు రోజాలాంటి యువతుల జీవితాలకు ఆశాజ్యోతులు కథను పూర్తిగా చదివాక ఒక మంచి కథను చదివామన్న తృప్తిని కలిగించింది ఈ కథ

స్వరాజ్యలక్ష్మి ఆనందగజపతిరావు
తెట్టంగి

## న్యూఢిల్లీ లేఖ

ఆసియా క్రీడోత్సవాలు నెహ్రూలను అదే పనిగా విమర్శించడం రష్యా గురించి అభూత కల్పనలు సృష్టించడం తన విదేశ పర్యటనలు గురించి డప్పు వాయించడం ఐదు చుక్కల హోటళ్ళు - తప్ప సమస్యలు లేవా? ప్రదాన ప్రతిపక్షాలు (బి జె పి ఉభయ కమ్యూనిస్టులు) ప్రాంతీయ పార్టీలు చిల్లరమల్లర పార్టీలు దేశ సమైక్యతకి ప్రగతికి అవలంబిస్తున్న పాత్ర చర్చించరేం? కానప్పుడు ఈ శీర్షిక ప్రయోజనం ఏమిటి - ఉపసంహరించండని కోరడం తప్పా?

వెసుమ అద్దంకి

## గమనిక

3-9 జనవరి 86 సంచికలో పడిన తీరని ఆకలి కథని రాసిన వారి పేరు వాసిరెడ్డిగా పొరపాటున ప్రచు రింపబడింది ఆ కథా రచయిత పేరు శ్రీ సి నరసి రెడ్డి అని పాఠకులు గమనించ కోరు తున్నాము

–సం




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

31 జనవరి-6 ఫిబ్రవరి 86
శ్రీ క్రోధన నామ సం పుష్య బ షష్ఠి
సంపుటము 78 . సంచిక 21

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు | 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు | 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాందీనగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక

# ECtv

సాటిలేని మేటి బ్లాక్ & వైట్
సామ్యము లేని అసామాన్య కలర్.



Electronics Corporation of India Limited
Hyderabad-500 762

A & M 85 ECIL 53 Te

# తొలగిపోతున్న భ్రమ !

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

నెహ్రూ తర్వాత ఎవరు? అని ఒకప్పుడు అనుకునే-వారు. తరువాత అది ఇందిరాగాంధి అనంతరం ఏమిటి? అయింది. మీరు నమ్మినా నమ్మకపోయినా రాజీవ్ తర్వాత ఏమవుతుంది? అన్నది ఇప్పటి ప్రశ్న.

బొంబాయిలో కాంగ్రెసు శత వార్షికోత్సవాల తమాషాకి హాజరయిన కాంగ్రెసువాదులలో ఎందుకు అంత నిర్లిప్తత కనిపిస్తున్నదన్న ప్రశ్నని తమని అడగవద్దని కాంగ్రెసువాది ఒకరు నాతో అన్నారు ప్రజలని ఆకర్షించగల వారి యువ నాయకుడు అధికారంలోకి వచ్చిన సంవత్సరంలోగానే ఈ పరిస్థితి ఏర్పడింది పార్టీలోని నిజాయితీగల వ్యక్తులే అలా అంటున్నప్పుడు ఇక మిగిలిన మనవంటివారు దానిని జాగ్రత్తగా గమనించవలసిన తరుణం ఆసన్నమైంది

పొరపాటు ఎక్కడ జరిగిందన్నది నాకు తెలియదు గాని మొత్తం మీద జరిగిందన్నది ఖచ్చితంగా తెలుస్తున్నది పోయిన సంవత్సరం ప్రత్యేకంగా అంత చెడ్డదని చెప్పలేము కాని అంత మంచిదని చెప్పటానికి వీలులేదు బొంబాయినగరం ఎప్పుడూ నెహ్రూలపట్ల మంచి ఆదరణని చూపిస్తూనే ఉన్నది రాజీవ్‌గాంధి బొంబాయిలోనే పుట్టారు అందుకే వెళ్ళిన చోటల్లా తాము కూడా వారిలో ఒకరమని చెప్పుకున్నారు కాని డిసెంబర్ 27న ఆయన బొంబాయి వెళ్ళినప్పుడు అక్కడి వీధులలో ఆయనకి స్వాగతం చెప్పిన సహృదయులు ఒక్కరుకూడా కనిపించలేదు ఆయన విమానం బొంబాయిలో దిగిన కొద్ది సేపటికే నేను వెళ్ళిన విమానం కూడా అక్కడ దిగింది దాదాపుగా ఆయన వెనుకే నేను కూడా నగరంలోకి వెళ్లాను ఆయనని చూసి ఎవరైనా జాలిపడవలసిందే! జెండాలు మొదలైన వాటి కోసం ఆయన పార్టీవారు కోట్ల రూపాయలు ఖర్చు పెట్టారు కాని ఒక్కరూ చివరికి చిన్న పిల్లవాడైనా ఎక్కడా జండా పట్టుకొని కనిపించలేదు. నగరంలోకి వెళ్ళిన తర్వాత అక్కడ జండాలు పట్టుకొని కనిపించిన వాళ్ళందరూ కిరాయి మనుషులు. అదంతా చూస్తుంటే పెళ్ళిళ్ళకి అలంకారం చేసే కాంట్రాక్టర్లు చేసిన పనిలాగా కనిపించింది. ప్రజలు సహజంగా ఎక్కడా ఎందులోనూ పాల్గొన్నట్లు అనిపించలేదు ఆఖరికి పంద సంవత్సరాల కిందట మొట్టమొదట సభ జరిగిన గవాలియా చెరువు ప్రాంతంలో కూడా అలాంటిదేమి కనిపించలేదు జనంకన్నా రక్షణకోసం ఏర్పాటు చేయబడిన సిబ్బందే ఎక్కువగా కనిపించారు కాంగ్రెసుపార్టీ అధ్యక్షుడి కోసం తయారు చేసిన ఆ ఉపన్యాసం కన్నా ఏ స్కూలు పిల్లవాడయినా బాగా మాట్లాడ ఉండేవాడు

కాని పార్టీవారికి ఆయనపై ఉన్న భ్రమలు తొలగిపోవడానికి కారణం అది కాదు ఆ ఉపన్యాసాలు ఎంత బాగున్నాయన్న దానిని కాంగ్రెసువారు పట్టించుకోరు వాళ్ళ శ్రద్ధంతా అధికారంలోకి రావాలన్న దానిమీదే ఉంటుంది శ్రమలేకుండా ఎవరైతే దానిని వారికి ఇవ్వగలరో వారెలాంటి వారైనా సరే సర్వకు పొగలుగుతారు రాజీవ్ వారికి వొరగబెట్టింది ఏమీలేదు ఆయన రెండు రాష్ట్రాలని మూడు నెలల లోపుగానే పోగొట్టుకున్నారు ఏ కాంగ్రెసువాది అయినా నిజంగా మరిచిపోలేని విషయం అది అలాంటి పరాజయాలు ఇంకా ఒకటో రెండో ఎదురైతే వారు అసలు తమ విజయానికి మొట్టమొదట కారకులైన వారిని కూడా తప్పకుండా విస్మరిస్తారు

కాంగ్రెసు అన్నది ఒక రకంగా చూస్తే అసలు ఒక పార్టీయే కాదు దానికి ఒక రాజ్యాంగం అన్నది లేదు ఎన్నో సంవత్సరాల పాటు దానికి ఎన్నికలంటూ ఉండేవికావు దానికి ఒక సిద్ధాంతం అంటూ ఏదీ లేదు నిజంగా చెప్పాలంటే అది మంచినీళ్లలాంటిది మీరు దానిలో ఏ రంగు కలిపితే మీకు ఆ రంగులో కనిపిస్తుంది అది క్యాపిటలిస్టూ కాదు సోషలిస్టూ కాదు అయినా వాణిజ్యవేత్తలు దానిని తమ పార్టీగా భావిస్తారు. సోషలిస్టులు, అలాంటి జాతి అంటూ ఇంకా ఒకటి ఉంటే వాళ్ళు కూడా దానిని తమదిగా చెప్పుకుంటారు సిద్ధార్థ శంకర్ రే వంటివాళ్లు మరొక రకం కాంగ్రెసువాదులు మీకు గుర్తున్న పార్టీలన్నిటిలోనూ ఆయన ఉండి ఉంటారు ఇప్పుడాయన కాంగ్రెసుకి ఎంత సన్నిహితంగా ఉన్నారో ఒకప్పుడు కమ్యూనిస్టులకి కూడా ఆయన అంత దగ్గరవారు వాళ్ళిద్దరికి ఆయన అంటే ఎంత ఇష్టం ఉందన్నది నాకు అనుమానమే వాస్తవానికి రే వంటి వ్యక్తులే మంచి కాంగ్రెసు వాదులు కాగలరు కొంత నెహ్రూ నకిలీ సోషలిజం కొంచెం ఇందిరాగాంధి కపటం సంజయ్‌గాంధి యొక్క అర్థంలేని సాహసం ఆయన సోదరుడిలో కనిపించే అసహనంలాంటివన్నీ కలగలసి రే ఒక చక్కని కాంగ్రెసువాదిగా రూపొందారు పై లక్షణాలన్నిటిని కలిపి బాగా మదిస్తే కాంగ్రెసువాది కాంగ్రెసు పార్టీ అన్న రసాయనిక మిశ్రమం తయారవుతుంది కాలానుగుణంగా అది మారిందని కొందరు అన్నప్పటికి అసలు అది సంభవమేనా అని నా సందేహం! మహాత్మాగాంధి గారి హయాములో కూడా సవ్యమైన ఎన్నికలు లేవు సుభాస్‌చంద్రబోసు వంటి వ్యక్తి పార్టీ పెద్దలకి ఎదురు చెప్పినందుకు ఆయన పార్టీవదిలి వెళ్లాల్సిన పరిస్థితి ఏర్పడింది మరి ఆ కాలంలో నెహ్రూ ఏమి చేసారు? ముఖ్యమైన సమస్యలు తల ఎత్తినప్పుడల్లా చేసినట్లే ఆయన ఆ పెద్దలని అనుసరించి నడుచుకున్నారు

**దేశంలోని కోట్లమంది ప్రజలు తలదాచుకోడానికి గూడు లేనటువంటి ఈ పరిస్థితిలో తాజ్‌మహల్ హోటల్‌వంటి చోట మీరు రోజుల తరబడి ఎలా ఉండగలుగుతున్నారని నేను ఒక పార్టీ మనిషి పార్లమెంటు సభ్యుడు అయిన ఆయనని అడిగాను ఓహ్! మీకు తెలియదా? అన్నాడాయన ఖరీదైన చికెన్ ముక్కని ఆస్వాదిస్తూ దాని వెల వంద రూపాయలకి తక్కువ ఉండదు ఆ ఖర్చు ఆయన పెట్టుకుంటారా? లేక మరొకరు భరిస్తారా? అన్నది**

వేరే విషయం ఇంకా ఇలా అన్నాడాయన' మీకు తెలియదా? నిజానికి సరోజనీనాయుడు పేర నెలకి రు 500 అద్దెకి ఆమె పేర ఎప్పుడూ ఒక సూట్ బుక్‌చేసి ఉండేది హోటల్‌లో' కాంగ్రెసువారు సంప్రదాయం విషయంలో కచ్చితంగానే ఉంటారు సరోజినీనాయుడుకి తాజ్ బాగుంటే జగదీష్ టైట్లర్ హెచ్ కె ఎల్ భగత్‌లకి కూడా తప్పకుండా బాగుంటుంది

తాజ్ హోటల్ అంతా జగదీష్ టైట్లర్‌లు భగత్‌లే తీసేసుకున్నారు రేపు అన్నది లేనట్లుగా ధారాళంగా డబ్బు కర్చు చేసారు అయితే ఈ ఉత్సాహం వెనుక వాళ్లకి ఏదో జరిగిపోతున్నదని జరగబోతూ ఉందన్న భయం నీడలా వెంటాడుతూనే ఉంది రాజీవ్ ఆకర్షణ అనే అంత వారికి ఉన్నదికదా? అని ఎవరో అన్నారు మరి బొంబాయి ప్రజలు ఆయన ఆకర్షణకి ఎందువల్ల దూరంగా ఉన్నారన్న చేదు నిజం దానికి జవాబు ఆకర్షణ అన్నది కొన్ని సమయాలలో పనిచేస్తే చేసి ఉండవచ్చు కానీ దానిని గురించి అతిగా చెప్పడం జరుగుతున్నదని నా అభిప్రాయం గతంలో ఎన్నికలు భయం అనే ముసుగులో జరిగాయి ఇప్పుడు చాలామంది ప్రజలు దానిని చూడగలుగుతున్నారు భయం అన్నది మిగతా వాటన్నిటికన్నా ఎక్కువ వోట్లని సంపాదించి పెడుతుంది సంక్షోభం అరాచకం వస్తుందన్న భయంతోనే భయపడేవారంతా వోట్లు వేయడం జరిగింది ఇప్పుడు కూడా అలాంటి భయం కొన్ని వర్గాలలో ఉన్నది ఈ మధ్యనే నేను ఒక వ్యక్తిని కలుసుకొన్నాను దాదాపు నెల రోజులు అయి ఉంటుందేమో ఆయన కార్యాలయాలపై దాడులు జరిగి ఆ విషయం బాగా ప్రచారం చెయ్యబడింది కూడా దేశంలో ఉన్న నిజాయితీపరులైన వారిలో ఆయన ఒకరు కానీ ఆయన కూడా ఎక్కడో పొరపాటు జరిగి ఉంటుందనే అనుకుంటున్నారు దీనికి కారణం ఎవరై ఉంటారని మీ ఉద్దేశ్యం అని నేను ఆయనని అడిగాను ఎవరో క్రింది వర్గంలో ఉండే ఇన్‌స్పెక్టర్‌లాంటి వారే అయి ఉంటారని ఢిల్లీలో ఉన్నవారెవరూ అయి ఉండరని ఆయన ఎంతో నమ్మకంగా అన్నారు పైనించి ఆదేశాలు లేకుండా కోటీశ్వరుల కార్యాలయాలపై గుమాస్తాలు దాడి చెయ్యరని నేను ఆయనతో అన్నాను సహజంగానే అటువంటివి ఆయనకి క్లేశాన్ని కలిగించి ఉంటాయి అయినా ఎంతోమంది భారతీయులలాగే ఆయనకూడా నిజాయితీ గల రాజకీయవాదులు అలాంటి పనులు చెయ్యరనే నమ్ముతున్నారు స్టాలిన్ హయాములో భయోత్పాతాన్ని సృష్టించినది ఆయన క్రింది అధికారులేనని సాధారణ కమ్యూనిస్టు సైనికులు అనుకున్నట్లు ఉంది ఆయన నమ్మకం

కాంగ్రెసువారు ఇంకా రాజీవ్ తర్వాత ఎవరు? అని అడుగుతారా? దానికి నేనిచ్చే సమాధానం చాలా సులువైనది ఎవరైనా కావచ్చు కానీ ఆ వ్యక్తి మరొక కాంగ్రెసువాడే అయి ఉంటారు □

సీరియల్

# ఎన్. భారతీదేవి



# ప్రేమసాగరం

## (గత సంచిక తరువాయి)

"స్వప్నా' నన్ను గురించి నా ఫ్రండ్స్ ఏమనుకుంటున్నారో తెలుసా? స్వప్నను గుండెల మీదకు లాక్కుంటూ అన్నాడు జయరాం

ఏమనుకుంటున్నారేమిటి? అతని కళ్ళలో కళ్ళు పెట్టి చూస్తూ గోముగా అడిగింది స్వప్న

నేను నీ మైకంలో పడిపోయి వాళ్ళను మరిచిపోయానంట ఇంత త్వరగా మీ ఆవిడ నిన్ను ఎలా కొంగున ముడి వేసుకోగలిగిందిరా? అని ఆశ్చర్యపోతున్నారు

అందరూ అలా అనుకోవటం వరకే

వాళ్ళు అన్న మాటల్లో అబద్ధం ఏముంది? నీ కొంగు ముడిలో చిక్కుకుపోయి నువ్వే ప్రపంచం అనుకుంటున్నానా? లేదా?

చిరునవ్వుతో స్వప్న పెదవులు విచ్చుకున్నాయి

కొంత కాలానికి నీ ప్రేమలో నన్ను నేనే మరిచిపోతానేమో స్వప్నా ఆమె అధరాలను మునిపళ్ళతో అందుకుంటూ అన్నాడు

ఒకరి ప్రేమలో ఒకరు తన ఉనికిని మరిచిపోయి గడపగలగటమే ప్రేమ అతని క్రాఫ్ చెరుపుతూ అంది అతని చేతులు ఆమె చుట్టూ మరింత బిగుసుకుంటున్నాయి

మళ్ళీనా?

**జరిగిన కథ- 2** రఘునాద్ సిటీలో పేరున్న పెద్ద బిజినెస్ మ్యాగ్నెట్ హాస్పిటల్‌లో ఉన్న స్వప్నను చూడను వెళ్ళిన రఘునాద్‌కు గతం గుర్తుకు వస్తుంది మాదవరావు రామారావు ప్రాణస్నేహితులు మాదవరావు గారి ఏకైక కూతురు స్వప్న రామారావుగారి కొడుకు రఘునాద్ పిల్లలు పుట్టినప్పట్నించి స్నేహితులిద్దరు వియ్యమందుకోవాలనుకొనేవారు స్వప్నంటే రఘునాథ్‌కి అమితమైన ప్రేమ కానీ స్వప్న జయరాంను ప్రేమించింది జయరాంకు స్వప్నంటే ప్రేమే స్వప్న పుట్టిన రోజు పండుగను ఘనంగా హోటలులో చేయాలనుకొంటారు మాదవరావుగారు పార్టీలో స్వప్న జయరాంతో సన్నిహితంగా ఉండటం రఘునాద్‌కి బాధ కలిగించింది స్వప్న జయరాంల పెళ్ళి జరిగిపోయింది రఘునాద్ తండ్రి తల్లి చనిపోయారు రఘునాద్‌కి బిజినెస్‌లో కలిసివచ్చింది పట్టిందల్లా బంగారం అయింది నాయర్ పిలుపుతో గతంలోనుంచి తేరుకొన్నాడు స్వప్నకు మతిభ్రమించిందని తెలిసి నాయర్ కళ్ళలో కూడా నీళ్ళు తిరిగాయి మెంటల్ హాస్పిటల్‌లో ఒంటరిగా కూర్చున్న స్వప్న మనస్సు గతం వైపు పరుగుతీసింది స్వప్నకు భర్తంటే ప్రాణం స్వప్న భర్తగా జయరాం అంతస్తు హోదా పెరిగింది

నీ శరీరం నా శరీరాన్ని తాకితే చాలు నా శరీరంలో విద్యుత్తు ప్రవహిస్తుంది

వద్దండీ గోముగా అంది

నాకు కావాలండీ ఆమెను అనుకరిస్తూ అన్నాడు

పగలూ రాత్రీనా?

నువ్వు నా వెంటపడి పెళ్ళి చేసుకుంది ఇందుకేగా ఆమె వైపు చిలిపిగా కన్నుగిటుతూ అన్నాడు

ఛీ పొండి అతని గుండెల్లో ముఖం దాచుకుంటూ అంది

పొండి అంటే రండి అని అర్థం ఆమెను మరింత గాడంగా కౌగిలించుకున్నాడు

వద్దండీ గోముగా అంటూనే అతనికి మరింతగా హత్తుకుపోయింది స్వప్న ఇష్టంగా ప్రియంగా పూవులా అతని బలమయిన చేతుల మధ్య నలిగిపోయింది అలసిపోయిన ఆమె కనురెప్పల మీద మృదువుగా చుంబించి పక్కకు తిరిగి పడుకున్నాడు జయరాం

* * * * *

ఇంటికొస్తుంటే జయరాంకు స్నేహితుడు మోహన్ కనిపించాడు అతనితో కల్సి హోటల్ కెళ్ళి టిఫిన్ చేసి మాట్లాడి వచ్చేసరికి చాలా ఆలస్యం అయింది భర్తతో కల్సి సినిమా కెళ్ళటానికి తయారయి కూర్చుంది స్వప్న అతనొచ్చేసరికి ఏడు గంటలు దాటింది దాంతో ఆమె కోపం తారాస్థాయికి చేరుకుంది

బెడ్‌రూములో కెళ్ళి తలుపులు మూసుకుంది జయరాం బెడ్‌రూములో కొచ్చిన అలికిడి వినిపించినా స్వప్న కళ్ళు తెరవలేదు బెడ్ మీద నుంచి లేవలేదు

స్వప్నా' మృదువుగా పిలిచాడు

స్వప్న పలకలేదు

కోపమొచ్చిందా? ఆమెను అనుకుని కూర్చుంటూ అడిగాడు

సమాదానం చెప్పకుండా గోడ వైపుకు తిరిగి పడుకుంది

నువ్వు మాట్లాడకపోతే నేనుండగలనా? అన్నాడు బుజం మీద చెయ్యేసి ప్రేమగా

అప్పటికీ మాట్లాడకపోయేసరికి బలవంతంగా ఆమె ముఖాన్ని రెండు చేతులతో పట్టి తన వైపుకు తిప్పుకున్నాడు ఒక గంట దాకయినా అతనితో మాట్లాడ కూడదనుకుంది కానీ భర్త కళ్ళలోకి చూడగానే అతనితో మాట్లాడకుండా ఉండలేకపోయింది

ఇప్పటి వరకూ ఎక్కడి కెళ్ళారు?

స్వప్న కోపానికి కారణం అదేనని అతనికి తెల్సు

మోహన్ కనిపించాడు స్వప్నా' నెల రోజుల తర్వాత కనిపించాడు కదా అని వాడు బలవంత పెడితే వాడితో కల్సి హోటల్ కెళ్ళాను అందుకని కాస్త

ఆలస్యమయింది

ఆ మోహన్ అప్పుడప్పుడూ కనిపిస్తూనే ఉంటాడు నా సమయాన్ని పాడు చేస్తుంటాడు అతనో శతృవయ్యాడు నాకు అంది ఉక్రోషంగా

సారీ! స్వప్నా!

ఇదొకటి నేర్చారు నేను బాధపడతానని తెల్సినా ఆలస్యంగా రావటం సారీ! స్వప్నా అని తీయగా చెప్పటం మీ కలవాటయి పోయింది

సారి చెప్పకపోతే నీ కోపం తగ్గదుగా? లాలనగా ఆమె ముంగురులు సవరించాడు

అంటే మీరు బాధపడి నన్ను అనునయించటానికి కాదన్నమాట నాకు సారి చెప్పేది

అబ్బ! స్వప్నా! నీతో ఎలా మాట్లాడాలో మన పెళ్ళయి రెండు సంవత్సరాలయినా నా కర్థం కావటం లేదు ఏం మాట్లాడితే ఏం కోపం వస్తుందో అని భయపడి మౌనంగా ఉంటే నాతో ఎందుకు మాట్లాడరని గొడవ చేస్తావు ఎలా నీతో?

మీరు ఆలస్యంగా వచ్చినందుకు శిక్ష ఏమిటో తెలుసా?

స్వప్నా! ఒక చిన్న కోరిక నువ్వేశిక్ష అయినా వెయ్యి నువ్వు మాత్రం నా పక్కనే ఉండాలి

అతని మాటలకు ఆమె మనస్సు కరిగి పోయింది కోపం ఎగిరి పోయింది

ఇంకెప్పుడూ ఆలస్యంగా రారుగా?

అప్పుడప్పుడు తప్ప అన్నాడు నవ్వుతూ

అదిగో మళ్ళీ కోపంగా చూసింది

అమ్మో! అలా చూడకు ఆ చూపంటే నాకు భయం ఇంకెప్పుడూ ఆలస్యంగా రాను

నా మనస్సును అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి మీరు రావటం ఒక్క గంట ఆలస్యమయితే చాలు ఒక సంవత్సరం గడిచినట్టు అనిపిస్తుంది నాకు మీలో ఏ కాస్త మార్పు కనిపించినా నేను భరించలేనండి అతని ఛాతీమీద నల్లగా రింగులు తిరిగున్న జుట్టును చేత్తో పట్టి లాగుతూ అంది

నీ మనస్సు నాకు తెల్సు స్వప్నా! నేను నిన్ను బాధ పెట్టాలని ఆలస్యంగా వస్తున్నాననుకుంటున్నావా? నువ్వు బాధ పడతావని స్నేహితుల్ని కల్సుకోవటానికి వెళ్ళటం మానుకున్నాను నా కెంతో ఇష్టమయిన క్రికెట్ ఆటను కూడా మానేసాను ప్రాణస్నేహితుడు కనిపిస్తే పారిపోయి ఎలా రాను చెప్పు?

కొద్దిసేపు మాట్లాడి వచ్చెయ్యొచ్చుగా? గంటలు గంటలు గడపాలా?

మాట్లాడుతుంటే అనుకోకుండా టయమ్ గడిచి పోతుంది

మీకు గడిచిపోతుంది బాగానే ఉంది కానీ ఇక్కడ నాకు ఒక్కొక్క నిముషం ఒక్కో గంటలా గడుస్తుంది

నేను చాలా అదృష్టవంతుణ్ణి స్వప్నా

ఎందుకో?

నన్ను గురించి ప్రతిక్షణం ఆలోచించే నువ్వున్నావు ఏ రోజు కా రోజు మొదటి రాత్రిలా తృప్తిగా గడిచి పోతుంది నా జీవితం ఈ సంతోషానికి మించిన సంతోషం ఇంకేముంటుంది చెప్పు అతని మాటల్లో సహజత్వం కనిపిస్తుంది

స్వప్నా!

"ఏమిటి?"

"కోపం పోయిందా?"



# ప్రేమసాగరం

నా కోపానికి మిమ్మల్ని చూస్తే బయం మీరు కనిఎంచగానే ఎగిరి పోతుంది అంది నవ్వుతూ

నవ్వుతో పూవులా విచ్చుకున్న ఆమె నోటిని తన నోటితో మూసాడు

* * * *

అప్పుడే బయట నుంచి వచ్చిన జయరాం బట్టలు కూడా మార్చుకోకుండా, బాల్కానిలో కొచ్చి కూర్చున్నాడు అతను రావటం చూసి అక్కడికి వచ్చిన స్వప్న సీరియస్‌గా ఉన్న అతని ముఖం చూసి

వెళ్లిన పని ఏమయిందండి? అంది

ఆ సంబంధం వదులుకోవటం మంచిది స్వప్నా

ఎందుకనండి అన్నివిధాలా మన లక్ష్మికి అనుకూలమయిన సంబందం వదులుకుంటే ఇంతకంటే మంచి సంబందం వస్తుందనా?

ఇంతకంటే మంచి సంబంధం లక్ష్మికి నేను తేగలను?

మరే కారణంగా వదులు కుందామను కుంటున్నారు? పిల్లాడు బాగున్నాడు బ్యాంకులో మంచి ఉద్యోగం వెనుక ఆస్తిపాస్థు లున్నాయి

వాళ్ళు లక్ష రూపాయలు కట్నం కావాలన్నారు

నాన్నగారు లక్ష్మికి కట్నంగా లక్ష రూపాయ లిద్దామని ఎప్పుడో చెప్పారుగా?ఇంకా ఆలస్యం ఎందుకండి? వెంటనే ముహూర్తం పెట్టించండి

కట్నం గాక లాంచనాలవి ఘనంగా జరిపించాలన్నారు ఆడపడుచు కట్నం అయిదు వేలివ్వాలంట లక్ష్మికి మనం కనీసం ముప్పయి తులాలయినా బంగారం పెట్టాలంట కట్నం డబ్బు మామయ్యను అడగటానికే నాకు సిగ్గుగా ఉంది పెళ్లి ఖర్చులకూ లాచనాలకూ బంగారానికి ఇంకో లక్ష రూపాయలయినా ఖర్చవుతుంది ఎం చెయ్యాలో తోచటం లేదు నా తాహతుకు తగిన సంబందం చూస్తానంటే కాదన్నావు ఇప్పుడు చూడు

ఇప్పుడు మాత్రం ఏమయింది? వాళ్ళడిగింది ముప్పయి తులాల బంగారమేగా? మా అమ్మది గాక నాకోసం చేయించిన నగలు దాదాపు వంద తులాలుంటాయి నా బంగారం ఇస్తాను పెళ్ళి ఖర్చులు లాంచనాలు అన్నీ అమ్మా నాన్నగారే చూసుకుంటారు

స్వప్నా' వెయ్యిజన్మల పుణ్యపలంతో నిన్ను పెళ్ళిచేసుకున్నానేమో

పొగడ్తలు మానేయండి

పొగడ్తలు కాదు స్వప్నా' నిన్ను పెళ్ళిచేసుకున్న తర్వాత నా అంతస్థు పెరగటంకాదు నా చెల్లెలు కూడా గొప్పింటి కోడలు కాబోతుంది నువ్వు నా జీవితంలోకి ప్రవేశించకపోతే ఏ గుమాస్తాకో లక్ష్మినిచ్చి పెళ్ళిచేసేవాడిని దాని బవిష్యత్తుకు బంగారు బాట వేసావు మా కుటుంబం అంతా నీకు ఋణపడి ఉంటుంది స్వప్నా స్వప్న చేతిని తన పెదవులకాన్చుకుంటూ అన్నాడు

ఇది నా బాధ్యత

ఉప్పొంగే ఆనందతో 'బాష కందని బావాలతో ఆమెను వడిలోకి లాక్కున్నాడు

ఎదురింటి డాబామీద చదువుకుంటున్న అమ్మాయిలున్నారు చూడండి మనవైపే చూస్తున్నారు ప్రపంచంలో ఉన్నది మనిద్దరమే అన్నట్టుగా, ఎప్పుడుపడితే అప్పుడు దగ్గరకు తీసుకోబోతారు

వాళ్ళు పాఠాలతో బాటు మనల్ని చూసి ప్రేమ పాఠాలు కూడా నేర్చుకుంటారు అమెను మరింత గాడంగా గుండెలకు హత్తుకున్నాడు

స్వప్న అతి ప్రయత్నం మీద అతన్ని తప్పించుకుని లోపలికొచ్చింది ఆమె వెనకనే లోపలికొచ్చిన జయరాం స్వప్న వారిస్తున్నా వినకుండా బెడ్‌రూము తలుపులు మూసాడు

* * * * *

లక్ష్మికి అనుకున్న సంబందమే ఖాయం చేసుకురావటానికి మాధవరావుగారు జయరాం అమలాపురం వెళ్లారు

స్వప్నా' త్యాగానికయినా ఒక హద్దుంటుంది నాకోసం ఇంత డబ్బు ఖర్చు చెయ్యటం ఎందుకు? నాకు డిగ్రీ ఉంది ఉద్యోగం దొరికింతర్వాత నాకు తగినతన్నే పెళ్ళిచేసుకునేదాన్ని ఇంత కట్నం ని బంగారం ఈ లాంచనాలు ఇన్ని తసుకుని పెళ్ళి చేసుకోవటానికి నాకే సిగ్గుగా ఉంది మి నాన్నగారు నీ కొసం శ్రమపడి సంపాదించిన ఆస్తిని నా కోసం ఖర్చు చేస్తున్నావు ఈ సంబం నిర్ణయించకుండా ఉంటేనే మంచిదనిపిస్తుంది అంది లక్ష్మి బాధగా

లక్ష్మి' నేను నీకు పరాయిదాన్నా? నీకు పెళ్ళిచేసి, అత్తగారింటికి పంపించటం మా బాధ్యత వరకట్నాలు రూపుమాసిపోతాయంటారు అదిప్పట్లో జరిగే పనికాదు అవినీతిని నిర్మూలించటం వరకట్నాలను నిషేదించటం మాటల్లోనే తప్ప క్రియాత్మకంగా తొలగించటం సాద్యంకాదు ని డబ్బు నా డబ్బు అంటూ నన్ను వేరు చేసి మాట్లాడకు లక్ష్మి

స్వప్నా

కాబోయే పెళ్ళికూతురు ఇటువంటి చికాకులతో మనస్సు పాడు చేసుకోకుండా సంతోషంగా హుషారుగా ఉండాలి నువ్వెంత ఆనందంగా ఉంటే మి అన్నయ్యకంత తృప్తిగా ఉంటుంది

నీ త్యాగాన్ని బరించలేకపోతున్నాను స్వప్నా

త్యాగంకాదు బాద్యత అని చెప్పాను ఇక ఆ విషయాన్ని వదిలేయి లక్ష్మి నా నగలన్నీ చూపిస్తాను అందులో నీకు నచ్చిన వస్తువులు తీసుకో

వద్దు స్వప్నా' నేనా పని చెయ్యలేను

మి అత్తగార్కి నీకు ముప్పయి తులాల బంగారం పెట్టి నిన్ను






ఎంపుతానని చెప్పారు మి అన్నయ్య

నువ్వు బంగారం పెట్టుకెళ్ళకపోతే మి అన్నయ్య మాట బోతుంది అది నీకిష్టమా?

మంచితనంతో నా నోరు మూయాలని చూస్తున్నావు

నీ పెళ్ళికి ముహూర్తం నిర్ణయించబోతున్నఈ సంతోష సమయంలో సరదాగా ఇద్దరం కల్సి మ్యాట్నికెళదాం ఎలాగూ మి అన్నయ్య వచ్చేసరికి పొద్దుపోతుంది బోర్‌గా ఉంది పిక్చర్‌కెళదాం త్వరగా తయారవు అంది స్వప్న మాట మారుస్తూ

మరో పది నిమిషాల తర్వాత ఇద్దరూ సినిమాకు బయలుదేరారు

* * * * *

పిండారబోసినట్టుగా ఉన్న వెన్నెలలో తడుస్తూ భర్త గుండెల మీద తలపెట్టుకుని పడుకుంది స్వప్న ఆకాశం వైపు చూస్తూ పడుకున్నాడు జయరాం అతని కుడి చెయ్యి ఆమె చెంపలూ జుట్టూ నిమురుతుంది

వెన్నెల వెలుగుల ముందు తారకల మోములు చిన్నబోతున్నాయి చల్లటి చిరుగాలి ఆహ్లాదకరంగా ఉంది

స్వప్నా!

ఊ మత్తుగా మూలిగింది స్వప్న

మనకు పెళ్ళయి మూడో సంవత్సరం కూడా జరుగుతోంది కదా? నువ్వింకా తల్లివికాలేదు ఎందుకని?

మీకప్పుడే డాడీ అని పిలుచుకోవాలని కోరికగా ఉందా? అంది నవ్వుతూ

మోహన్ పెళ్ళి మన పెళ్ళి ఒకే నెలలో జరిగింది వాడికప్పుడే ఇద్దరుపిల్లలు నా ప్రయత్నంలో ఎలాంటి లోపంలేదు మరి మనకెందుకు పిల్లలు పుట్టలేదు?

అబ్బ! పుడతారులెండి పెళ్ళయి అయిదేళ్ళయినా కాలేదు అప్పుడే పిల్లలు పిల్లలు అంటూ కలవరిస్తున్నారేమిటండీ? పుట్టక ముందు, పిల్లలు కావాలనిపిస్తుంది పుట్టింం తర్వాత వాళ్ళ గొడవ భరించలేక ఎందుకు కన్నామా? అనిపిస్తుంది నాకయితే ఇప్పుడప్పుడే పిల్లలు కావాలని లేదు హాయిగా, ఇంకా కొంతకాలం నా జీవితాన్ని నాకిష్టమయిన రీతిలో గడపాలనుంది

నాకయితే ఎంత త్వరగా కొడుకు పుట్టి నన్ను డాడీ అని పిలుస్తాడా? అనిపిస్తుంది

పిల్లలంటే మీకంత ఇష్టమా?

చాలా ఇష్టం మాటల్లో చెప్పలేనంత

మనం ఒకరికి ఒకరంగా ఇలాగే ఉండిపోవాలనిపిస్తుంది మన మధ్యకు పిల్లలు రావటం కూడా నాకిష్టంలేదు ఎందుకో చెప్పనా? మీ అపారమయిన ప్రేమంతా నాకే దక్కాలి నాకు పుట్టిన పిల్లలయినా సరే మీ ప్రేమలో బాగం పంచుకుంటే నేను భరించలేనేమో

జయరాం స్వప్న కళ్ళలోకి కళ్ళు విప్పార్చుకుని చూసాడు ఆమె ప్రేమకు అతని కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి

నిజమండీ! ఇది ప్రేమో పిచ్చో నాకే తెలియదు మీ మీద మరో ఆడదాని నీడ పడితే చాలు పేగులు తెంపుతున్నంత బాదనిపిస్తుంది

స్వప్నా! నేను ఏకపత్నీవ్రతుణ్ణి కలలో కూడా ఇంకెవర్ని గురించి ఆలోచించను తెలుసా?

మగబుద్ధి కుక్క బుద్ధిలాంటిది భార్యలు ఎదురుగా ఉన్నంత సేపూ ప్రతి మగాడూ, నేను ఏకపత్నీవ్రతుణ్ణి శ్రీరామచంద్రుణ్ణి అంటూ కబుర్లు చెబుతారు భార్య నాలుగు రోజులు పుట్టింటికెళితే చాలు విదినపడతారు

మరి అన్యాయంగా మాట్లాడుతున్నావ్ స్వప్నా! నేనెప్పుడయినా ఇంకో అమ్మాయిని గురించి మాట్లాడగానయినా విన్నావా?

నేను చేసే గొడవకు భయపడి శ్రీరామచంద్రుడిలా ఉంటున్నారు అంది నవ్వుతూ

స్వప్నా!

చెప్పండి

నా కోరిక తీర్చవూ?

మీ కోరికేమిటో నాకు తెలియకుండానే తీర్చటమెలా? అంది నవ్వుతూ

నాకు కొడుకు కావాలి

ఇంతసేపు చెప్పినా మళ్ళీ మొదటికొచ్చారా?

ఒకసారి లేడీ డాక్టరు దగ్గరకెళ్ళి పరీక్ష చేయించుకుంటే మంచిదేమో

ఎందుకు?

మనకు పెళ్ళయి మూడు సంవత్సరాలయినా ఇంతవరకూ నీకు ప్రెగ్నెంట్ రాలేదుగా? ఏ లోపం లేకపోతే ప్రెగ్నెంట్ ఎందుకు రాదు? పరీక్ష చేయించుకుంటే తెల్సిపోతుందిగా?

మా అమ్మకు పెళ్ళి అయిన నాలుగు సంవత్సరాలకు నేను పుట్టానంట మన పెళ్ళయి నాలుగేళ్ళయినా కాలేదు అప్పుడే ఇంత ఆతృత ఎందుకండీ? వాళ్ళే పుడతారు

నా మాట వింటావా? వినవా?

ఇంకో సంవత్సరం వరకూ వినను

పోనీ నాసంతృప్తి కోసమయినా ఒకసారి డాక్టర్ దగ్గరికి వెళ్ళకూడదూ?

ఇప్పుడేం మాట్లాడొద్దు స్వప్న అతనికి చేరువయింది అతని చేతులు ఆమె చుట్టూ బిగుసుకున్నాయి

* * * * *

లక్ష్మి భర్త ఉద్యోగరీత్యా హైదరాబాదులో ఉంటుంది ఆమెక్కూడా అక్కడుద్యోగం రావటంతో ఇంట్లో ఉండటానికని వాళ్ళమ్మగార్ని తీసుకెళ్ళింది

ఇప్పుడిక జయరాంకు ఏ బాధ్యతలేదు స్వప్నతో కల్సి సినిమాలకూ షికార్లకూ తిరగటం రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి

స్వప్నకింకా పిల్లలు పుట్టలేదని మాదవరావుగారి దంపతులకు బాదగా ఉన్నా అప్పుడే వద్దనుకున్నారేమో అనుకుని ఊరుకొన్నారు

జయరాం మోహన్ ఇంటికెళ్ళేసరికి అతను ఆపీసు నుంచి అప్పుడే వచ్చినట్టున్నాడు పిల్లలతో ఆడుకుంటున్నాడు జయరాంను చూడగానే రా జయరాం అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు

కవితా! జయరాం వచ్చాడు టీ తీసుకురా అంటూ భార్యను పిలిచాడు

డాడీ! డాడీ అంటూ మోహన్ పిల్లలిద్దరూ ఒకరు వీపు మీద ఎక్కితే మరొకడు ఎగిరి వడిలో కూర్చున్నాడు పిల్లలిద్దరూ పుష్టిగా ఆరోగ్యంగా చూడముచ్చటగా ఉన్నారు

కవిత రెండు కప్పులతో టీ తీసుకొచ్చి చెరో కప్పు అందించింది

ఏమిటమ్మా అలా చిక్కిపోయావేం? అన్నాడు జయరాం కవితను చూస్తూ

పిల్లలతో నిమిషం తీరటం లేదన్నయ్యా ఇద్దరూ చిన్నపిల్లలు కావటం మూలంగా రోజంతా వాళ్ళతో నే సరిపోతుంది

పిల్లలు అల్లరి చెయ్యకపోతే, పెద్దవాళ్ళం మనం అల్లరి చేస్తామా చెప్పు

ఏం అల్లరో అన్నయ్యా భరించలేక పోతున్నాను వీళ్ళిద్దరితో నే చచ్చిపోతుంటే ఈయనగారి కింకా ఆడపిల్ల కావాలంట నన్ను ఆపరేషన్ చేయించుకోనివ్వటంలేదు స్వప్న అదృష్టవంతురాలు ఈ జంజాటాలు లేకుండా సుఖంగా గడుపుతుంది

తనకంటూ ప్రతి మనిషికీ పిల్లలుండాలి ఎవరయినా మీకెంత ఆస్థి ఉందని అడగరు కదా? ఎంతమంది పిల్లలని అడుగుతారు పిల్లలు డాడీ డాడీ అని పిలుస్తుంటే ప్రపంచాన్ని జయించినంతగా గర్వంగా ఉంటుంది నాకయితే జయరాం నిన్నో మాటడుగుతాను ఏమనుకోవు కదూ?

ఏమనుకుంటానురా? అడుగు అన్నాడు జయరాం

మన సరదాలకు అడ్డుగా ఉంటారని కొంతకాలం వద్దనుకుంటే ఆ తర్వాత అస్సలు పుట్టరు మనిద్దరి పెళ్ళి ఒకేసారి అయింది నాకిద్దరు పిల్లలు మీరు

పిల్లలు వద్దనుకుని, కుటుంబనియంత్రణ పద్ధతులు పాటిసు న్నట్లయితే నా మాట విని ఆ పద్ధతులు మానేయి

అలాంటివేం లేదురా నాక్కూడా పిల్లలంటే ఎంతో ఇష్టం

మీరిద్దరూ ఒకసారి డాక్టరు దగ్గరకెళ్ళి చూపించుకోకూడదూ స్వప్నకు గర్భాశయానికి సంబంధించిన జబ్బు ఏమయినా ఉందేమో

స్వప్నకు చెబితే, నా మాట వినిపించుకోవటంలేదు నీకు తెలిసిన మంచి డాక్టరుంటే చెప్పు వెళతాం

డాక్టర్ శేషగిరి అని పెద్ద డాక్టరున్నాడు సంవత్సరం క్రితమే లండన్‌లో చదువు పూర్తిచేసుకుని ఇక్కడ ముష్వలపాలెంలో ప్రాక్టీసు పెట్టాడు అతని దగ్గర పాతికమంది పిల్లలు లేనివాళ్ళు ట్రీట్‌మెంట్ తీసుకుంటే, ఇరవయ్యిమందికి పిల్లలు పుట్టారంట అతన్ని గురించి చాలా గొప్పగా చెప్పుకుంటున్నారు అతని దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకున్న మా ఆఫీసులో పనిచేస్తున్న రమేష్ బార్య ఇప్పుడు గర్భవతి ఆ శేషగిరి డాక్టర్ని గురించి అతనే నాకు చెప్పాడు చాలామంది అతని దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నారు నువ్వు కూడా స్వప్నను తీసుకుని అతని దగ్గరకెళ్ళి ఒకసారి ఇద్దరూ పరీక్ష చేయించుకోండి

అతనేమయినా దేముడా? ట్రీట్‌మెంట్ తీసుకోగానే పిల్లలు పుట్టడానికి? పిల్లలు బగవంతుడివ్వాలి

ఒరేయ్ నువ్వే యుగంలో ఉన్నావురా? వైజ్ఞానికంగా పారిశ్రామికంగా మనదేశం ఇంత అబివృద్ధిని సాధిస్తుంటే పిల్లలు పుట్టటానికి దేముడు కారణం అనుకుంటున్నావా? ఆడవారిలోనయినా మగవారిలోనయినా చిన్న లోపమున్నా పిల్లలు పుట్టరంట ఆ లోపం ఏమిటో డాక్టరు తెల్సుకుని ట్రీట్‌మెంట్ ఇస్తే పిల్లలు పుడతారంట మగాళ్ళకు ఏమైనా మెడిసన్స్ అవసరమైతే ఆ మెడిసన్స్ లండన్ నుంచి రహస్యంగా తెప్పిస్తాడంట ఆ ఇంజక్షనవీ ఇక్కడ దొరకటం కష్టమంట ఆడవాళ్ళకేదయినా ఆపరేషను అవసరమయితే అతనే ఆపరేషన్ చేస్తాడంట ఆపరేషన్ అక్కరలేదనుకొంటే మెడిసన్స్ వాడతాడంట కాకపోతే అతని దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకునేవాళ్ళు రెండు నిబంధనలను తప్పకుండా పాటించాలి

ఇదేమిటి? ఈ పద్ధతి కొత్తగా ఉంది

అతను మెడిసన్స్ లండన్ నుంచి రహస్యంగా తెప్పించి వాడతాడంట స్మగ్లింగ్ ఎలాగో అలాగంట పాపం పుణ్యానికి పోతే పాపం ఎదురయినట్లుగా ఆ విషయం బయటపడితే, అతను జైలుకెళ్ళాల్సి వస్తుంది అందుకని ట్రీట్‌మెంట్ విషయం రహస్యంగా ఉంచాలి రెండోది అతని దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకున్నంత కాలం మరో డాక్టరు దగ్గర చూపించుకోకూడదు

ఎందుకని?

ఇతను వాడే మందులు రహస్యంగా లండన్ నుంచి తెప్పించేవి కదా? ఇంకో డాక్టర్ దగ్గరకెళితే ఆ విషయం బయటపడదూ? అందుకని ఎట్టి పరిస్థితుల్లోనూ ట్రీట్‌మెంట్ పూర్తి అయేంతవరకూ మరో డాక్టర్ దగ్గరకెళ్ళకూడదు.

పాపం పిల్లలు లేనివాళ్ళ కోసం, అతనంత రిస్కు తీసుకుని ట్రీట్‌మెంట్ ఇస్తుంటే, అతన్నెందుకు జైలుకు పంపటం? అన్నాడు జయరాం నవ్వుతూ

అతని ట్రీట్‌మెంట్ మొదలుపెట్టాలంటే ముందుగా అతని ఫీజు కింద పదివేలు మెడిసన్స్ కింద పదివేలు మొత్తం ఇరవయ్యివేలు ముందుగా ఇవ్వాలి అలా ఇస్తేనే ట్రీట్‌మెంటు మొదలుపెడతాడు

మై గాడ్! ఇరవయివేలా?

అందులో అతనికి మిగిలేది చాలా తక్కువంట ఒక్కొక్క ఇంజక్షను లండన్ నుంచి ఇక్కడికొచ్చేసరికి అయిదు వందలవుతుందంట ఇరవయ్యి ఇంజక్షన్ను పదివేలు అవుతున్నాయి కదా రూము అద్దె నర్సులకూ అన్నీ ఆ డబ్బులో నేగా ఇక మళ్ళీ పైసా ఇచ్చే పనిలేదు జయరాం నీకు లక్షల ఆస్తి ఉంది పిల్లలు లేకపోతే ఈ సంపాదనంతా ఎవరు తినాలి చెప్పు? మీరిద్దరూ అతని దగ్గర చూపించుకోండి ఇరవయ్యి వేలు మీకొక లెక్కా మీ మామగారు ఒక్క నెలలో సంపాదిస్తారు రేపు అదివారం నాక్కూడా ఆపీసులేదు మా ఆపీసులో పనిచేస్తున్నతనికి ఆ డాక్టరు బాగా తెల్సు అతన్ని తీసుకుని మీ ఇంటికొస్తాను సాయంత్రం నాలుగు గంటలకు మీరు తయారయి ఉండండి నర్సింగ్‌హోమ్‌కెళదాం ఏమంటావు?

నువ్వింతగా చెబుతుంటే కాదంటానా? రేపు సాయంత్రం వెళదాం అతన్ని తీసుకుని మా ఇంటికిరా

నాలుగు గంటలకొస్తాం

మీ కోసం ఎదురు చూస్తుంటాను

అతన్ని తీసుకుని ఉదయమే డాక్టరు దగ్గరకెళ్ళి మాట్లాడొస్తాను సాయంత్రం అతను రాకపోయినా మిమ్మల్ని తీసుకెళతాను

అలాగే స్వప్న ఎదురు చూస్తుంటుంది వెళతాను లేచి ఇంటికి బయలుదేరాడు జయరాం

* * * * *

ఆదివారం సాయంత్రం మోహన్‌తో కల్సి స్వప్నను తీసుకుని కారులో డాక్టర్ శేషగిరి దగ్గరకు వెళ్ళాడు ఆ వాతావరణం స్వప్న కస్సలు నచ్చలేదు కాల్చిపారేసిన సిగరెట్ ముక్కలు ఆరిపోయిన అగ్గిపుల్లలు అది ప్లాట్‌పారమ్‌లా ఉంది తప్ప నర్సింగ్‌హోమ్‌లా కనిపించలేదు డాక్టరు కూడా నచ్చలేదు స్వప్నకు అతని రూము సిగరెట్ కంపు వాళ్ళక్కడున్నంత సేపు అతని చేతి వేళ్ళ మధ్య సిగరెట్ వెలుగుతూనే ఉంది

స్వప్ననూ జయరాంనూ అన్ని పరీక్షలూ చేసాడు జయరాంలో ఎలాంటి లోపం లేదని చెప్పాడు స్వప్నకు మాత్రం ఆపరేషన్ అవసరమన్నాడు ఆపరేషన్ జరిగిన సంవత్సరంలోనే స్వప్న తల్లవుతుందని చెప్పాడు గర్భసంచి సరిచెయ్యందే పిల్లలు పుట్టే అవకాశంలేదు సరి చెయ్యాలంటే ఆపరేషన్ తప్పనిసరి అని చెప్పాడు వెంటనే ఆపరేషన్ చేయిస్తే ఈ సంవత్సరంలోనే మాతృత్వాన్ని పొందవచ్చని చెప్పాడు

జయరాం ఇంకేం ఆలోచించకుండా స్వప్న చేత ఇరవయ్యి వేలకు చెక్కు రాయించి ఇచ్చాడు మంచి రోజు చూసి ఆపరేషనుకు వస్తామని చెప్పొచ్చారు మోహన్ అటు నుంచి అటు ఇంటికెళ్ళాడు స్వప్నా జయరాం ఇంటికొచ్చారు ఆ విషయం చెప్పిన దగ్గర్నుంచి స్వప్న ముబావంగానే ఉంది రాగానే జయరాంతో ఏం మాట్లాడకుండా బెడ్ రూంలో కెళ్ళి పడుకుంది జయరాం మాదవరావుగార్కి జయంతిగార్కి ఆ డాక్టరు విషయం స్వప్నకు ఆపరేషన్ అవసరమని చెప్పిన విషయం అన్నీ విపులంగా చెప్పాడు మాదవరావుగారు జయంతికూడా మనవళ్ళ కోసం మనవరాళ్ళ కోసం తహతహలాడి పోతుండటం మూలంగా వెంటనే స్వప్నకు ఆపరేషన్ చేయించుదామని చెప్పారు మాదవరావుగారు క్యాలెండరు చూసి శనివారం మంచి రోజని ఆ రోజే స్వప్నకు ఆపరేషను చేయించుదామని రోజు కూడా నిర్ణయించారు

జయరాం బెడ్‌రూములో కొచ్చేసరికి స్వప్న కళ్ళు మూసుకుని పడుకునుంది

స్వప్నా అమె పక్కన కూర్చుంటూ పిలిచాడు

కళ్ళు తెరిచి అతని వైపు చూసింది



ఆపరేషన్ చేయించుకోవటం నీకు ఇష్టంలేదా?

"అస్సలది నర్సింగ్‌హోమ్‌లా ఉందా? ఫీజు ఇరవయ్యి వేలా? ఆ డాక్టరే నచ్చలేదు నాకు

అతనీ మధ్యనేగా లండన్ నుంచి వచ్చాడు మళ్ళీ తొందర్లో లండన్ వెళ్ళిపోతాడంట ఈ మధ్య కాలంలో కాళీగా ఉండటం ఎందుకని నర్సింగ్‌హోమ్ నడుపుతున్నాడు మనలాంటి వాళ్ళ పాలిట దేముడు స్వప్నా! ఆ డాక్టరు నేనెన్నిసార్లు డాక్టరుకు చూపించుకోమన్నా నువ్వు నా మాట వినలేదు మొదట్లోనే మంచి డాక్టరుకు చూపించుకున్నట్లయితే ఇప్పటికి మనకు బాబో పాపో ఉండేవారు ఇప్పటికయినా నా మాట విని డాక్టర్ దగ్గరకు వచ్చావు ఈ ఆపరేషన్ అయితే వెంటనే మనకు పిల్లలు పుడతారు ఆ డాక్టరుకు లక్ష రూపాయలిచ్చినా బాదనిపించదు మీ డాడీతో వివరాలన్నీ చెప్పాను శనివారం మంచిదన్నారు ఆపరేషన్ చేయించటానికి ఈ రోజుల్లో ఆపరేషన్‌కు బయపడతారా ఎవరయినా? ప్రేమగా ఆమె తల నిమిరాడు

ఆ డాక్టరు దగ్గర ఆపరేషన్ చేయించుకోవటం నాకిష్టం లేదండి

స్వప్నా! ఈ ఒక్క విషయంలో నా మాటకు ఎదురు చెప్పొద్దు విసురుగా అన్నాడు

మీ కోసం చేయించుకుంటాను అంది స్వప్న భర్తకు కోపం తెప్పించటం ఇష్టంలేక

స్వప్నా! మై స్వీట్ వైఫ్ తేలికపడిన మనస్సుతో ఆమెను గాడంగా కౌగిలించుకున్నాడు

* * * * *

అనుకున్నట్లుగానే శనివారం ఉదయం ఎనిమిది గంటలకు ఆపరేషన్ జరిగింది స్వప్నకు అందరూ తేలికగా ఊపిరి పిల్చుకున్నారు

వారం రోజుల తర్వాత హాస్పిటల్ నుంచి ఇంటికి వచ్చింది స్వప్న ఫ్యామిలీ డాక్టర్‌కు ఫోన్ చేయటం మానేసారు డాక్టరు అవసరమయితే శేషగిరి డాక్టరు దగ్గరకు వెళ్ళటం

స్వప్నకు ఆపరేషన్ జరిగి నాలుగు నెలలయింది ప్రతి నెలా స్వప్న ప్రెగ్నెంట్ అని చెపుతుందేమో అని అందరూ ఎంతో ఆశగా ఎదురు చూడటం నిరాశ చెందటం జరుగుతుంది

స్వప్నకయితే తన పరిస్థితికి తనకే అసహ్యంగా ఉంది ప్రతి నెలా అందరూ తన విషయం చర్చించుకోనటం ఆ మాటలు ఆమె చెవిని పడటం ఆమె బాదపడటం జరుగుతుంది వాళ్ళ ఆనందం కోసమయినా ఒక్క బిడ్డ పుడితే చాలని మనస్సులో నేకోటి దేవతలకు మొక్కుకుంటుంది

పాపం ఏ దేవుడూ ఆమె మొర ఆలకించలేదు ఉదయం ఆరు గంటలకు నిద్ర లేచి అలవాటు ప్రకారం పేపరు చేతిలోకి తీసుకున్న జయరాం పేపరు మొదటి పేజీలోని వార్త చదివి కొయ్యబారిపోయాడు అప్పుడే నిద్ర లేచిన స్వప్న బద్దకంగా కళ్ళు తెరిచి భర్త వైపు చూసింది ఎన్నో బావాలు చకచకా మారిపోతున్నాయి జయరాం ముఖంలో

ఏమిటి ముఖమలా పెట్టారు? ట్రెయిన్ ప్రమాదంలో వందమంది చనిపోయారని వ్రాసారా? అంది బెడ్ మీద నుంచి లేచి కూర్చుంటూ

ఆ శేషగిరి డాక్టరును నిన్న సాయంత్రం అరెస్టు చేసారంట

ఏమిటండీ! మీరనేది? అతన్ని అరెస్టు చెయ్యటం ఏమిటి? ఈ శేషగిరి ఇంకొకతనేమో

కాదు ముప్వలవానిపాలెం అని ఆ డాక్టర్ పేరూ అడ్రస్ అన్నీ వేసారు

ఎందుకు అరెస్టు చేసారు?

అతను పెద్ద మోసగాడంట అతను లండన్‌లో చదివింది, అతని ట్రీట్‌మెంటూ అంతా అబద్ధమంట పిల్లలు లేనివాళ్ళకు, పిల్లలు పుడతారన్న ఆశ చూపించి పదివేల దగ్గర్నుంచి, ముప్పయివేల వరకూ ఫీజుగా తీసుకునే వాడంట మగాళ్ళకు లండన్ నుంచి ఇంజక్షన్లు తెప్పించానని చెబుతూ బలానికి ఏవో ఇంజక్షన్లు చేసేవాడంట ఆడవాళ్ళకూ అంతేనంట ఆపరేషను అవసరమని చెప్పి అర అంగుళం మేర పొట్ట మీద గాటు పెట్టి బ్యాండేజి వేసేవాడట ఈ డాక్టరుకు, ఇంకొకతను సహాయంగా ఉండేవాడంట తను ట్రీట్‌మెంట్ కోసం వచ్చే వాళ్ళకు నా మిసెస్‌కు ఆపరేషను జరిగింది నాకో బిడ్డ పుట్టింది నా ఫ్రెండ్‌కూ పిల్లలు పుట్టారు అంటూ చెప్పి మోసం చేసేవాడంట కొంతమంది ఆడవాళ్ళకు, మెన్సెస్ రాకుండా రెండు మూడు నెలలు టాబ్లెట్సను వాడి ఆ తర్వాత ప్రెగ్నెంట్ వచ్చింది మీ దురదృష్టంకొద్దీ ఎబార్షను జరిగింది అని చెప్పేవాడట

ఇలా ఒక్క సంవత్సరంలోనే మనలాంటివాళ్ళను దాదాపు యాభయ్యి మంది దాకా మోసం చేసి అయిదారు లక్షలుదాకా సంపాదించాడంట తన మోసం బయటపడుతుందని హార్టు ఎటాక్ వచ్చింది ట్రీట్‌మెంట్ కోసం లండన్ వెళుతున్నానని పలాయనం చిత్తగించబోతున్న సమయంలో, అతని మూలంగా మోసపోయినవాళ్ళు, తెలివిగా నాటకం ఆడి ఎస్ పి సహాయంతో అతన్ని పట్టుకున్నారంట ప్రస్తుతం అతన్ని విశాఖ జైలులోనే ఉంచారంట ఆ వివరాలన్నీ విపులంగా ప్రచురించారు

ఆ వార్త విన్న తర్వాత, కరెంట్ షాక్ తిన్నదానిలా శిలలా కూర్చుండిపోయింది కొద్ది నిముషాలు స్వప్న

నేను చెబితే విన్నారా? అతన్ని చూస్తేనే మోసగాడిలా కనిపించాడు నాకు

స్వప్నా! జగిందానికి నేనెంతో బాదపడుతున్నాను నువ్వు ఆ బాధను మరింత అధికం చెయ్యకు

నాకో అనుమానం అతను నాక్కూడా ఆపరేషను చెయ్యకుండా, చిన్న గాయం చేసి, ఆపరేషన్ చేసానని చెప్పాడేమో

అయినా కావచ్చు సాయంత్రం లేడీ డాక్టర్ దగ్గరకెళ్ళి పరీక్ష చేయించుకొందే సరిపోతుంది అంటూ బెడ్ రూంలో నుంచి బయటకు వచ్చాడు జయరాం నిముషాల మీద ఇంట్లో అందరికీ తెల్సిపోయింది ఈ విషయం మాదవరావుగారు తల పట్టుకుని కూర్చుండిపోయారు జయంతికి ఏడుపొక్కటే తక్కువ

జయరాం ఫ్యాక్టరి దగ్గరకెళ్ళటానికి తయారయి వరండాలోకొచ్చేసరికి అతని ఫ్రెండ్ మోహన్ వచ్చాడు రక్తం లేనట్లుగా తెల్లగా పాలిపోయిన ముఖంతో జయరాం అయామ్ వెరీ సారీ ఇలా జరుగుతుందని అనుకోలేదు అన్నాడు బాధగా

నువ్వెందుకురా బాదపడతావు? అతను ఇలాంటి వాడని నీకు మాత్రం ఏం తెల్సు నాకేదో మంచి జరగాలని తాపత్రయపడ్డావు ఎంతోమందిని మోసం చేసాడు వాళ్ళలో మనమొకళ్ళం ఏం చేస్తాం మోహన్ చేతిని స్నేహపూర్వకంగా నిమురుతూ అన్నాడు

నేను చెప్పకపోతే మీరక్కడకు వెళ్ళేవారు కాదు కదా?

అలా ఎందుకనుకోవాలి? నీ ద్వారా కాకపోతే ఇంకొకరి ద్వారా తెలిసేది మోహన్ జరిగిపోయిందేదో జరిగిపోయింది ఇప్పుడు బాదపడితే మాత్రం ప్రయోజనం ఏముంది?

అనవసరంగా స్వప్నకు ఆపరేషన్ చేయించాం కదా

సాయంత్రం లేడీ డాక్టర్ దగ్గరకు తీసుకెళతాను స్వప్నను

ఆలస్యం చేయకుండా తీసుకెళ్ళు నాకు ఆఫీసుకు టయమవుతుంది వెళతారా

మోహన్ వెళ్ళిపోయిం తర్వాత జయరాం ఆఫీసుకెళ్ళాడు ఆఫీసు రూములో కూర్చున్నాడు గానీ ఏ పని చెయ్యలేకపోయాడు అతను స్వప్నకు ఆపరేషన్ జరిగిందగ్గర్నుంచి పిల్లల కోసం ఎన్నో కలలు కన్నాడు ఆ కలలన్నీ కల్లలయ్యేసరికి ఆ షాక్ భరించలేక పోతున్నాడు స్వప్న ముందు బయటపడితే ఆమె మరింత గొడవ చేస్తుందని ఇంట్లో ఉన్నంతసేపు ఎంతో గాంభీర్యాన్ని నటించాడు డబ్బు పోయినందుకు కాదు అతని బాధ స్వప్నకు అనవసరంగా ఆపరేషన్ చేయించినందుకు అమితంగా బాధపడుతున్నాడు ఉదయం ఆ వార్త చదివిం దగ్గర్నుంచి ఆలోచించటానిక్కూడా శక్తిలేనట్లుగా అతని మెదడు మొద్దుబారి పోయినట్లుగా ఉంది దీర్ఘాలోచనల్లో మునిగిపోయి కూర్చున్నాడు

(ఇంకా ఉంది)




లంక పొగాకు చుట్ట చివరి కొస కొరికి తుపుక్కున ఊశాడు పెద్దిరెడ్డి న్యాయం గావాలంట నా కొడుకులకి న్యాయం! నీ యమ్మ! మన గింజలు దిని ఒళ్ళు పెంచుకొని మన మీదికే కాలు దువ్వుతుండారు

కొంచెం దూరంలో పెద్దిరెడ్డి కొడుకు చిన్నబ్బాయ్ అని పిలవబడే బసవారెడ్డి నుంచు నున్నాడు

మునసబు గుడ్లప్పగించి పెద్దిరెడ్డి వంకే చూస్తున్నాడు కుత కుతా ఉడికిపోతున్నాడు పెద్దిరెడ్డి!

ఒళ్లంతా బగబగా మండిపోతున్నది!

విసురుగా పచార్లు చేస్తున్నాడు

ఛీల్లి! నీ యమ్మ! చెప్పులు నాకే వాండ్లతో వియ్యం థూత్! ఆఖర్కి బతుకిట్టా తెల్లారి పోయింది! పచార్లు ఆపి ఎదురుగా వున్న వాలు కుర్చీలో కూచున్నాడు

చురచురా కొడుకు వంక చూశాడు

చేతగానీ వెదవ! తద్దినం తెచ్చి పెట్టావ్ గదరా నెత్తి మీదికి!

మునసబు కలిగించుకొన్నాడు అయిందేదో అయిపోయె! యిప్పుడేం చెయ్యాలో ఆలోచించు

యింకా ఆలోచించేదేంది? ఈ రాత్రికే ఆ నా కొడుకుల్ని ఏసిపారేస్తాను సగం ఆరిపోయిన చుట్టను దూరంగా విసిరికొడుతూ హుంకరించాడు

ఆ పన్జెయ్యి! నీకు ఉరి నీ కొడుక్కు యావజ్జీవం పడుతుంది చురక తగిలించాడు మునసబు

అయితే ఏం జెయ్యమంటావ్! వియ్యం అవమంటావా? చంపి జైలుకన్నా బోతా గాని ఆళ్ళకి లొంగను

లొంగమని ఎవరన్నారు? ఏదైనా మార్గం ఆలోచిద్దాం!

అసలీ పింజారీ నా కొడుకు మూలంగానే యీ పెంటంతా కోపంగా చూశాడు కొడుకు వంక

వాడయినా ఏం చేస్తాడూ! కుర్రాడు! వయసులో వున్నా

థూత్! ఎదవల్లని చేసేప్పుడు గుట్టు చిక్కకుండా చెయ్యాలన్న జ్ఞానంలేదు ఎద్దు పెరిగినట్టు పెరిగాడు

తలెత్తి తండ్రి వంకా మునసబు వంకా చూసి విసురుగా యింట్లోకి పోయాడు బసవారెడ్డి

చూశావా? ఎంత ఒళ్ళు బలుపో! యీ రొంపి లోంచి ఎట్టా బయటపడాలా అని మనం చస్తుంటే టిక్కు, టిక్కుమంటూ ఎట్లా ఎల్లిపోయాడో!

కుర్రతనం వాడి సంగతి వదిలేసెయ్! రాత్రికి మనవాళ్ళందర్నీ ఓ చోట పోగేసి ఆలోచిద్దాం! నేనా పని మీదే వుంటా

మునసబు వెళ్ళిపోయాడు

పెద్దిరెడ్డి ఒక్కడే మడత కుర్చీలో మిగిలి పోయాడు చేతులు రెండూ తలకిందకు చేర్చి చూరు వంక చూస్తున్నాడు

ఒకప్పుడు తన తాత కోళిందరెడ్డి పేరు వింటే చుట్టుపక్కల గ్రామాలు వణికిపోయేవి కంటికి కనిపించిన ఆడదాన్ని వదిలేవాడేగాదు తన తండ్రి మాత్రం?

రక్తప్రసారం జరక్క చేతులు తిమ్మిర్లెక్కాయి లేచి కుర్చీలో నిటారుగా కూచున్నాడు జేబులోంచి



చుట్ట తీసి ముట్టించాడు నాలుగైదు దమ్ములు గట్టిగా లాగి విడిచి పొగ వంకే చూస్తూ కూచున్నాడు

యింక లాభంలేదు యీడ్ని యిలా వదిలేస్తే ఊరంతా గగ్గోలెత్తిస్తాడు! కొడుకు ప్రతాపానికి మురిశాడు

చందోలురెడ్డికి ఒక్కతే కూతురు నలభై ఎకరాలకి మించే వుంది బంగారం సరేసరి! ఆ గుంటనీ యీడ్ని కలిపి ముడిపెడితే సరి! భూమి పెరుగుద్ది ఈడి నెత్తురుడుకూ తగ్గుద్ది!

చుట్ట పొగ గాఢంగా పీల్చాడు పొగ ముక్కులోకి పోయి కొరబోయింది ఖళ్ ఖళ్మంటూ దగ్గాడు కళ్లెంబడి నీళ్లు ఊరాయి

చుట్టని కాలికిందేసి నలిపాడు కుర్చీలోంచి గొడ్ల సావడి దాటుకుంటూ - వీదిలోకి తొంగి చూశాడు వీదంతా నిర్మానుష్యంగా ఉంది గోడ వారగా పడుకున్న గజ్జి కుక్క ఓసారి పెద్దిరెడ్డి వంక బద్ధకంగా చూసి అటు మళ్లి పడుకుంది

థూ! గాండ్రించి వుమ్మి, మళ్లీ యింట్లోకి నడిచాడు

* * * * *

పేరుకు తగ్గట్టే మదించిన దున్నలా వుంటాడు బసవారెడ్డి తండ్రికున్న పొగరూ వయసిచ్చిన తిమ్మిరితో అచ్చోసిన ఆంబోతులా వూరెంబడి పడి తిరుగుతాడు

ఓ మద్యాహ్నం వేళ పొలంలో కంప ఏరుకొంటూ కనపడింది నీలమ్మ నల్లగా బలంగా వయసిచ్చిన వంపులతో బంతిచెట్టులా ఎదిగిన ఆమె వంట్లో వంపులు బసవారెడ్డిని కొసెక్కించాయి

నవ్వుతూ ఎదురెళ్లాడు గోవుల్ని మేసే పులి గోవుల్ని కాయదన్న సంగతి నీలమ్మకు తెలుసు ఎటొచ్చి నీలమ్మ సంగతే బసవారెడ్డికి తెలీదు

అంతకుముందు చాటు మాటుగా కరిచిన గడ్డిలో యిదో గడ్డి పరక అనుకున్నాడు సరసం చేయబోయాడు సరసం విరసంగా మారి గూబ పేలిపోయింది

కళ్లు ఎర్రబడ్డాయి పళ్లు కొరుకుతూ నీలమ్మ జుట్టు పట్టుకుని ఒక్క గుంజు గుంజాడు బురదలో పడిపోయింది నీలమ్మ

వాచిపోయిన చెంప మొహం నిండా రక్కులు చిరిగి పీలికలైన చొక్కాతో హడావుడిగా వురుకుతున్న చిన్నబ్బాయిని విచిత్రంగా చూశారు ఎదురొచ్చిన వాళ్లు

వెక్కి వెక్కి ఏడుస్తున్న నీలమ్మను చూడగానే అర్థమైంది రాజయ్యకు తన కూతుర్ని మగపురుగు ముట్టిందని

నిలువెల్లా వణికిపోతూ ఒక్కేటుతో ఆ నా కొడుకు సపా అంటూ వీరభద్రుడిలా ముందుకురికాడు గొల్లుమంటూ తండ్రిని వాటేసుకొంది నీలమ్మ చేతుల్లో గొడ్డలి జారిపోయింది నీలమ్మని గుండెల్లో పొదువుకుని గరళం మింగిన శివుడిలా ఉండిపోయాడు రాజయ్య

గూడెం అంతా పాకిపోయింది విషయం పెద్దిరెడ్డి కొడుకుని శాపనార్థాలు పెడుతున్నారు పెద్దిరెడ్డి వంశాన్ని నోటికొచ్చిన బూతులతో దివిస్తున్నారు

ఆ రాత్రి పెద్దిరెడ్డి కోసం పెద్దిరెడ్డి ముంద యింటికెళ్లే దోవలో కాపేశాడు రాజయ్య

సిల్కు లాల్చీ మల్లెపూలు దొంగచూపు నంగి నడకతో వస్తున్న పెద్దిరెడ్డిని నిలేశాడు రాజయ్య రాజయ్య మాటలు వింటూ గుడ్లప్పగించిన పెద్దిరెడ్డి మొహం కుమ్ములో పెట్టిన వంకాయలా కమిలిపోయింది

* * * * *

అది జరిగిన సంగతి! యిప్పుడా వెట్టివాడు తన కూతుర్ని - పెద్దిరెడ్డి కొడుకు మనువాడి తీరాలని మంకుపట్టు పట్టాడు పెద్దిరెడ్డి కొడుకు చేసిన ఘనకార్యం వివరించాడు మునసబు

వింటున్న కామందులకు వెట్టివాడి కూతుర్ని - పెద్దిరెడ్డి కొడుకు చెరిచాడన్న మాటకంటే దాన్ని మనువాడి తీరాలన్న రాజయ్య మాటకు ఒళ్లంతా దురదగుంటాకు రాసుకున్నట్లయింది

థూత్! వాడు అంతంత మాట్లంటా వుంటే ఎలా వూరుకున్నావు రెడ్డే? నేనయితే ఒక్కేటుకి నిలువునా నరికి పారేశేవాణ్ణి ఓ కామందు శివాలెత్తిపోతూ అడిగాడు

పాపం రెడ్డి మాత్రం ఏం చేస్తాడూ?! వాడు కాయకష్టం మనిషి చాచి పెట్టి ఓ దెబ్బ కొడితే రెడ్డి పెళ్లాం ముండ మోసేది! విడమరిచాడు మునసబు

నీయమ్మ! యిప్పుడీ గొలెందుగ్గానీ ఏం జెయ్యాలో ఆలోచించి ఏడవండెహె! పెద్దిరెడ్డి కసురుకున్నాడు

చేసేదేవుంది? పట్నం నుంచి మెరికల్లాంటి మనుషుల్ని తెప్పిద్దాం! కాగల కార్యం వాళ్లే చూస్తారు!

సరేగానీ! రేపిపాటికి అంతా అయిపోవాలె! ఇది నా పరువు సంగతి

నీ పరువు సంగతి గాదు! మన పరువు సంగతి!

* * * * *

ఆ రోజు రాత్రే గూడెంలో జనాల్నందర్ని కలేశాడు రాజయ్య

రాత్రి పది గంటలకు అన్నాలు తిని వేపచెట్టు కిందుకు చేరారు అందరూ

చెట్టుమీద పక్షులు నిశ్శబ్దంగా కునుకు

# కుదుపు

తీస్తున్నాయి చచ్చిన పురుగుని లాక్కెళ్లేందుకు ప్రయత్నించి వల్లగాక పుట్టలోకి పోయిందో చీమ

మసక వెన్నెల వెలుతురులో అందరి వంకా కలయ చూస్తూ - మాట్లాడ్డం మొదలెట్టాడు రాజయ్య

కాలం గడిచిపోతున్నది

వింటున్నవాళ్లు కొంతమంది బేష్! బేష్ అంటూ చేతులతో నేలమీద చరుస్తున్నారు

మరికొంతమంది నిశ్శబ్దంగా గుడ్లప్పగించి వింటున్నారు కొంతమంది ముసలివాళ్లు కుర్రకారుని అదిలిస్తున్నారు

మసక వెన్నెల వెలుతురులో వాళ్లందరూ కెరటాల రాపిడికి పదును తేరి నునుపెక్కిన బండరాళ్లలా తళతళ మెరిసిపోతున్నారు

ఎవరేం పని చేస్తున్నా అందరూ కొలిమిలో నిప్పుల్లా భగభగా మండిపోతున్నారు

కింద మనుషుల గోలకి చెట్టు మీది పక్షులు కిచకిచమని అరుస్తూ రెక్కలు టపటప కొట్టుకుంటూ నాలుగు దిక్కులకి ఎగిరిపొయాయి

పుట్టలోకెళ్లిన చీమ మరిన్ని చీమల్ని వెంటబెట్టుకొని వచ్చింది చంద్రుడు ప్రకాశవంతంగా వెలుగుతున్నాడు వేపచెట్టు కొమ్మల్లోంచి వెన్నెల ముక్కలు ముక్కలుగా చిలి నల్లటి వాళ్ల శరీరాల మీద పడి మెరుస్తోంది

రాజయ్య మాటలకు వాళ్లందరూ నిశ్శబ్దంగా తలలూపుతున్నారు బుస్ బుస్ మంటూ వాళ్ల వూపిరి ఆ నిశ్శబ్దంలో ప్రతిధ్వనిస్తున్నది ఆ వెన్నెల వెలుగులో వాళ్లందరూ యజ్ఞం చేయబోయే ఋషుల్లా - ప్రశాంతంగా కనిపిస్తున్నారు

రాజయ్య మాటలు ఆపేశాడు అందరూ లేచి తలగుడ్డలు దులుపుకుంటూ నిశ్శబ్దంగా ఎవరి గుడిసెలోకి వాళ్లు నడిచారు

ఆ ప్రదేశమంతా ఒక్కసారి నిశ్శబ్దం అయిపోయింది దూరంగా తీతువు పిట్ట కీ కీ మంటూ




విజయనాదం చేసుకొంటూ వెళ్తోంది ఎగిరిపోయిన పక్షులన్నీ మళ్లీ చెట్టు మీదకు చేరాయి చచ్చిన పురుగును చీమలన్నీ కలిసి పుట్టలోకి లాక్కెళ్తున్నాయి

* * * * *

మర్నాడుదయం

మంగలి కోసం ఎదురు చూస్తూ పడక్కుర్చీలో కూచొన్నాడు పెద్దిరెడ్డి పొద్దు బరబరా పాకిపోతున్నది మంగలి అయిపులేడు

బూతులు తిట్టుకుంటూ లేచి వెళ్లి స్నానం చేసొచ్చాడు చలవ బట్టలు వేసుకొని కాఫీ కోసం రంకె వేశాడు పాలేరొచ్చి పాలు పితకలేదు గాబట్టి కాఫీ లేదని సమాధానం వచ్చింది పాలేరుని నరికి ఉప్పు పాతర వేద్దామన్నంత కోపం వచ్చింది

అంతలో ఈ రాత్రికే రాజయ్య వాడి కూతురు పైకి పోయేది అన్న విషయం గుర్తొచ్చింది పనుంది పట్నం పోతున్నా నంటూ రంగం నుంచి తప్పుకున్నాడు

సాయంత్రం అయింది ఊరి పొలిమేరలోనే ఎదురయ్యారు మెరికెల్లాంటి మనుషులు ఒకళ్ల భుజాలు మీద మరొకళ్లు చేతులు వేసుకుని కుంటుకుంటూ నడుస్తున్నారు "చెప్పకుండానే పరిస్థితి అర్థమైపోయింది పెద్దిరెడ్డికి

రాత్రయ్యేసరికి పరిస్థితి మరింతగా మారింది కామందులందరికీ పాలు పితికేందుకు పాలేర్లు లేరు పాలకోసం పసి పిల్లలు గొలెడుతున్నారు పశువులు కొత్తవాళ్లని దగ్గరకు రానీయటంలేదు పెద్దవాళ్లు కాపీ కోసం నాలికలు పీక్కుంటున్నారు

రాత్రికే తొలకరి వర్షం మొదలైంది బీటలువడ్డ భూమి వర్షం నీరు పీల్చుకొని పదునెక్కడం మొదలైంది అటకమీది పాఱలు పలుగులు నాగళ్లు బూజాలు దులుపుకొంటున్నాయి

తెల్లారింది పాలేర్లు అయిపులేరు మంగలి చాకలీ సరేసరి కామందులందరూ ఓ చోట చేరారు ఎవడి బాదలు వాళ్లు చెప్పుకున్నారు గూడెం వాళ్ల భరోసా ఏంటో అర్థం కాలేదు వాండ్లకి

పంతం పెరిగింది కామందులలో పక్క ఊరి నుంచి మనుషుల కోసం కబురంపారు మి వాళ్లేమయ్యారు? అంటూ ఎదురు ప్రశ్న వేశారు

వెంటనే పనులు మొదలు పెట్టకపోతే యీ ఏడు నోట్లో మట్టేనని అర్థం అయిపోయింది

పనులన్నీ ఆగిపోయాయి

గానుగలో చెరుకు నలిగినట్లు నలిగిపోతున్నారు కామందులు రాత్రిపూట దొంగతనంగా వెళ్లి డబ్బాశ చూపించారు సారాయి పోయిస్తామన్నారు ఒకళ్లిద్దరు ముందుకు వచ్చినా మిగిలినవాళ్లు జుట్టు పట్టుకు వెనక్కు లాగారు

కాళ్లూ చేతులూ తెగ పిసుక్కున్నారు కామందులు ఎప్పుడూ ఎదురవని ఈ పరిస్థితిని వాళ్లు జీర్ణించుకోలేక పోతున్నారు

పులి మీద పుట్రలా మునసబు ఇంట్లో ఆవు యీనలేక కళ్లు తేలేసింది చచ్చిన గొడ్డు కోసం




# గోపి

## వంటింటి మర

జీవితకాలం ఉచిత సర్వీసు



మర వేసిన పదార్థాన్ని సేకరించేందుకు గుండ్రని పాత్ర అదనం.

ఉచితం!

నిర్లిప్

మరకలు పడని పెద్ద దోసెకాడను




వంటింట్లో గోపీ నాకెదురుగా వుంటే కష్టం తెలీకుండా పనిని చకచకా చేసుకుపోగల్ను! ఎందుకో తెల్సా? మూడు జార్లు ఒక మెషీన్‌తో బాటు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో గోపీ వుంటాడు – వీటన్నిటికీ అదనంగా ఖర్చు పెట్టాల్సిందేమీ లేదు

పొడులు చేసుకోవాలనుకున్నా ఎండి రుబ్బుకోవాలనుకున్నా క్షణాల్లో అందుకనుగుణంగా మార్చగల సౌకర్యం గోపీ దగ్గరే వుంది

ఇంతేకాక కొన్ని ప్రత్యేకమైన పనులకు అవసరమైన అనుబంధ పరికరాలు చాలా వున్నాయి గోపీ దగ్గర ప్రతిదీ విడివిడిగానే వుంటుంది వాటని విడివిడిగా కొంటే నాకెంత ఖర్చవుతుందో గోపీవల్ల నాకెంత డబ్బు ఆదానో ఒకసారి ఆలోచించండి!

గోపీకున్న భారీ స్తోమతగల మోటారును నేను ఎంతసేపైనా నిర్భయంగా ఉపయోగిస్తాను వంటింట్లో గోపీవుంటే చాలు వంటింట్లో పని రాకెట్ స్పీడుతో జరిగిపోతుంది నాకు

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం స్ప్లాష్‌ప్రూఫ్ లిడ్ మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

**కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్ట సిస్టం, స్ప్లాష్‌ప్రూఫ్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!**

ఆంధ్రప్రదేశ్ కర్నాటక తమిళనాడులలో విక్రయదారులు

**త్రిప్త మార్కెటింగ్ ప్రయివేట్ లిమిటెడ్**

బెంగుళూరు ఫోన్ 563322 హైద్రాబాద్ ఫోన్ 221224 మద్రాసు ఫోన్ 88599

# సేవా శ్వవృత్తిః

మానవులు జీవించడానికి అనుకూలమైన మార్గాలు సాదారణంగా రెండు కనిపిస్తున్నవి ఒకటి - వివిదములైన చేతి పనులు చేసికానీ పంటలు పండించుకునీ స్వతంత్రంగా - ఇతరులకు తల అమ్ముకోకుండా జీవించే పద్దతి రెండు - ప్రభువులను భూస్వాములను ఆశ్రయించి వారి చెప్పు చేతలలో ఉండి సేవ చెయ్యడం ఈ పద్దతులు అనాది నుండీ వస్తున్నవి

విదేశీయులు మనకు పాలకులుగా ఉండిన కాలంలో చేతి పనులకు ప్రోత్సాహం లేకుండా పోయింది నిత్యావసరములైన వస్త్రాల దగ్గరనుంచీ అన్నీ విదేశాల నుంచే ఎక్కువ దనం ఇచ్చి తెప్పించుకోవలసి వచ్చేది అందువల్ల స్వతంత్రంగా జీవించే అవకాశం లేకపోయింది చదువుకున్న యువకులందరూ ఆదికారుల దగ్గర కొలువునకు కుదురుకోవడమే ధ్యేయంగా పెట్టుకోవలసి వచ్చేది దరఖాస్తులు పెట్టుకొనేటప్పుడు మీకు మిక్కలి విశ్వాసపాత్రుడైన సేవకుడు (యువర్స్ మోస్ట్ ఒబీడియంట్ సర్వెంట్) అని తన్ను గురించి చెప్పుకోవలసి ఉండేది



అంతకు పూర్వం రాజుల వద్ద సేవకులుగా ఉండేవారి సంగతీ ఇంతే మంత్రుల దగ్గరనుంచి, ద్వారపాలకుని వరకూ అందరూ బృత్యులే! ఏమంటే - వారిని ప్రభువులు పోషిస్తూ ఉండేవారు గదా!

స్వతంత్ర జీవనంలో స్వేచ్ఛ ఉంటుంది శ్రమగా ఉన్నప్పుడూ ఇష్టం లేనప్పుడూ పని నిలిపి వెయ్యవచ్చును సేవా వృత్తి అటువంటిది కాదు తనకు శ్రమగా ఉన్నా ఇష్టంలేకున్నా యజమాని చెప్పిన పని చేసి తీరవలసినదే! చెయ్యకపోతే నాటితో తన ఉద్యోగానికి స్వస్తి

మరో సంగతి ప్రభువుకు యజమానికి సేవకునిపైని అబిమానం ఉంటే అందలం ఎక్కిస్తారు కోపం వస్తే అణచివేస్తారు వారి మనస్సు ఎప్పుడు ఎలా ఉంటుందో నిర్ణయించడం సాధ్యంకాదు ప్రభువుల దగ్గర మంత్రులుగా ఉండేవారూ ఉన్నతాదికారులూ కూడా ఎప్పుడూ బయపడుతూనే కాలం గడపవలసి వచ్చేది అందువల్లనే 'సేవా శ్వవృత్తిః' అని చెప్పవలసి వచ్చింది అంటే ఇతరులను సేవించడం చాలా నీచమన్న మాట! కుక్క తన యజమాని పట్ల ఎంత విశ్వాసం చూపుతున్నా, ఆయనకు దాని పైన ప్రేమ ఉన్నప్పుడు ఎంతో గౌరవంగానూ అభిమానంగానూ చూస్తాడు కోపం వస్తే - అది చూపుతున్న విశ్వాసాన్ని గుర్తించకుండా కర్రతో తరిమికొడతాడు దయాదాక్షిణ్యాలు గౌరవాగౌరవాలు యజమానుల కోప ప్రసాదాలపై ఆదారపడి ఉంటాయి అందు వల్ల యువతరం ఉద్యోగాల కోసం తంటాలు పడకుండా స్వయం ఉపాది కల్పనకు సర్వవిదాలా యత్నించడం అత్యుత్తమం

-బులుసు వేంకట రమణయ్య

# కుదుపు

ముందర

బుర్ బుర్ మంటూ శబ్దం చేసుకొంటూ ఎదురొచ్చింది పోలీసు జీపు

పెద్దిరెడ్డి ప్రాణం సగం పైనే పోయింది

చిన్నబ్బాయి పోలీసుల్ని చూడగానే యింట్లోకి వురికి తలుపులు బిడాయించుకున్నాడు

రాజయ్య కూతురు నిలమ్మని మానబంగం చేసినందుకు నీ కొడుకుని

అయ్యా! యివి చేతులు కావు! తమరు దయ చూడాలి!

లగ్గం పెట్టించేందుకే బయల్దేరాం మేమందరం చేతులు నలుపుకుంటూ బతిమాలేడు పెద్దిరెడ్డి

* * * * *

సముద్రంలో కెరటాలు కదిలినట్లు కదిలారు గూడెంవాళ్లు

గొడ్లశాలలు శుభ్రం అయ్యాయి

పిల్లలు కేరింతలు కొడుతూ పాలు కుడుస్తున్నారు

పెద్దవాళ్లు కాపి బొట్టు బొట్టు చప్పరించుకొంటూ ఆబగా తాగుతున్నారు

మాసిన గడ్డాలు బరబరా తెగిపోయినై

చచ్చిన ఆవుని వెట్టివాళ్లు మోసుకుపోయారు

చాకిరేవు ఉస్! ఉస్! చప్పుళ్లతో మోగిపోయింది

మూడవ రోజు రాములవారి గుళ్లో ఊరంతా చూస్తుండగా చిన్నబ్బాయి అనబడే బసవారెడ్డికి నీలమ్మకు మనువయింది

నీలమ్మ పేర సగం ఆస్తి రాయబడింది

వివాహం తర్వాత నీలమ్మకు ఎటువంటి ఆపద వచ్చినా అందుకు తామే బాధ్యులమంటూ పెద్దిరెడ్డి బసవారెడ్డి కాగితం రాసిచ్చారు పోలీసులకి

పోలీసులు భుక్తాయాసంతో పట్నం దారి పట్టారు

గూడెంలో వేపచెట్టు బోదివృక్షంలా అలాగే నిలబడి వుంది □

వెట్టివాడు ఒక్కడూ రాలేదు

రాత్రికల్లా ఉబ్బిపోయింది గొడ్డు దాని శరీరం నుంచి చెడు వాసన రావటం మొదలైంది

పాల కోసం పిల్లల ఎడుపు

ఎక్కడి పనులు అక్కడే ఆగిపోయినై

పశువుల సంగతి పట్టించుకొనే నాథుడే లేడు

యిళ్లన్నీ గగ్గోలెత్తి పోతున్నాయి

* * * * *

రోజు గడిచేసరికి కామందుల మొహాలు పీక్కుపోయినై పెద్దిరెడ్డి మాసిన గడ్డంతో దుమ్ము కొట్టుకు పోయిన గుడ్డల్తో పడక్కుర్చీలో నీలుక్కుపోయి కూచున్నాడు

చిన్నబ్బాయి అనబడే బసవారెడ్డి దేభ్యం మొహం వేసుకొని ఆకాశంలోకి చూస్తూ కూచున్నాడు

కాళ్ల బేరం తప్ప గత్యంతరం లేదని అర్థమై పోయింది అందరికీ!

అందరూ కలిసి ఊరికి దూరంగా వున్న గూడెం వైపు నడిచారు పడగ చితికిన పాములాగా మందంగా నడుస్తున్నాడు పెద్దిరెడ్డి గుంపు

బొమ్మల సీరియల్

సీక్రెట్ ఏజంట్
# విక్రమ్
③



























# సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వర రావు

(గత సంచిక తరువాయి)

ఇంట్లోంచి బయటకు వచ్చిన సీతకు ఎక్కడికెళ్ళాలో తోచలేదు ఏ ముఖం పెట్టుకుని తండ్రి దగ్గరకు వెళుతుంది వెళ్ళినా ఎన్ని రోజులు భర్త చే గెంటి వేయబడిందనే నిజం తెలిస్తే తండ్రి తట్టుకోగలడా!

తనంటే ఎంతో అభిమానిస్తున్న అత్తా మామయ్యగార్లకు ఈ విషయం తెలిస్తే ఎంత అసహ్యించుకుంటారు?

భార్గవా ఎంత అన్యాయం చేసావు?

ఓ నిర్ణయానికి వచ్చింది

సీత పగబట్టిన సింహంలా రుద్రకాళిలా మారింది

గుండెను రాయి చేసుకుంది

చాలా రాత్రయింది

భార్గవ ఏ లాడ్జికి రమ్మన్నాడో అక్కడకు వెళ్ళింది కౌంటరులో సాయంత్రమే రూం ఖాళీ చేసి వెళ్ళిపోయాడని చెప్పారు

అలాగే స్టేషను కెళ్ళింది

టిక్కెట్టు తీసుకుంది

ఎక్కడకు?

వెయిటింగ్ రూంలో ఎంత సేపు కూర్చుందో గాని ట్రైన్ బయలుదేరుతుందనే ఎనౌన్సమెంటు వినబడడంతో లేచి గబగబ బండి ఎక్కింది

బండి ఎంత వేగంగా వెళుతుందో అంతకు వేయి రెట్ల వేగంతో పరుగెడుతున్నాయి సీత ఆలోచనలు

ఏమండి

సీత చూసింది

ఎదురుగా ఒక అమ్మాయి వయస్సు ఇరవై పైనే ఉంటుంది తెల్లచీర కట్టుకుందే గాని శరీరంలోని అంగాంగం స్పష్టంగా కనిపిస్తుంది ఎంత సెక్సీగా ఉందంటే జాకెట్‌లోంచి కనిపిస్తున్న ఎత్తయిన స్తనాలు చూసే వాళ్ళకు పిచ్చి పట్టేలా ఉన్నాయి జాకెట్టుకు చీరకు మధ్య ఉన్న భాగమంతా కనిపిస్తుంది నడుముకు ఎన్ని మెలికలున్నాయో లెక్క కట్టవచ్చు చీర లంగా పేరుకే తొడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి పెదవులకు రంగు

ఆ అమ్మాయి మీద సదభిప్రాయం కలగలేదు

ముఖం తిప్పేసింది సీత

ఆ అమ్మాయి ఏ మాలోచించిందో ఏమో పెట్టెలోంచి మరో చీర తీసుకుని లెవెట్రిక వెళ్ళి కట్టుకుని వచ్చింది

సీతను మళ్ళీ పిలిచింది

సీత చూసింది

తెల్లచీరకు బదులు ఆకుపచ్చ చీర కట్టిన తీరు చూసి ఆ అమ్మాయేనా అనిపించింది సీతకు

చూడండి బండి ఎక్కినప్పటి నుండి చూస్తున్నాను దేనికో బాధ పడుతున్నట్లు కనిపిస్తున్నారు నోట్లో ఏవీ పడలేదన్న నిజం మీ ముఖమే చెబుతుంది కొంచెం టిఫిను తీసుకోండి

టిఫిను పొట్లం సీటు మీద ఉంచింది

సీతకు బాగా ఆకలి వేస్తుందేమో మరేం మాట్లాడకుండా తీసుకుంది శరీరం కొంచెం కుదుట పడింది థాంక్స్ చెప్పింది

చూసారా ఇంతకు ముందు నా రూపం చూసి మాట్లాడడమే పాపమనుకుని ముఖం తిప్పేసారు లోకంలో బాహ్య ఆకారాలు చూసి ఏ మనుష్యులు ఎటువంటి వారో తేలిగ్గా ఊహించవచ్చు రూపం బట్టి మనిషికి గుర్తింపు గౌరవం ఇస్తుంది సమాజం

ఆమె మాటల్లో ఏదో చెప్పాలనే తాపత్రయం స్పష్టమైంది అది పసిగట్టిన సీత మరోలా భావించకండి అంది

మీరు ఎంత వరకూ వెళుతున్నారు

ఎక్కడకు వెళ్ళాలో నాకే తెలియదు అయితే ఈ టికెట్టు ఎంత దూరం వరకూ పని చేస్తుందో అక్కడ ఆగిపోతుంది నా ప్రయాణం

సీత మాటలు అర్థం కాలేదు ఆమెకు

సీత చూపించిన టిక్కెట్టు చూసింది

చూడండీ మీ ప్రయాణం నేను దిగే స్టేషనుతో ఆగిపోతుంది అక్కడ నుండి మీకు అభ్యంతరం లేకపోతే నాతో రండి మీ గమ్యం ఏమిటో మీకు తెలిసే వరకు అక్కడకు వెళ్ళే వరకు ఒక స్నేహితురాలిగా తోడుంటాను

ఆమె ఫ్లాస్కులోంచి కాఫీ గ్లాసులో పోసి సీతకు ఇచ్చింది

సీత ఆలోచించింది

తనేం చెయ్యాలి?

తన ఆశయం ఒక్కటే

భార్గవను పట్టుకోవాలి

తను శీలం పోగొట్టుకోలేదని వాడి నోటితోనే భర్తకు చెప్పించాలి అంతవరకూ తనెక్కడయినా తలదాచుకోవాలి

సీత సరేనంది

మీరు నాతో వస్తున్నందుకు సంతోషంగా ఉంది అయితే నా గురించి పూర్తిగ తెలుసుకున్న తర్వాత మాత్రమే మీ నిర్ణయాన్ని ఖాయం చేసుకోండి చాలా మంది ఆడపిల్లల్లా నేనూ దగాబడి నా అనేవాళ్ళకు దూరమై పిరికగా చావలేక ధైర్యంగా ఎలాగైనా బ్రతకాలని నిర్ణయం తీసుకుని ఎలా బ్రతకాలో ఆలోచించాను ఉద్యోగానికి సరియైన అర్హతలు లేవు నా అందం శరీరంలోని ఒంపులే నా క్వాలిఫికేషన్లు ఒక క్లబ్బులో డ్యాన్సరుగ అడుగు పెట్టాను జీవితంలో అందరూ ఆశించే ప్రేమ అనురాగం సంతోషం సంపాదించ లేకపోయాను కానీ పుష్కలంగా డబ్బు గడిస్తున్నాను ఇప్పుడు చెప్పండి నాతో వస్తారా నన్ను అసహ్యించుకుంటారా

సీత చిన్నగా నవ్వింది

మగవాడి చేత మోసగింపబడిన ఏ ఆడదాన్ని చూసినా జాలే తప్ప అసహ్యం కలగదు నాకు వారిని హేళన చేయను బ్రతకడానికి వాళ్ళు చేసే పనిని అసహ్యించుకోను ఆడది సాటి ఆడదానికి అన్యాయం చేయదనే నా

**జరిగిన కథ- 3** కాలేజిలో లెక్చరర్‌గా పని చేస్తున్న స్వరూప స్వంత కొడుకుని హత్య చేసింది ఈ నేరం తనే కోర్టులో స్వయంగా ఒప్పుకుంది తన తరఫున వాదించడానికి వచ్చిన లాయరు హరితకు తన జీవిత విశేషాలను చెప్పసాగింది ఇద్దరు పిల్లల తల్లిఅయిన స్వరూప భర్త భార్గవ దుర్మార్గాలను కళ్ళారా చూసి అతనికి విడాకులిచ్చింది అంతేగాక అతనిని జైలుకి పంపింది సీత డాలీలు చెప్పింది హరిత ముందు ఉంచింది స్వరూప సీత నళిని అక్కచెల్లెళ్ళు తల్లి లేని పిల్లలని తండ్రి మన్మదరావు వీళ్ళను అల్లారుముద్దుగా చూసుకుంటున్నాడు సీత తను ప్రేమించిన భార్గవ మోసగాడని తెలుసుకుని తన తండ్రి తెచ్చిన సంబంధానికి ఒప్పుకుంది సీత పెళ్ళి రామారావుతో జరిగిపోయింది భార్గవ రాసిన అబద్ధపు ఉత్తరం వల్ల రామారావు సీత విడిపోయారు

నమ్మకం ఆ నమ్మకంతో నే మీతో వస్తాను

సీత మాటలకు ఆమెలో సంతోషం

కళ్ళల్లో తడి మెరిసింది

నా పేరు డాలీ మీ పేరు

సీత ఆలోచనలకు ఏదో రూపం మెదిలింది

జ్వాల

* * * * *

సీత జ్వాలగా డాలీతో వెళ్ళింది

డాలీతో వచ్చి రెండ్రోజులయింది

జ్వాలగారూ మీరు ఏమీ అనుకోకపోతే ఓ విషయం పాటలు బాగా పాడతారని చెప్పారు కదా మా క్లబ్బులో పర్మినెంట్ లేడీ సింగరు ఎవరూ లేరు అందరూ కాంట్రాక్టులే మీరు ఒప్పుకుంటే ఆ ఉద్యోగం మీకిప్పిస్తాను జీతం కూడా ఎక్కువే అభ్యంతరం లేకపోతే చెప్పండి మేనేజరుతో మాట్లాడుతాను

సీత జ్వాల చాలా సేపు ఆలోచించింది

ఆ మర్నాడు డాలీతో క్లబ్బుకు వెళ్ళింది

అంతకుముందే డాలీ మేనేజరుకు చెప్పింది

మేనేజరు ఆర్కెస్ట్రా మీద ఓ పాట పాడమన్నాడు

ఆవేశం పగ కోపం కసి భావం కలిగే పాట పాడింది

పాటకు ముగ్ధుడయ్యాడు మేనేజరు

మీ గురించి డాలీ చెప్పింది మీలాంటి మంచి సింగరు మాకు దొరికినందుకు అయామ్ రియల్లీ వెరి హేపీ మీకు మా సహాయం ఎప్పుడూ ఉంటుంది డాలీ చెప్పినట్లుగా మా క్లబ్ వాతావరణంలో మీకు ఎటువంటి ప్రమాదం జరగకుండా చూస్తాం మీరు ఎప్పుడు వెళ్ళిపోవాలనుకుంటే అప్పుడే వెళ్ళండి షరతులు ఒప్పందాలు లేవు ఎవరైనా మీ గురించి పల్లెత్తు మాటన్నా నేను సంజాయిషి చెప్పుకుంటాను

అతని సహృదయతకు గౌరవానికి ధన్యవాదాలు చెప్పింది సీత కాదు జ్వాల

* * * * *

గడియారం నాలుగ్గంటలు కొట్టింది

వాస్తవానికి వచ్చింది జ్వాల

సంవత్సరమైంది సీత జ్వాలగా మారి

ఈ సంవత్సరంలో ఎన్నో సార్లు అనిపించింది నాన్నను చెల్లెలును చూడాలని వెళ్ళాలంటే భయం ఏ మాత్రం ధైర్యం చాలడం లేదు ఈపాటికి తన గురించి అందరికీ తెలిసిపోయి ఉండొచ్చు అభిమానించే నాన్న చెల్లెలు అత్త మామయ్య మరుదులు ఎంత అసహ్యించుకుంటున్నారో

భగవాన్ నా జీవితం ఇలా తయారయిందేమిటి?

భార్గవ

నీ అంతం చూస్తాను భార్గవా

అనుకుంది కసిగా

మంచం మీద వాలిపోయింది

అలాగే నిద్ర పట్టేసింది

* * * * *

ఉదయాన్నే లేచి హడావిడిగా తయారవుతున్న జ్వాలను చూసింది డాలీ జ్వాల ఒంటరిగా బయటకు వెళ్ళదు ఒకవేళ వెళ్ళినా ఏ నవలో కొనుక్కోవడానికే అరగంట అప్పుడైనా వెళ్ళే ముందు చెబుతుంది ఈ రోజు ఎందుకంత సిరియస్‌గా ఉంది చెప్పకుండా బయలుదేరుతుంది అంతలో జ్వాల మాటలు గుర్తొచ్చాయి జ్వాల ఏ అఘాయిత్యమైనా చేస్తే

జ్వాలా ఎక్కడికి?

డాలీ ముందే చెప్పాను ఎవరి కోసమైతే ఇన్ని రోజులూ వెదుకుతున్నానో వాడు ఆ భార్గవ కనిపించాడు వాణ్ని చంపందే నాకు మనశ్శాంతి ఉండదు

జ్వాలా ఇది మంచి పద్ధతి కాదు భార్గవ మీద అంత పగ ఉంటే రహస్యాలు బయట పెట్టి పోలీసులకు అప్పగించు అంతేకానీ వాడిని చంపి నువ్వొక హంతకురాలిగా జైలుకు వెళ్ళి జీవితాన్ని నాశనం చేసుకోవడం సరియైంది కాదు

వాడు పోలీసులకు చిక్కడు ఇక నా జీవితం అంటావా ఏ రోజైతే భర్త చేత అనుమానింపబడి గడప దాటి బయటకు వచ్చానో ఆ రోజే మానసికంగా చనిపోయాను మిగిలి ఉన్నది శరీరం పగతో నిండిన గుండె అంది విరక్తిగా జ్వాల



# చైతన్య స్వరూపం

జ్వాల బయటకు వెళ్ళింతర్వాత చాలా సేపు ఆలోచించింది డాలి జ్వాల పట్టు పట్టిందంటే ఏదైనా చేయగలదు ఈ విపత్తు నుండి జ్వాలను కాపాడాలి

తళుక్కున మెరిసిందొక ఆలోచన

డాలీ జ్వాల పెట్టింతా వెదకింది

ఆల్బమ్ కనిపించింది

మొదటి పేజీలో సీతారాముల కళ్యాణం అని రాసి ఉంది అవన్నీ పెళ్ళి ఫోటోలు

సీత

జ్వాల జ్వాల కాదు సీత

భర్త రామారావు లాయరు

డాలి గబగబ ఒక కాగితం మీద ఎడ్రసు రాసుకుని రామారావు ఫోటోను ఒకటి బయటకు తీసింది మళ్ళీ మామూలుగా పెట్టి సర్దేసింది

డాలీలో ఎన్నో ఆలోచనలు

ఎలాగైనా సీతను భర్త దగ్గరకు పంపించాలి

ఎలా? ఎలా?

అలా ఆలోచిస్తూ కూర్చుంది

ఆలోచనలు ఓ రూపాన్ని దిద్దుకున్నాయి

జ్వాల మధ్యాహ్నం వచ్చింది

రేపు ఎలాగైనా వాడిని పట్టుకుని వాడి చావుకు వాడే ముహూర్తం పెట్టేలా చేస్తాను అంది వస్తూనే బట్టలు మార్చుకుంటూ

జ్వాలా నాకు తెలియక అడుగుతున్నాను భార్గవను ప్రేమించావు షికార్లకు సినిమాలకు వెళ్ళావు అంతకు తెగించిన దానివి ఆ భార్గవతో శారీరక సంబంధం పెట్టుకోలేదంటే నేను నమ్మను అలా అతనితో ఆ సంబంధం కలిగి ఉన్నావు కాబట్టే భర్తకు ఎదురు తిరిగి జవాబు చెప్పలేక ధైర్యంగా బయటకు వచ్చావు ఈ విషయం భార్గవ నీ భర్తకు చెప్పగానే ఉక్రోషంతో పగ పట్టావు

అంతే డాలీ చెంప చెళ్ళు మంది

జ్వాల ఆవేశంతో ఊగిపోయింది

ఏమన్నావ్ ఆ రాక్షసుడితో శారీరక సంబంధమా ఆ మాట మళ్ళీ అన్నావంటే అని జ్వాల డాలీ మెడను పట్టుకుంది

డాలీ విదిల్చుకుని జ్వాలను మరింతగా రెచ్చగొట్టే ధోరణిలో ముమ్మాటికి అంటాను భార్గవతో కులికావు ఇది అబద్ధమైతే ఆ భార్గవ నోటితో చెప్పించు అంది

జ్వాల మండిపోతుంది

చెప్పిస్తాను నేను పవిత్రమైన దానినని వాడితోనే చెప్పిస్తాను జ్వాల హేండ్ బేగ్‌లోంచి ఒక బాటిల్ తీసింది డాలీ కళ్ళప్పగించి అలాగే నిలబడిపోయింది జ్వాల చేతిలో పాయిజిన్ సీసా

వచ్చే గురువారం అంటే ఇంకో ఐదు రోజుల్లో భార్గవ మన హోటలుకు నాకు గెస్ట్‌గా వస్తాడు మంచి మాటలతో వాడిని నా దగ్గరకు తీసుకుని వాడి చేత్తోనే ఈ విషం తాగేలా చేస్తాను విషం నోట్లో పడక ముందే నిజాన్ని కక్కిస్తాను

జ్వాల పథకం అర్థమైంది

చాలా సేపు డాలీ మాట్లాడలేదు

* * * * *

ఆ రాత్రికి రాత్రి డాలీ వైజాగ్ వెళ్ళింది

స్టేషనులోంచి బయటకు వచ్చి బేగ్‌లోంచి ఎడ్రసు కాగితం తీసి ఆటోను పిలిచి ఎడ్రసు చెప్పి పోనియమంది

డాలీ ఎన్నెన్నో ఆలోచిస్తుంది

సీత భర్త ఏ స్థితిలో ఉన్నాడు?

మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడా!

లేక సీత కోసం నిరీక్షణలో ఉన్నాడా?

తన పథకం చెప్పాలి

చెప్పితే అర్థం చేసుకుంటాడా!

ఆటో ఒక ఇంటి ముందు ఆగింది

గేటు మీద రామారావు అడ్వకేట్ నేమ్ బోర్డుంది

హేండ్‌బేగ్‌లోంచి ఫోటో తీసి ఓసారి చూసింది

డాలీ నెమ్మదిగా గేటు తీసుకుని వరండాలో కెళ్ళింది

తలుపులు దగ్గరగా చేర వేసి ఉన్నాయి

డాలీ కాలింగ్ బెల్ నొక్కబోయి ఆగింది

లోపల నుండి మాటలు గట్టిగా వినిపిస్తున్నాయి

గదిలో

సీత ఎక్కడుంది?

రామారావు తండ్రి సుబ్బారావు గారు అడిగారు

రామారావు మాట్లాడలేదు

ఒరేయ్ సీత కనిపించి సంవత్సరమైంది ఈ సంవత్సరంలో ఎన్నిసార్లు వచ్చినా సీత ఇంట్లో ఉన్న ఛాయలే కనిపించలేదు ఒకసారి వస్తే ఫ్రెండ్ మ్యారేజ్ కని రెండో సారి లేడీస్ క్లబ్ ఎక్కర్షన్‌కి వెళ్ళిందన్నావు తీసుకు రమ్మంటే పై ఊరులో బియిడి చేస్తుందన్నావ్ మన్మధరావడిగితే సమాధానం చెప్పలేక పోతున్నాను నళిని రెండ్రోజుల క్రితం వచ్చింది నాన్నకు ఒంట్లో బాగా లేదు అక్కను కలవరిస్తున్నాడు అక్కను పంపించండి అని ఏడుస్తూ అడిగితే ఆ పిల్ల ముఖం చూడలేకపోయాను పై ఊర్లో చాలా మంది అమ్మాయిలు చదువుతున్నారు చదువయ్యే లోపల ఇండ్లకు వస్తున్నారు కానీ సీత ఇక్కడకు రావడం లేదు పుట్టింటికి వెళ్ళడం లేదు కనీసం ఉత్తరం కూడా వ్రాయడం లేదు చెప్పు సీత ఎక్కడుంది

నాకు తెలియదు

ఆ సమాధానానికి మండిపోయిన సుబ్బారావు గారు కొడుకు రెండు చెంపల మీద కొట్టారు

చెట్టంత కొడుకు మీద చేయి చేసుకున్న భర్తను ఆశ్చర్యంతో కన్నీటితో చూసింది భార్య

రాముడూ సీత ఎక్కడుందో చెప్పరా

తల్లి అడిగింది

వీడు బుద్ధిమంతుడని మురిసిపోయానే లాయరని గర్వపడ్డానే కానీ భార్యను బయటకు గెంటేసే ప్రబుద్ధుడని తెలుసుకో లేకపోయాను వీడిలో ఇంత రాక్షసత్వం ఉందని తెలిస్తే బంగారం లాంటి అమ్మాయిని వీడికిచ్చి పెళ్ళి చేసేవాడిని కాను వీడు ఏ అమ్మాయినో మరిగాడు పెద్దల మాట కాదనలేక సీతను చేసుకుని ఎవరూ తన దగ్గర లేరన్న భ్రమతో బాధలు పెట్టి బయటకు గెంటేసాడు

తండ్రి మాటలకు మధ్యలోనే అడ్డుపడి రామారావు అబద్ధం అని గట్టిగా

## తప్పొప్పులు

తప్పుడు పనులు
చేస్తావు ఎందుకురా?
అనడిగితే అంటున్నాడు
ఒప్పుడు పనులకు
గుర్తింపు రావాలంటే
తప్పుడు తప్పుడు పనులని

—సి వి సర్వేశ్వరశర్మ

అరిచాడు

నేను ఏ అమ్మాయిని మరగలేదు సీతను మోసం చేయలేదు పెళ్ళికి ముందు సీత ఎవరినో ప్రేమించింది ఈ రహస్యం తెలియగానే మగాడిగా భరించలేక కొట్టాను తిట్టాను

తల్లీ తండ్రి అవాక్కయ్యారు

కొడుకు చెప్పింది నిజమా అబద్ధమా

ఒరేయ్ సీత నిజంగా అటువంటిదే అయితే పెళ్ళికి ఒప్పుకోదు ఆ ఇంటితో నాకు మొదటి నుండి పరిచయం మన్మదరావు ఎంత మర్యాదస్తుడో ఆడపిల్లలిద్దరూ ఎటువంటి ఆణిముత్యాలో నాకు బాగా తెలుసు అన్నీ తెలుసు కాబట్టే నేను అడిగాను మీ అమ్మాయిని కోడలుగా చేసుకుంటానని

వాళ్ళ మీద ఉన్న అబిమానంతో అలా మాట్లాడుతున్నారు కానీ నేను చెప్పింది నిజమేనని మీకెలా చెప్పాలో తెలియడం లేదు

ఈ రోజుల్లో అబ్బాయిలు అమ్మాయిలు ఎందరో ప్రేమలో పడుతున్నారు ప్రేమ సక్సెస్ కాకపోతే జీవితాలతో రాజీపడి పెళ్ళిళ్ళు చేసుకుని సంసారాలు చేసుకోవడం లేదా అంతమాత్రాన బార్య ప్రేమ విషయం తెలియగానే బయటకు గెంటేయడమేనా ఇదేనా నీ సహృదయత నీవు చదివిన ళా ఇదేనా చెప్పింది బార్యను క్షమించలేవా ఒక మగవాడిగా, రాక్షసుడిగా ప్రవర్తించడమేనా

తండ్రి అలా సూటిగా అడిగేసరికి తల దించేసాడు

నిజానిజాలు నిలకడ మీద తెలుస్తాయి ముందు సీత ఎక్కడుందో వెదకి తీసుకురా అప్పుడు నువ్వు ఇంటి కొచ్చి మా ముఖాలు చూస్తావు కూతురి గురించి మన్మదరావడిగితే ఏం చెప్పాలో తెలియక తప్పించుకు తిరుగుతున్నాను అన్ని నిజాలు తెలుసుకుని సీతను తీసుకొచ్చి సంసారం చేసుకుంటూ ఇద్దరూ నవ్వుతూ ఇంటికి రండి అలా నీ కిష్టం లేకపోతే మర్యాదగా ఆ అమ్మాయిని తండ్రికి అప్పగించు

అని సుబ్బారావు గారు బార్యతో రా పూర్ణా వీడు మనిషిగా మారే వరకు ముఖం చూడకూడదు మనకూ ఒక అమ్మాయి ఉంటే ఆడపిల్లల బాదలు తండ్రి పడే మానసిక క్షోబ మనకు తెలిసేది ఆ మాత్రం మానవత్వముండాలి

అడుగులు చప్పుడు కావడంతో వాళ్ళు బయటకు వస్తున్నారని గ్రహించి డాలీ గబగబ వరండా దిగి రోడ్డు మీద కొచ్చింది

కొంత దూరం వెళ్ళి నిలబడింది

రామారావు తల్లితండ్రులు అటువైపు వచ్చిన ఆటోను ఎక్కి వెళ్ళిపోవడం గమనించి డాలీ నెమ్మదిగా సరాసరి ఆఫీసు రూంలో కూర్చున్న రామారావు దగ్గరకు వెళ్ళింది

కుర్చీలో వెనక్కి వాలి కణతలు నొక్కుకుంటున్నాడు రామారావు

ఎక్స్క్యూజ్ మి అంది నెమ్మదిగా

రామారావు చివుక్కున తలెత్తి చూసాడు

డాలీని చూసి బహుశా ఏ కేసైనా పట్టుకుని వచ్చిందనుకుని సారి ఏ క్లయింటుని పరామర్శించలేను ఏ కేసునూ టేకప్ చేసే స్థితిలో లేను మరో లాయరును చూడండి అన్నాడు

క్లయింటుగా రాలేదు మీతో పర్సనల్‌గా మాట్లాడే పని మీద వచ్చాను

రామారావు ఆశ్చర్యపోయాడు

ఈమె ఎవరో తనకు తెలియదు

తనతో పర్సనల్‌గా మాట్లాడే అవసరం ఏమొచ్చింది

రండి కూర్చోండి

పని మనిషిని పిలిచి టీలు చెప్పాడు

ఇప్పుడు చెప్పండి మీరెవరు? నాతో పర్సనల్‌గా మాట్లాడే అవసరం ఏమిటి

కొంచెం చిరాకు విసురు స్పష్టమయ్యాయి రామారావు మాటల్లో

మీరు ఏమీ అనుకోకపోతే చిన్న సహాయం నేను చాలా దూరం నుండి వచ్చాను లాడ్జిలో దిగలేదు ప్రెష్‌గా స్నానం చేయాలి తర్వాత మాట్లాడతాను

డాలీ అలా అడగ్గానే కోపం వచ్చింది రామారావుకు తండ్రి చివాట్లు పెట్టి వెళ్ళి అరగంట కాలేదు ఇప్పుడు ఈ అమ్మాయి వచ్చి ఇలా అడుగుతుంది ఈ పరిస్థితిలో పనిమనిషికి అనుమానం వస్తే ఈ విషయం కాస్త నాన్నకు చేరవేస్తే నిజంగా తనొక అమ్మాయి వలలో పడ్డాడనుకుంటారు అమ్మాయిని బయటకు పంపించేయాల నుకున్నాడు కానీ మర్యాద అడ్డు వచ్చింది

టీలు తీసుకొచ్చిన పనిమనిషికి చెప్పాడు

టీ త్రాగిం తర్వాత బేగ్‌లోంచి బట్టలు తీసుకుని పనిమనిషి వెనక వెళ్ళింది

స్నానం చేసి బట్టలు మార్చుకుని బయటకు వచ్చేసరికి టేబిలు మీద టిపిను రడిగా ఉంది ఆ పనీ అయ్యాక ఆపీసు రూంకెళ్ళింది

ఇప్పుడు చెప్పండి

మీ బార్య వూరులో నే ఉన్నారా

తలెత్తి చూసాడు ఈవిడకెందుకా విషయం ఆదే అడిగాడు

ఎక్కడకెళ్ళారు

చూడండి మీరే విషయం గురించి మాట్లాడ్డానిక వచ్చారో అది తొందరగా చెప్పితే మంచిది విసురుగా అన్నాడు

మీ బార్య మీద మీకు ప్రేమ ఉందా

ఉంది

అయితే ఆమెను ఎందుకు బయటకు పంపేసారు

మీరు అతిగా మాట్లాడుతున్నారు

అలా మీరనుకుంటే క్షమించండి నేనొక ముఖ్యమైన పనిమీద వచ్చాను నాతో సహకరించారంటే మీకు మేలు కలుగుతుంది

డాలీ మాటలు అర్ధంకాలేదు రామారావుకు

చూడండి రామారావుగారూ మీ బార్య సీత సీత గురించి ఏ మిషతో సీతను బయటకు పంపేరో నాకు తెలుసు ప్రస్తుతం సీత ఎక్కడ ఎలా ఉందో నాకు తెలుసు

రామారావు ముఖంలో విరిసిన ఆనందం డాలీకి స్పష్టంగా కనిపించింది

సీత ఎక్కడుంది? ఎలా ఉంది? మీకెలా తెలుసు? ఆత్రుతగా అడిగాడు

ఒక షరతు మీదే సీత వివరాలు చెప్తాను సీతను మునుపటి లాగే ప్రేమించి ఆమెకు అందమైన జీవితం ఇస్తారా నిర్దోషి అని తెలిసిం తర్వాత ఏ అరమరికలు లేకుండా సంసారం చేస్తారా

సీత నిర్దోషి అని తెలిసే రోజు కోసమే ఎదురు చూస్తున్నాను సీత లేని లోటు ఇప్పుడిప్పుడే తెలుస్తుంది సీత ఎక్కడున్నా ఎలా ఉన్నా తీసుకొస్తాను

పశ్చాత్తాపం కనిపిస్తుంది అతని మాటల్లో

తనొచ్చిన పని సవ్యంగా అయినందుకు సంతోషించింది డాలీ

డాలీ సీత బార్గవ గురించి సీతలో వచ్చిన మార్పు సీత పథకం అంతా చెప్పింది

రామారావు బొమ్మలా అయిపోయాడు (ఇంకా ఉంది)



# అల్లాడుపల్లె వీరభద్రస్వామి

ఆంధ్ర దేశములో అక్షర జ్ఞానము లేని అజ్ఞానులకు కూడ కాలజ్ఞాన జ్ఞానాన్ని ప్రసాదించిన మహాతత్వవేత్త మహామహి మాన్వితులు కారణజన్ములు అయిన శ్రీ సద్గురు విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర సాముల వారు తమ అమృత హస్తములతో కడపజిల్లా యాగంటి కొండ గుహలో తయారు చేసి స్వహస్తాలతో ప్రతిష్ఠ గావించిన శ్రీ వీరభద్రస్వామి వారి విగ్రహమున్న ఆలయమే అల్లాడుపల్లె వీరబద్రేశ్వరాలయము

ఇది ప్రొద్దుటూరు - మైదుకూరు ప్రదాన మార్గమున కిసుమంత దూరములో ప్రకృతి దృశ్యాల కాలవాలమయిన కుముద్వతీ నది తీర ప్రదేశములో పచ్చని పంటచేల మధ్య మఱ్ఱి జావ్వి వేప చెట్ల మధ్య మూడు శతాబ్దాలకు పూర్వము స్థాపించిన ఆలయమే శ్రీ వీరబద్రస్వామి దేవాలయము

రాయలసీమ ప్రాంతములోని అత్యంత ప్రధానమయిన శివక్షేత్రాల్లో నిది యొకటి ఆలయము విశాల మైదానములో చుట్టూ పరవసిస్తున్న పంట పొలాల మధ్య వెలసి వున్నది ఆలయము చుట్టూ యెత్తయిన చక్కని ప్రాకార మున్నది ఆలయ ప్రవేశానికి రెండు ప్రదాన ద్వారా లున్నాయి

ఉత్తర వైపున ప్రధానమయిన పెద్ద రాజగోపుర మున్నది తూర్పు దిక్కున మరో చిన్న ద్వార మున్నది ఇదే ప్రదాన ద్వారంగా విరాజిల్లుతూంది ఆలయానికి ఉత్తర వైపునా తూర్పు వైపునా చాట స్థంబములు నిలపబడి వున్నాయి

రాజగోపురానికి కొంత దూరములో చక్కని రాతి మంటప మున్నది ఇది నాలుగు స్థంబములపై యెత్తయిన వేదికపై నిర్మింప బడినది దీని స్థంబాలపై చెక్కిన శిల్పము పైకప్పుపై చెక్కిన శతవత్ర పద్మము విజయనగర కాలమునాటి శిల్పాల స్పురణకు తెస్తాయి రాజగోపురానికి ముందు నంది గోపురము దాని ప్రక్క కోనేరు నిర్మించారు

గర్భగుడిలో నల్లరాతితో నిర్మించిన నిలువెత్తు విగ్రహము నిగనిగలాడుతూ వుంటుంది ఈ ఆలయములో స్వామి వారు ఉత్తరాబి ముఖులై వుండడము విశేషంగా చెప్పుకుంటారు

స్థల పురాణము - మూడు వందల యేండ్లకు పూర్వము కర్నూలు జిల్లా బనగానిపల్లె గ్రామములో గరిమిరెడ్డి అచ్చమ్మగారనే శ్రీమంతుల యింట వీరయ్య నామ దేయముతో విశ్వ బ్రాహ్మణ వంశమునకు చెందిన శ్రీ వీంబ్రహ్మేంద్ర స్వాముల వారు ఆలకాపరిగా వుండేవాడు పశువులను మేతకొరకు యాగంటి కొండకు తోలుకొని వెళ్ళేడివాడట అక్కడాయన ఒక గిరి గిచి పశువుల నందు నిలిపి ప్రక్కనున్న కొండ గుహలో కూర్చొని వీరబద్రుని విగ్రహం తయారు చేశాడు విగ్రహము తయారై కొన్నాళ్లకు కుముద్వతీ నదికి విపరితమయిన వరదల్లు వచ్చాయి ఆ వరదల్లో కొండ గుహలోని వీరబద్రుని విగ్రహము కొట్టుకొని వచ్చి ప్రస్తుతము స్వామి వారు వెలిసిన చోటికి ఉత్తరంగా ఉన్న కేతవరమనే గ్రామము చెంత



శ్రీ వీరబ్రహ్మేంద్రుల వారు ప్రతిష్ఠించిన వీరబద్రస్వామి మూల విరాట్టు

కుముద్వతీ నది మడుగులో చేరింది

అప్పటికే వీరయ్య బనగానిపల్లె నుండి కేతవరము చేరి పిచ్చి వీరయ్యగా పిలువబడుతూ వడ్రంగం వృత్తిగా జీవిస్తుండే వాడు కేతవరం గ్రామ ప్రజలు అక్కడేదో వింతలు జరుగు తున్నాయని తెలిసి వీరయ్య ద్వారా కుముద్వలు మడుగులో వీరబద్రుని విగ్రహం దాగివుందనీ దాన్ని వెలకి తీసి ప్రతిష్ఠ చేసి పాకారాదులు కట్టించ వలయునని తెలుసు కున్నారు

గ్రామ రెడ్డిగారి కొడుకు కోడళ్ళు ప్రజలు పూజాద్రవ్యాలతో కుముద్వతి చేరి శ్రీ వీరయ్య సాయముతో వీరబద్రుని విగ్రహాన్ని వెలికి తీసి



శ్రీ వీరబద్రస్వామి వారి ప్రధాన ఆలయము



ఆలయము వెలుపల నున్న సూందర మండపము

బండిపై అమర్చి మంగళ వాద్యములతో అల్లాడుపల్లె దరికి చేర్చారు అప్పటికి మద్యాహ్నము దాటుటచె ప్రజలు బోజనములు చెయ కేతవరము వెళ్ళిరి

వీరయ్య మాత్రం మంత్రోపాసన చేస్తూ కూర్చొని యుండగా ఆ శిలాప్రతిమ బండి నుండి కదలి వచ్చి తనకు తానే ప్రతిష్ఠించు కొన్నది నాటి నుండి ఈ మూలవిరాట్టు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి ప్రతిష్టగా చెప్పుకుంటారు శ్రీ వీరబ్రహ్మం గారి మఠాధిపతుల కిది యిప్పటికి గురుపీఠంగానే వుంది ప్రతి సంవత్సరం బ్రహ్మంగారి మఠము నుండి ఆయన వంశీకులు వచ్చి స్వామి వారిని సేవించి వెళుతూ వుంటారు కుముద్వతి నది తీరములో స్వామి వారి విగ్రహమున్న చోట యిప్పటికి విభూతి కుప్ప తెప్పలుగా దొరుకు తుంది

స్వామివారి విగ్రహం ఆరడుగుల నిండైన నల్లరాతి విగ్రహం ఖడ్గము దరించి రౌద్రాకారములో కనిపిస్తారు ఎన్నడూ చూడని వారు మూలవిరాట్టు విగ్రహాన్ని నూనె దివాల వెలుగులో చూస్తె ప్రత్యక్షంగా మనిషి నిలుచున్నట్లుంది

శివరాత్రి నాడిక్కడ పెద్ద వుత్సవము జరుగుతుంది కడప కర్నూలు చిత్తూరు జిల్లాల నుండి బక్తులు తండోపతండాలుగా వస్తారు కర్నాటక రాష్ట్రము నుండి కూడ బక్తులు వస్తారి స్వామిని సేవించ డానికి పూర్వపు ఆలయాలు



ఉత్తర వైపున నున్న రాజగోపురము

శిధిలముకాగా, తిరుమల తిరుపతి దేవస్థానము వారి దాతృత్వముతో, రాజ గోపురము, మూడు విమాన గోపురాలు పునర్నిర్మించినారు.

ఆలయములో పార్వతీ కళ్యాణ మండపము, దక్షయజ్ఞము, కైలాస మందిరము, కొలువు కూటము మొదలైన మండపాలు నిర్మించారు. ఆలయములో కేదారేశ్వరుడు అర్ధనారీశ్వరుడు వేరు వేరు ఆలయాల్లో వెలసి యున్నారు

ఈ ప్రాంతీయులు వివాహాది శుభకార్యాలు యిక్కడే జరుపు కుంటారు సంవత్సరములో యెక్కువ బాగము యేదో ఒక ప్రత్యేక కార్యక్రమము జరుగుతూనే వుంటుంది

నాటి నుండి నేటివరకు నాలుగు కుటుంబాల శైవాగమ అర్చకులు స్వామివారిని సేవిస్తున్నారు వీరు స్వామివారి మాన్యములో వ్యవసాయము చేసుకుంటూ స్వామి వారిని సేవిస్తూ వుంటారు స్వామి వారి పూజలు చేసుకుంటూ వ్యవసాయం ఉపవృత్తిగా జీవించే శైవార్చకులు ఆంధ్ర దేశములో అల్లాడుపల్లెలోని శ్రీ వీరబద్రస్వామి వారి ఆలయ మందుండడము విశేషము

ఈ అలయ మిప్పుడు దేవాదాయ దర్మాదాయ శాఖ వారి ఆదినములో వుంది ఆలయ కార్యక్రమాల పర్యవేక్షణకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ వారున్నారు వివాహాది శుబకార్యాలకు సత్రములు ఒక గ్రామీణ బ్యాంక్ వైద్యశాల లున్నాయి ప్రతి సోమవారం ప్రత్యేక పూజలు జరుగుతా యిక్కడ ఎంతో మంది ఎక్కడెక్కడనుండో వచ్చి స్వామి వారిని దర్శించుకొని పోతూ వుంటారి అల్లాడుపల్లె వీంబద్రుణ్ణి

— శ్రీమతి విజయలక్ష్మిరెడ్డి,

# చరమసంధ్య

## పైడిశ్రీ

యాభై రెండేళ్ల శరీరాన్ని బలవంతాన లాక్కుంటూ వస్తున్న పంచనాదం మేష్టారు అక్కడికి రాగానే మరింత నీరసపడిపోయేరు ఇంకో అరమైలు నడిస్తేగాని యిల్లు రాదు ఎప్పుడో ఉదయం భార్య వడ్డించిన మూడు యిడ్లీ ముక్కలు కాని కషాయం లాటి కాఫీ నీళ్లతో యింతసేపు జీవుణ్ణి నెట్టేడు

కాళ్లలో శక్తి సన్నగిల్లుతూ సన్నటి తిపులు నరాల్లోంచి ఉబుకుతోండగా పక్కనే వున్న పకోడీ బడ్డీ దగ్గరకు నడిచేయి వేడి వేడి పకోడీలు నోరూరిస్తున్నాయి అప్రయత్నంగా లాల్చీ జేబులోకి వెళ్లిన చేతికి కొన్ని చిల్లర నాణాలు తగిలేయి బైటికి తీసి లెక్కెట్టాడు

ఎనభై అయిదు పైసలు

అందులోంచి ఓ పావలా బిళ్ల తీసి జేబులో వేసుకుని మిగతా అరవై పైసలు బడ్డీ అతని చేతిలో పోసేడు వేడి వేడి పకోడీల పొట్లాం చేతిలోకొచ్చింది ఆ పక్కనే కాలవ వారగా వేసి వున్న బెంచి మీద ఓ ఎక్కి సర్దుకుని తాపీగా పకోడీలు నమిలేసిన తర్వాత చేతిలో మిగిలిన పొట్లం కాగితానికి చేతులు తుడుచుకుని పారెయ్యబోయి లిప్త పాటు ఆగేడు నొసలు దానంతట అదే ముడుచుకుంది కళ్లద్దాలు సర్దుకుని పరీక్షగా చూసేడు

అందులో అక్షరాలను పట్టి పట్టి చదివేడు సందేహంలేదు అవి తన పుస్తకంలోని అక్షరాలే తన కవిత్వాన్ని మెచ్చుకొంటూ రాష్ట్ర ఆస్థాన కవి రాసిన మాటలవి

తన కళ్లను తాను నమ్మలేనట్లు చుట్టూ చూశాడు ఎవరో కుర్రాడు పకోడీలు తింటున్నాడు

అతన్ని పిల్చి అతని చేతికి ఆ కాగితం యిచ్చి చదువు అన్నాడు మేష్టారు మేష్టారి మొహంలో ముసురుకున్న శ్రావణ జలధరాల్ని గమనించి ఆ గొంతుకలో పలికిన గీరను అర్ధం కాకపోయినా ఆ కుర్రాడు చదవడం మొదలెట్టాడు

కవిగారు యిందులో ఒకానొక చరమ సంధ్యను మన కళ్ల ముందుంచారు ఇది మానవుడి మస్తిష్కాన్ని కమ్మేసిన తమో పటలానికి చరమసంధ్య మానవ మనుగడలో చోటు చేసుకున్న కుల మతాల కుళ్ళు పోరాటాలకు ప్రాంతీయ తత్వాల పరవళ్లకి అధికార దాహాల అనంత యాత్రకి ఆధునికత పేరుతో మనిషి మనో గగనంలో ఉదయించిన అవినీతి సూర్యుడికి ఇది చరమసంధ్య

నేను నిస్సంకోచంగా చెబుతున్నాను దశాబ్దాల తరబడి సంకెళ్లలో చిక్కుకు పోయి చావు వేదన అనుభవిస్తున్న జీవ కవిత పంచనాదంగారి అక్షరాల్లో అపూర్వంగా వూపిరి పోసుకుంది

చాలు ! రుద్ధమైన కంఠంతో మెల్లగా అన్నాడు మేష్టారు చదవడం ఆపేసి ఆ కాగితాన్ని మేష్టారి చేతిలో పెట్టి ఆ కుర్రాడు మళ్ళీ పకోడీలు తినడంలో మునిగిపోయేడు

గుండె తుత్తునియలయి పోతోంది కందరాల్లోంచి అగ్ని పర్వతపు పొగలు స్రవిస్తున్నాయి కళ్లలోంచి లావా చిమ్ముతోంది నోరు తెరిస్తే దుఃఖం కట్టలు తెంచుకుంటుందేమోనని భయం వేసింది కళ్లలోంచి ఉబికే నీళ్లను కళ్లలోనే అదిమిపెడుతూ అతి కష్టంమీద అడిగేడు మేష్టారు బడ్డీ అతన్ని

నాయనా ఈ కాగితం నీకెక్కడిది?

ఎచ్చివాణ్ణి చూసినట్టు చూశాడు ఆ బడ్డీవాడు ఆయన్ని

ఏం? కావాలా పంతులూ కావలిస్తే పట్టుకుపో మధ్య నా వ్యాపారం చెడగొట్టడం ఎందుకు? అన్నాడు విసుగ్గా

అదికాదు ఈ కాగితం నీకెలా వచ్చింది

ఎవరో వేసిపోయారు తూకానికి

ఆ కాగితాలేవో ఒక్క మాటు చూపిస్తావా?

రేపొద్దున రా చూపిస్తాను వేళాకోళంగా అన్నాడు బడ్డీవాడు

కాదు నాయనా శ్రమనుకోకపోతే ఆ తూకానికి వేసిన పుస్తకాలేవో ఒక్కమాటు చూపించు

ఆహా అవతలి కెళ్లవయ్యా ఎంది నీ నస మొహమంతా చింగిలించుకుంటూ అరిచేడు బడ్డీవాడు అవతల వాడి బేరం చెడిపోతోంది మరి

నిశ్శబ్దంగా నిలబడి కాస్సేపు చూసేడు పంచనాదం

చరమసంధ్య కవితా సంపుటి చిత్ర విచిత్రంగా చింపివెయ్యబడింది ఒసారి సగం పేజీ ఒసారి పూర్తి పేజీ మరో సారి రెండు కాగితాలు పకోడీలు చకచకా అమ్ముడుపోతోంటే వాటిని పొట్లాలు కట్టడానికి ఆ కవిత్వం పుస్తకం తన శరీరాన్ని నలగ్గొట్టుకుంది

ఆ దృశ్యాన్ని చూస్తుంటే తన కన్నబిడ్డను తన కళ్ల ముందే నగ్నంగా నిలబెట్టి రాక్షసుడెవరో మానభంగం చేస్తున్నట్టుగా విలవిల్లాడిపోయేడు పంచనాదం మేష్టారు

అవును! ఆ పుస్తకం రాసింది ఆయనే

ఒక బిడ్డను ప్రసవించడానికి ఓ తల్లి ఎంత మథనం ఎంత నరకం అనుభవిస్తుందో ఎన్ని మధురోహలతో తన ప్రాణాన్ని పణంగా పెట్టి మరో జీవితానికి జీవం పోస్తుందో అంతకన్నా ఎక్కువ మథనం అనుభవించాడు అంతకన్నా మేలి మేలి మధురోహలతో మనస్సు నింపుకున్నాడు ఆనాడు

ఆ వ్రాత ప్రతిని అచ్చొత్తించడానికి ఎంత మదనపడ్డాం!

ఎన్ని అనుభవాల్ని ఎదుర్కొన్నాడు!

ఆలోచించుకుంటూ అక్కణ్ణుంచి కదిలేడు పంచనాదం మేష్టారు

పుస్తకం అచ్చొత్తించడానికి అకాడమి సహాయం అర్థించేడు ఉత్తరం ద్వారా జవాబు లేదు హైదరాబాదు వచ్చి ఆఫీసు చుట్టూ కుక్క తిరుగుళ్ళు తిరిగే ఓపికలేదు రికమండేషన్లు చేయడానికి తనకెవరూ లేరు అందుకే ఆ ఆశ వదులుకున్నాడు ఎవరో ఫలానా పబ్లిషర్ దగ్గరికి వెళ్ళమని ఓ ఉచిత సలహా పారేస్తే ఆ పబ్లిషర్ దగ్గరకెళ్లాడు

ఇప్పుడు కవిత్వాన్ని అచ్చెయ్యట్లేదు పంతులూ ఓపికుంటే కాస్తంత సైన్సు ఫిక్షన్ క్షుద్రం చిటికెడంత సెక్సు మిళాయించి ఓ నవల రాయి పదో పరకో యిచ్చుకుంటాను అన్నాడు పబ్లిషరు

పంచనాదంగారు మ్రాన్పడిపోయేరు

ఏం బాబూ కవిత్వం అంత చేదయిందా మీకూ?

చేదూ కాదు విషంకాదూ మీ బోటి రాతలోళ్లు రాసింది అచ్చేసి నాలుగు రాళ్లు సంపాదించాలని ప్రారంభించిన బిజినెస్సిది అదుగో ఆ రేక్‌లో చూడండి తెలుగు కవితా చరిత్రలో ఉద్దండ పిండాల్లాంటి కవులు రాసిన పుస్తకాలు ప్రస్తుతం వాటికి పట్టిన బూజుకూడా దులిపే ఓపిక లేదు మాకు ఇలా చూడండి యీ గుట్టకేసి ఇప్పటి నవలలు పొద్దున పేర్చిన గుట్ట యిప్పటికి సగం అయిపోయింది సాయంత్రం కొట్టు కట్టేసేసరికి ఆ కాస్తా అయిపోతుంది ఓపికుంటే ఏదన్నా నవల రాయి

నా వల్ల కాదు

పోనీ సెక్సు పుస్తకాలయినా రాయి

శివ శివా అనుకుంటూ చెవులు మూసుకున్నాడు పంచనాదం మేష్టారు

అక్కణ్ణుంచి వస్తూ వస్తూ బూజుపట్టి వున్న కవిత్వం పుస్తకాల రేక్‌కేసి చూసేడు

కాటుక కంటి నీరు చను కట్టు పయిం పద్యం గుర్తొచ్చింది

ఇంటికొచ్చేడు ఆ సంగతి తనని కలిసిన ప్రతి సాహితీప్రియుడికి చెబుతూ వచ్చేడు వాళ్లలో ఒకాయన ముందుకొచ్చాడు

నేన్ని పుస్తకం అచ్చేయిస్తా పంతులూ అయితే చిన్న షరతు దాన్ని చచ్చిపోయిన మా

ముత్తాతకి అంకితం యివ్వాలి పుస్తకం మీద హక్కులన్నీ నాకేయిచ్చేయాలి అన్నాడు

దానిమీద డబ్బు సంపాదించాలన్న తపన లేదు నాకు అది అచ్చయి పదిమంది ముందూ నిలవాలన్నదే నా కోరిక అని వ్రాత ప్రతి అతని చేతిలో పెట్టేడు రెండు నెలలకల్లా చరమసంధ్య

అందంగా ముస్తాబయింది

ఆవిష్కరణ మహోత్సవం

స్థానికులు ప్రక్క ఊళ్లలో వున్న రసపిపాసులు ఎందరో వచ్చారు అప్పటి ఆస్థాన కవి ఆనాటి సభకు అధ్యక్షతవహించారు ఎందరో కవులు విమర్శకులు ప్రశంసించారు విమర్శించారు పుస్తకంలోని ఒక్కో పంక్తిని తీసుకుని ఒక్కొక్కళ్ళు అర్ధ గంటసేపు మాట్లాడారు

తెలుగు కవిత్వపు పోకడ మీ చేతి వేళ్లలో మరో మలుపు తిరిగింది మేస్టారూ అన్నారు

తెలుగు కవిత్వానికి మరో పట్టుగొమ్మ దొరికింది

అన్నారు

ఇంకా రకరకాలుగా తనని పొగిడారు తన కవిత్వాన్ని తన ఎదుటే పాడి వినిపించారు

ఆనాటి సంతోషాన్ని భరించలేక గుండెలు అల్లల్లాడాయి

తన కవిత్వానికి ఎలాంటి అవార్డులు పురస్కారాలురాకపోయినానూటికి పధ్ధిమందయినా చదివితే చాలనుకున్నాడు కనీసం చదివినా చదవకపోయినా తమ తమ పుస్తకాల వరుసల్లో ఈ పుస్తకాన్ని కూడా గౌరవిస్తారని తలపోశాడు

తన తలపోత తప్పు

ఏ మహానుభావుడో తన పుస్తకాన్ని ఓ పకోడీ కొట్లో తూకానికి వేసి దానికి తాను అనుకోనంత గౌరవాన్ని ఆపాదించేడు ఆ మహానుభావుడు కనిపిస్తే

ఏం నాయనా ఆ బడ్డీవాడిచ్చే అర్ధణా బేడకి ఎరచేయడానికి నా కవిత్వమే దొరికిందా అని నిలదీయాలని వుంది కానీ తను నిల్చోడానికి సభ్య ప్రపంచంలో చోటులేదు మరొకణ్ని పట్టుకు నిలదీయడమా?

ఆలోచనల్లోనే ఇంటికి చేరుకున్నాడు పంచనాదంగారు పకోడీ పొట్లం కాగితం చేతిలో అలానే ఉంది

ఆ చెయ్యి వణుకుతూ ఉంది

ఏమిటి దిగాలుగా ఉన్నారు రాగానే అడిగింది భారతమ్మ మౌనంగా గోడకేసి చూస్తుండిపోయేరు మేస్టారు

ఏమయిందంటే ఏమి చెప్పరే!

చేతిలో కాగితం మరోసారి చూసుకున్నాడు కొత్తగా

ఇంట్లో యింతమంది వుండగా తమరొక్కరే కూర్చుని మిఠాయి బూంది బొక్కి వస్తున్నారా? పైగా ఆ కాగితాన్ని కూడా ప్రత్యేకంగా చూపిస్తూ ఎమిటి మీ వేళాకోళం ఎప్పటి మాదిరే తన గడుసుదనం ప్రదర్శించిందామె

భారతీ! రుద్ధ కంఠంతో పిల్చేడు మేస్టారు సామాన్ల గదిలో అటక మీద అట్ట పెట్టె వుంది దాన్ని కాస్త క్రిందికి దింపు

ఉలిక్కిపడింది భారతమ్మ

ఎందుకు?

అందులో నా చరమసంధ్య పుస్తకం వుంది దాన్నోసారి చూడాలి

ఇప్పుడే చూడాలా?

ఏం అలా అడుగుతున్నావ్

ఏంలేదు ఊరికేనే

ఏ అట్టపెట్టె తాతయ్యా అంటూ వచ్చేడు మాస్టారి మనవడు

వివరంగా చెప్పేడాయన

అదా అది నిన్న నేను తసుకెళ్లి తూకానికి అమ్మేసుకు వచ్చానుగా ఇంకెక్కడుంది!

ఆ మాట వినగానే మాస్టారి గుండెలు క్రషర్‌లో పడ్డట్లు విలవిలలాడేయి ఒక్క వూపున కుర్చీలోంచి లేచాడు

ఏమిట్రా నువ్వు చెప్పేది అంటూ గుడ్లురిమేడు

అదే ఆ పుస్తకాలున్న అట్టపెట్టె గురించే

ఏం భారతీ నిజమేనా వీడు చెప్పేది?

అవునన్నట్లు తల వూపిందామె బెరుగ్గా

అంతటి దిక్కుమాలిన అవసరమేమొచ్చింది దాదాపు అరిచేడాయన అదుపు తప్పిన కోపంతో

వచ్చిన కాసిని డబ్బులు అప్పులవాళ్ల మొహానపోసేశాం ఏనాటికా నాడు ఎగదుడుపు దిగదుడుపు అన్నట్లయింది సంసారం

ఉపోద్ఘాతాలు అక్కర్లేదు అసలు విషయం

ఏడువ్?

నిన్న సాయంత్రానికి బియ్యం లేకపోతే వృధాగా అటకమీద పడున్నదేగా అని ఆ పుస్తకాలను నేనే తూకానికి అమ్ముకురమ్మని చెప్పాను పొద్దున మీ జేబులో ఖర్చులకిచ్చింది ఆ డబ్బులే

ఆ మాటలు పిడుగుల్లా ఆయన చెవుల్లో దూరి ఒక్కో జీవాణువుని వెదికి మరీ కుళ్లబొడిచేస్తోంటే నిస్సత్తువుగా నిస్తేజంగా నిర్జీవుడిలా కుర్చీలో కూలబడిపోయేరు పంచనాదం మేస్టారు

ఆటవెలదులు తేటగీతులు ఉత్పలమాలలు చంపకమాలలు పేర్చి కవిత్వానికి కాలం కట్టిన పాడెమీద కాటికేసి తరలిపోతోంది ఓ కిరణం

శార్దూలాలు మత్తేభాలు దాని వెంట గుండెలు చరుచుకుంటూ అరుచుకుంటూ అంగలార్చుకుంటూ !



# వ్యక్తిగతం



శ్రీ ఆర్ వి ఎస్ పెరిశాస్త్రి జనవరి 1వ తేదీన భారత ప్రధాన ఎన్నికల కమిషనర్గా పదవీ బాధ్యతలని స్వీకరించారు ఇంతకు పూర్వం ఈయన కేంద్ర న్యాయ మంత్రిత్వ శాఖలో శాసన సంబంధమైన వ్యవహారాల కార్యదర్శిగా ఉన్నారు భారత దేశంలోని ప్రస్తుత ఎన్నికల విధానం పట్ల ఆయన అచంచల మైన విశ్వాసాన్ని వ్యక్తం చేసారు ఎన్నికల వ్యవస్థ సామర్థ్యాన్ని నిష్పాక్షిక మైన విధి నిర్వహణని 1977 1980 సంవత్సరాలలో జరిగిన ఎన్నికలు నిరూపించాయని ఆయన అన్నారు ఎన్నికల సంస్కరణలు నియోజక వర్గాల పునర్ వ్యవస్థీకరణ ఎన్నికల ఖర్చు అభ్యర్థులు కాక ప్రభుత్వం భరించడం మొదలైన విషయాలని వివరిస్తూ ఎన్నికలలో అక్రమాలని తొలగించి వ్యవస్థని మరింత పటిష్టం చెయాల్సిన అవసరం ఎంతైనా ఉన్నదని నియోజక వర్గాల పరిమితి వోటర్ల సంఖ్య సమతూకంగా లేవని లోకసభ నియోజక వర్గాలు కొన్నిటిలో ఒక దానిలో 3 లేదా 4 లక్షల వోటర్లు ఉంటే మరి కొన్నిటిలో ఒక్కొక్క దానిలో 10 లక్షలు అంతకు మించి వోటర్లు ఉన్నారని ఆయన చెప్పారు ఇలాంటి వ్యత్యాసాలని సరిదిద్దటానికి 2000 సంవత్సరం దాకా జనాభా లెక్కల సేకరణ జరగదు కాబట్టి రాజ్యాంగంలో కొన్ని మార్పులు చేయ వలసి ఉంటుందని ఆయన అన్నారు లోకసభలో ఉన్న మొత్తం సీట్ల సంఖ్య మార్చకుండానే నియోజక వర్గాల పునర్వ్యవస్థీకరణ సాధించ వచ్చని ఆయన పేర్కొన్నారు ఎన్నికల సంస్కరణ లన్నవి కాలానుగుణంగా నిరంతరం జరుగుతూనే ఉండాలన్నారాయన ఎన్నికలలో అభ్యర్థుల ఖర్చుని ప్రభుత్వం భరించటం అన్నది చాలా జాగ్రత్తగా ఆలోచించి తీసుకోవలసిన నిర యం అనీ ప్రజాధనం దుర్వినియోగం కాకూడదని ఆయన అభిప్రాయ పడ్డారు పార్టీ మార్పిడి నిషేధ చట్టానికి తోడు మన రాజకీయ వ్యవస్థని క్షాళన చెయ్యడానికి మరెన్నో చర్యలు తీసుకోవలసి ఉందని జరగ వలసినది ఇంకా ఎంతో ఉన్నదని ఆయన అన్నారు ఎలక్ట్రానిక్ వోటింగ్ పద్ధతిని సమర్థిస్తూ ఎన్నో అభివృద్ధి చెందిన దేశాలలో ఈ పద్ధతి ప్రవేశ పెట్ట బడిందని మన దేశంలో అది విజయవంతం కాకపోవటానికి కారణం ఏమి కనిపించటం లేదని ఆయన అన్నారు □

# వారఫలం

## 31-1-1986 శుక్రవారం మొదలు 6-2-1986 గురువారం వరకు

★ **మేషం** అనవసరపు ప్రయాణాలుంటాయేమో! గ్రహించండి అధికారులు ధనవంతుల పరిచయం ఏర్పడుతుంది మీ రాశికి గ్రహబలం చెప్పదగినంత గలదు అందుచేత వ్యాపార విస్తరణకు యత్నించండి స్త్రీలకు కుటుంబ వ్యవహారాలతో సతమతం కావలసిన సమయం

★ **వృషభం.** గుర్తించండి నాలుగు విధాలా ధనాదాయం నలుగురిలో పేరుప్రతిష్ఠలు చేకూరటం వస్తు వాహన సేకరణకు అనుకూలం మీ అభిమతం వ్యాపార వ్యవహార రంగాలలో నెరవేరుట నిశ్చయం కృషి లోపం చేయక ప్రాకులాడండి స్త్రీలకు కృషియందు లోపం లేకుండా ఉద్యోగంలో సంఘంలో బాగా పుంజుకొంటారు

★ **మిధునం** నూతన వ్యవహారాలందుగాని క్రితం మీరు జరిపే వ్యాపారమందుగాని జాయింటు వ్యాపార రంగాన గాని ఒక మెట్టు పైకెక్కగలరు ధర్మ కార్యాచరణమందు కూడ మీ ప్రజ్ఞ వికసిస్తుంది మీకు ఏనాడో చేరవలసిన ద్రవ్యం ఈ వారమైనా అందుతుంది స్త్రీలకు రచనా విధానాన ఆదాయం ఆనందం చేకూరుతుంది

★ **కర్కాటకం** వృత్తియందు పెంపు కనిపించటం ఒకానొక వ్యవహారానఉత్సాహం అతిశయించి దానిని ఒక మార్గాన పరిష్కరించుకోటం సాధ్యం కాగలదు ఎవరేమనుకున్నా మీరు గావించే శుభ కార్య యత్నం పరిష్కరింపబడగలదు స్త్రీలకు ఆదాయానికి గాని ఆనందానికి గాని లోపంలేదు

★ **సింహం.** ఉత్సాహజనకమైన వారం అయితేనేం? ఆరోగరీత్యా పరుల కివ్వవలసిన ధన విషయంలో జాగ్రత్తపడవలసిన బాధ్యత ఉన్నది దూరపు ప్రయాణాలందు నిమగ్నులు కాగలరు ఏనాడో యత్నించిన వాహనం ఈ వారం అందటం కొందరకు ఉత్సాహజనకంగా ఉండటం స్త్రీలకు ఆదాయం వృత్తియందు అభివృద్ధి

★ **కన్య.** వారమంతా సర్వోత్తమంగా ఉంటుంది అంటే ధనధాన్య సంపదయుందని భావం రాశికి సర్వానుకూలమైన గ్రహ సంపద గలదని గుర్తించాలి కొందరు వెనుక చేసిన యత్నాలు ముఖ్యంగా శుభకార్య విషయాలందు సానుకూలం కాగలవు స్త్రీలకు లలిత కళా ప్రావీణ్యం భాసిస్తుంది వైద్య వృత్తియందున్న వారికి మేలైన వారం

★ **తుల** ఎంత ప్రోత్సాహకరంగా ఉన్నా ఎంత ఆదాయమున్నా సులభంగా పనులు నెరవేరుతున్నా ఏదో ఇబ్బంది కనిపిస్తూనే ఉంటుంది ఏదో విధంగా మనస్పర్థలు రానే వస్తాయి పరుల వలన నిష్ఠూరాలు తప్పవు స్త్రీలకు ఏమంత సుకరమైన వారం కాదు ఆదాయ లోపం

★ **వృశ్చికం** ఏనాడో చేసిన అవివేక కార్యఫలం ఈ వారం అనుభవించవలసి రావచ్చు ఏనాడో యివ్వవలసిన డబ్బును గూర్చి వత్తిడి ఈనాడు వెంటబడవచ్చు వ్యాపారంలో కూడ లోపం కనిపిస్తుంది స్త్రీలకు అలా యిలా తిరగడంతో కుటుంబ బాధ్యతలతో కాలం వ్యయమవుతుంది మనశ్శాంతి లోపిస్తుంది గమనించాలి

★ **ధనుస్సు** మీరు ఆశించిన విధంగా ఆదాయం అంది పుచ్చుకొన్నట్లు లభ్యం కాగలదు కాని ప్రయోజనం? అంతకు అంత వ్యయం ఒకవేళ అది శుభ వ్యయమే కావచ్చు గ్రహించండి నూతన మిత్రులతో లేనిపోని యిబ్బందులకు గురికావలసిన అగత్యం కూడా ఏర్పడుతుంది గ్రహించండి స్త్రీలకు అన్ని విధాలా అనుకూల సమయం అన్ని విధాలా మేలే

★ **మకరం** కొందరకు నూతన వృత్తిని చేపట్టగల అవసరం ఏర్పడనున్నది కొందరు వెనుక గావించిన పనుల గూర్చి పశ్చాత్తాపపడవలసి రావచ్చు పశ్చాత్తాపమే పాపక్షాళనకు చిహ్నం ఈ వారం ఎంతో అవశ్యమయితేనే తప్ప ప్రయాణించటం న్యాయంకాదు ప్రమాద సూచక వారం స్త్రీలకు యత్న కార్యసిద్ధి

★ **కుంభం** చాలామందికి వ్యాపార వ్యవహారాలందు బాగా ప్రయోజనకరమైన సమయం వారమంతా ఏదో పనుల వత్తిడి వలన హడావుడిగా వుండటం జరుగుతుంది విలువగల వస్తువులు సేకరించుకోగలుగుతారు ఏమైనా మీరు నెమ్మదిగా ఉండాలంటే మీ పనులు నెరవేరాలంటే స్తోత్ర పారకులను రానీయకండి స్త్రీలకు ఉద్యోగరీత్యా మేలైన వారం

★ **మీనం** మిత్ర వర్గంతో పరిచితులతో మీకు పేరు పెంపులందు లోపం ఏర్పడవచ్చు కొందరకు వ్యర్థ ప్రయాణాలుండవచ్చు కొందరకు చేసిన పనినే మరలా చేయవలసి రావచ్చు ఇంతకాలం ఆదరించినవారు దూరం కావటం గ్రహిస్తారు స్త్రీలకు మనశ్శాంతి లోపం వృత్తియందు సంకటం ఏర్పడగల వారం గ్రహిస్తారుగా!

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# అప్పిచ్చువాడు

శ్రీ కంఠస్ఫూర్తి



"ఏవండీ' మిమ్మల్నే'మీకోసం ఎవరో వచ్చారు' విజయ గుమ్మందగ్గర నిలబడి కేక వేసింది ఏదో రాస్తూ కూర్చున్న రవీంద్ర కాగితాలు కలం ప్రక్కన బెట్టి లుంగి సర్దుకుంటూ వరండాలోకి వచ్చాడు ఎదురుగా ఇంటి ముందు నిలబడ్డ కోటిలింగం' రవీంద్ర ఆశ్చర్యంగా రండి' రండి' కూర్చోండి అంటూ ఆహ్వానించాడు తను ఒక కుర్చీలో కూర్చుని మరో కుర్చీ కోటిలింగానికి చూపించాడు కోటిలింగం నెమ్మదిగా అడుగులు వేస్తూ మెట్లెక్కి వచ్చి కుర్చీలో ఒద్దికగా కూర్చున్నాడు జేబులోంచి మాసిపోయిన జేబు రుమాలు తీసుకుని ముఖానికి పట్టిన చెమటను చాలా సేపు తుడుచు కున్నాడు ఒక మారు పరిసరాలు పరిశీలనగా చూశాడు కోటిలింగం బట్టలు కూడా మాసిపోయి ఉన్నాయి తలకు నూనె లేదు తొడుక్కున్న చొక్కాకు రెండు చిరుగులున్నాయి పంట్లాం చివరి బాగం పేలికలై పేరుకు పోయిన దుమ్ముతో అసహ్యంగా ఉంది చెప్పులు జీర్ణదశలో పాదాల్ని వ్రేలాడుతున్నాయి

మంచినీళ్లు తీసుకుంటారా' రవీంద్ర మర్యాదగా అడిగాడు

ఇప్పించండి' రవీంద్ర బార్యను కేక వేశాడు విజయగ్లాసుతో మంచినీళ్లు తెచ్చి స్టూలు మీద పెట్టింది కోటిలింగం మంచినీళ్లు గడగడా త్రాగాడు

చెప్పండి' ఏవిటి విశేషం' ప్రసన్నంగా అడిగాడు రవీంద్ర

అబ్బే' ఏమీలేదు మీతో చిన్న పనుండి వచ్చాను' కోటలింగం నసుగుతున్నట్టుగా



అన్నాడు కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు

చెప్పండి! మరేం పరవాలేదు!

మీరు కాదన కూడదు మీమీద ఎంతో ఆశపెట్టుకుని వచ్చాను!

విషయం ఏమిటో చెప్పకుండా ఆశపెట్టుకుని వచ్చానంటే ఎలా? చెప్పండి! రవీంద్ర సాలోచనగా అన్నాడు

మరేం లేదు మా ఆవిడ పిల్లలతో పుట్టింట నుంచి ఇప్పుడే వచ్చింది ఇంట్లో సరుకులు ఏమీలేవు బియ్యం కూడా తెచ్చుకోవాలి నెలాఖరున జీతం తీసుకోగానే తిరిగి మరిచిపోకుండా మీ కిచ్చేస్తాను ఓ ఏభై రూపాయలుంటే అప్పుగా ఇవ్వండి! కోటిలింగం చాలా సిగ్గుపడుతూ గొంతుకలో ఎక్కడ లేని దీనత్వాన్ని పలికించాడు రవీంద్ర మాట్లాడలేదు కొద్ది నిముషాలు ఆలోచిస్తూ ఉండిపోయాడు కోటిలింగం జీవితం అతని మస్తిష్కంలో మెదిలింది అతని భార్య ఎల్లలు గురించి తెలిసిన విషయాలు వెంటనే స్ఫురణ కొచ్చాయి మనసు బాధగా మూల్గింది

సారీ కోటిలింగంగారూ! మీ కప్పుడు నేనేమి సహాయం చెయ్యలేను! రవీంద్ర నొచ్చుకుంటూ అన్నాడు

అలా అనకండి! ముందే చెప్పాను మీకు మీమీద చాలా ఆశపెట్టుకుని వచ్చానని! ఎలాగోలా చూడాలి! కోటిలింగం మరింత ప్రాధేయపడ్డాడు

నిజమే! కాని నాకూ నెలాఖరు రోజులుకదా! పై ఖర్చుకు ఇంట్లో మేమే చాలా ఇబ్బందులు పడుతున్నాం!

ఏవో ఇబ్బందులు అంటూ అందరికీ ఉంటాయి నా పరిస్థితి మీకు తెలుసు మా ఆవిడ సంగతి మీకు తెలియనిదికాదు ఈ పూట బియ్యం తీసికెళ్ళక పోతే నన్ను చీకొడుతుంది చీత్కరిస్తుంది బయటకు పొమ్మంటుంది నోటి కొచ్చిన తిట్లన్నీ తిడుతుంది జీతం అంతా ఎక్కడ తగలేశావంటూ నానా గోల

# అప్పిచ్చువాడు

చేస్తుంది మళ్ళీ పుట్టింటికి పోతానంటుంది అది పుట్టింటికి పోతే నా బ్రతుకు వీదిన పడుతుంది నలుగురిలో తలెత్తుకు తిరగలేను మీరెలాగైనా సరే నా అవసరం తీర్చాలి! కనీసం ఓ పాతిక రూపాయిలయినా ఇప్పించాలి! కోటిలింగం కళ్ళ నీళ్ల పర్యంతం మనిషి నిలువునా చలించి పోతూ ఏడుస్తున్నట్టే అన్నాడు

మీరు మరోలా అనుకోవద్దు నిజంగా ప్రస్తుతం నాదగ్గర డబ్బులు లేవు పాతిక రూపాయలు కాదు కదా! పాతిక పైసలు కూడా ఇవ్వలేను మరోచోట ప్రయత్నం చెయ్యండి! రవీంద్ర ఖచ్చితంగా చెప్పేశాడు

ఊళ్ళో చాలామందిని అడిగాను ఎవ్వరూ ఇవ్వలేదు మీరు కనికరించాలి మీ ఆవిడగారినైనా అడిగి నా అవసరం గట్టెక్కించాలి మీ చేతులే కాదు కాళ్ళూ పట్టుకుంటాను! కోటలింగం రవీంద్ర దగ్గరగా వచ్చి కాళ్ళ మీద చేయి వేయబోయాడు రవీంద్ర గబుక్కున తప్పించుకుని కుర్చీలోంచి లేచాడు

మీ చేత ఇంతగా ఇన్నిసార్లు అడిగించుకొను నాదగ్గరుంటే మొదటనే ఇచ్చి ఉండేవాణ్ణి! మీకివ్వలేక పోతున్నందుకు నాకు చాలా బాధగా ఉంది ఓ పనిచెయ్యండి! మీ ఆవిడగారు ఇప్పుడే పిల్లలతో వచ్చారంటున్నారుకదా! ఆవిడ ఈపూటకి ఏదో ఏర్పాటు చేసుకుంటారులెండి! ఆ మాత్రం ఇరుగు పొరుగు సాయపడకపోరు ఆవిడ గురించి మీరు భయపడకండి! చాలా దూరం నుంచి ఎండన పడి వచ్చారు వంటయిపోయింది మీరు భోజనం చేసి వెళ్ళండి! సాయంకాలానికి మరో ప్రయత్నం ఏదో చేద్దురుగాని! రవీంద్ర కోటిలింగాన్ని కుర్చీలో కూర్చో బెట్టాడు

భోజనమా! అబ్బెబ్బే! వద్దండి! పిల్లలూ ఆవిడ నాకోసం ఎదురు చూస్తుంటారు! నేను వస్తానండి? మరో చోట ప్రయత్నం చేయాలి!

కోటిలింగం నీరసంగా కుర్చీలోంచి లేచాడు రవీంద్రకు అతడ్ని చూస్తే అమితమైన జాలి వేసింది హృదయం ద్రవించిపోయింది

మీకు కావలసింది ఏభైరూపాయల అప్పేకదా! సాయంకాలానికి ఏదో ప్రయత్నం చేద్దాం! మీరు బెంగెట్టుకోకండి! భోజనం చేసి వెళ్ళండి!

రవీంద్ర మనసులో ఏమనుకున్నాడో ఏమో కోటిలింగానికి భరోసా ఇచ్చాడు

ఒక్క షరతు! సాయం కాలానికైనా మీరు నాకు తప్పకుండా అప్పు ఇప్పిస్తానంటే ఈ పూట మీ యింట్లో భోజనం చేస్తాను! కోటిలింగం బయటికి వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతూ అన్నాడు

అలాగే సాయంకాలం ఎవరో ఒకర్నడిగి మీకు ఏభై రూపాయలు అప్పు ఇప్పిస్తాను! ముందు భోజనం చెయ్యండి! రవీంద్ర కోటిలింగం చెయ్యి పట్టుకుని బ్రతిమాలి కుర్చీలో కూర్చో బెట్టాడు విజయా అంటూ వంటింటి వైపు కేక వేశాడు భార్య విజయ వంట గదిలోంచి బయటకొచ్చి నిలబడింది

కోటిలింగం గారికి భోజనం వడ్డించు! రవీంద్ర భార్య వైపు చూస్తూ అన్నాడు విజయ లోపలికి వెళ్ళిపోయింది వెంటనే వరండాలో పీట వేసి నీళ్ళు పెట్టింది విస్తరి పరచి భోజనం వడ్డించింది కోటిలింగం కాళ్ళు కడుక్కుని వచ్చి పీట మీద కూర్చున్నాడు ఆకలిమీద ఉన్నాడేమో అన్నం కలుపుకుని ఆవురావురు మంటూ తినసాగాడు విజయ ఇంత సేపూ వీళ్ళ మాటలు లోపల్నుంచి వింటూనే ఉంది కోటిలింగం భార్య ఎంత గయ్యాళో అనుకుంటూ మనసులో మథనపడ సాగింది అతను అన్నం తినడం చూస్తే ఆమె హృదయం ఆర్ద్రమైంది

అప్పుకోసం వచ్చిన వాడికి అన్నం పెట్టి పంపిస్తున్నారు! కోటిలింగం అన్నాడు

అప్పు ఇచ్చే పరిస్థితిలో లేము ఏదో సమయానికి వంటయ్యింది పైగా రెండు మూడు మైళ్ళు నడిచొచ్చారు కనీసం భోజనం చేసి వెళ్తే మాకు తృప్తి! రవీంద్ర జవాబు చెప్పాడు

కోటిలింగం భోజనం పూర్తి చేశాడు అప్పుదొరక్క పోయినా ఆకలి తీరింది అతని మనస్సు స్థిమితపడింది

నేను వెళ్ళొస్తానండి! మరోలా అనుకోవద్దు సాయంకాలం మీరు నాకు ఏభైరూపాయలు అప్పు ఎలాగైనా ఇప్పించాలి! నేనిక ఎవ్వర్నీ అడగను అడిగినా నాకు ఇచ్చేవాళ్ళు ఎవ్వరూ లేరు! కోటిలింగం చెప్పులు తొడుక్కుని చేతులు జోడించి బయటకు నడుస్తూ అన్నాడు

సరేనండి! సాయంకాలం అయిదు గంటలకల్లా మన యూనియన్ ఆఫీసు దగ్గర కూర్చోండి! నేను వచ్చి ఏదో ప్రయత్నం చేస్తాను! రవీంద్ర అభయమిస్తున్నట్టుగా అన్నాడు కోటిలింగం వెళ్ళిపోయాడు విజయ విసురుగా వచ్చి భర్త ముందు నిలబడింది

ఏమండీ! అతనంతగా ప్రాధేయపడ్డాడు కళ్ళ



నీళ్ళు పెట్టుకున్నాడు కాళ్ళు పట్టుకో బోయాడు మి మనసు కరగతేదా' ఈమధ్య మిరు ఇలా తయారవుతున్నారేమిటి? నేను కలగజేసుకోవడం ఎందుకులే అని ఊరుకున్నాను మి దగ్గర డబ్బులున్నాయిగా ఓ యాభై రూపాయలు ఇవ్వలేక పోయారా? విజయ కోపంగా అడిగింది

అతనిక అప్పు ఇవ్వకూడదు రవీంద్ర గదిలోకి వెళ్ళి పోయాడు

ఎం? ఎందుకవ్వకూడదు అతను మి ఆపీసులో నివాడేగా' అప్పుడెప్పుడో పాపపుట్టిన రోజుకి మనింటికి టీ పార్టీకి వచ్చాడు' భర్త వెంట లోపలికి నడుస్తూ అంది విజయ

అదంతే' అతనికి అప్పుగా ఎభైరూపాయలు మనమిస్తే ఆ ఎభై రూపాయలు మరొకళ్ళక అప్పుగా ఇచ్చేసాడు అది అతని అలవాటు'

నిజమే'

నిజంగాక అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకేమిటి? వచ్చిన జీతంలో మూడొంతులకు పైగా వడ్డీకి అప్పులిచ్చేయడం కోటిలింగం చేసేపని ఆ వడ్డీ వెనకేయడం మళ్ళీ మరొకళ్ళకి అప్పులివ్వడం

ఒకళ్ళ దగ్గర పుచ్చుకోవడం మరొకళ్ళకి ఇవ్వడం తన దగ్గర లేక పోయినా ఒకరి దగ్గర తక్కువ వడ్డీకి అప్పుతెచ్చి ఎక్కువ వడ్డీకి మరొకళ్ళకి అప్పుఇవ్వడం' పైసాఖర్చు పెట్టడు పది పైసలు పెట్టీ టీత్రాగడు ఇంట్లో పెళ్ళాం ఒకే చీరతో చిరుగుల జాకెట్టుతో కాలం గడుపుతుంది పిల్లలు నలుగురూ దరిద్రానికి చిహ్నాలుగా దర్శన మిస్తారు' సరియైన తిండి పోషణ ఉండదు ఆవిడ నెత్తీ నోరూ బాదుకుంటూ ఉంటుంది ఇతను కూడా ముష్టివాడికంటే అన్యాయంగా ఆపీసుకొస్తాడు ఎప్పుడూ డబ్బు గురించే ఆలోచన ఎవరికి అప్పివ్వాలని ఎవరినుంచి వడ్డీ రాబట్టుకోవాలని నిరంతరం ఒకటే తాపత్రయం' మరో ఆలోచన ఉండదు వడ్డీలకు అప్పులివ్వడమే అతనికి పెద్ద వ్యసనం'

అయ్యో పాపం ఆవిడ పిల్లలతో ఎలా నెట్టుకొస్తోందో సంసారం ? విజయ సానుభూతిగా తలచుకుంటూ ఉండిపోయింది

నేను నీతో ఇప్పుడు చెప్పిందంతా ఆర్నెల్ల క్రితం వరకూ జరిగిన సంగతి' నెట్టుకు రావడానికి ఆవిడ ఇప్పుడు ఉంటేగా' కొన్ని సంవత్సరాలు కోటిలింగంతో దరిద్రం అనుభవించి విసిగి వేసారిపోయి ఇతగాడ్ని వదిలేసి పిల్లలతో పుట్టింటికి వెళ్ళి పోయింది

మరితను తన భార్య పుట్టింటి నుంచి వచ్చిందన్నాడుగా' ఇంతకుముందు–

అదంతా అతని భ్రమ' భార్య పుట్టింటి నుంచి వచ్చిందనుకుంటూ తనలో తాను తరచూ పలవరిస్తుంటాడు అసలు అతను మనలో కంటో ఉంటేగా?

అదేమిటి? విజయ అయోమయంగా నోరు తెరిచింది

కోటిలింగం దగ్గర అప్పులు తీసుకున్న వాళ్ళు ఇతని అలుసు తీసుకుని చాలామంది ఎగ్గొట్టారు ఆఫీసులో పనిలో సామర్థ్యం లేదంటూ అంచెలు అంచెలుగా సస్పెండు చేసుకుంటూ వచ్చారు తిండి మాని ఎల ఏ పెళ్ళాన్ని పరిశ్రం పాలు చేసి ఇంట్లో కూడ బెట్టిన డబ్బంతా ఒక రాత్రి ఎవడో జాగ్రత్తగా కనిపెట్టి కాజేశాడు పెళ్ళాం ఛీత్కరించి పిల్లలతో పుట్టింటికి పోయింది ఇప్పుడు కోటిలింగం అప్పిచ్చు వాడుకాదు అప్పు పిచ్చివాడు' మతిపోయి అలారోడ్లంట తిరుగుతుంటాడు కనిపించిన వాళ్ళందరినీ అప్పులడుగుతాడు చేతిలో ఎవరైనా పది పైసలు పడేస్తే ఆ పది పైసలు ఎవరికైనా అప్పు కావాలా అంటూ అరుస్తూ పరుగెడుతుంటాడు !

విజయ అచేతనంగా నిలబడి పోయింది ఆమెకళ్ళలో కోటిలింగం రూపమే కదులుతోంది ఎంతో దీనంగా హీనంగా కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ పెళ్ళాన్ని తలచుకుంటూ అప్పు కావాలని ప్రాదేయపడ్డ కోటిలింగం ఒకప్పుడు పది మందికి అప్పులిచ్చే వాడా? డబ్బు పిచ్చిలో పడి తన పచ్చని బ్రతుకును సంసారాన్ని పాడు చేసుకున్న కోటిలింగం ఇప్పుడు పిచ్చివాడా' డబ్బుమీద మితి మీరిన ఆశ మనిషిని ఇంత పిచ్చివాడ్ని చేస్తుందా? వ్యసనంలా మనిషిని అంటి పెట్టుకుని పతనం చేస్తుందా? పరిస్థితుల్ని తారుమారు చేస్తుందా?

విజయ నమ్మలేక పోతోంది ఆమె మనసును సరిపెట్టుకోలేక – పోతోంది

అందుకే విజయా' అతని మిద ఉన్న జాలితో నే భోజనం చేయమని పట్టు బట్టాను రవీంద్ర ఆలోచిస్తూ అన్నాడు

పోనీ లెండి' ఆ అప్పు మిషతో నైనా ఈ పూట కడుపునిండా అన్నం తిన్నాడు అదే మహా తృప్తి' ఆ పిచ్చివాడిని తలచుకుంటూ వంటగదిలోకి నడిచింది విజయ □

# సినిమా

"సూర్యోదయం"లో కమలహాసన్ , అంబిక





## బి. వి. ప్రసాద్ దర్శకత్వంలో జయ పిక్చర్స్ చిత్రం

ఏవరి ఫిబ్రవరి మార్చి నెలల్లో పూర్తిగా ఔట్‌డోర్‌లోనే షూటింగ్ అన్నారు బి.వి. ప్రసాద్ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె




జయచంద్రా రెడ్డి గొంది రమేష్ నిర్మించే జయ పిక్చర్స్ వారి తొలి చిత్రంలో జయసుధ శరత్‌బాబు రామకృష్ణ హెగ్డే ప్రధాన భూమికలు నిర్వహిస్తారు రాజశ్రీ మాటలు పాటలు రాశారు సత్యం సంగీతం దిలీప్ సింగ్ శిల్పం బి రామ్ కిశోర్ సహ దర్శకత్వం కోనేరు బోసు నిర్వహణ కృష్ణ కూర్పు వగైరా సాంకేతిక వర్గం

## "తిరనాళ్ళు" రెండవ షెడ్యూల్

కథంతా గ్రామీణ వాతావరణంలో జరుగుతుంది

నిప్పు
వ
బాలకృ

# విశేషాలు

_జి.వి.జి.

మధురాధర్ కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు సత్యం బాణీలు కూర్చారు. ఆర్. రామారావు ఛాయ, బాబ్జి శిల్పం, అప్పారావు సాహసాలు, కోనంశెట్టి వెంకటేశ్వరరావు సహకార దర్శకత్వం, జయరాజ్ ప్రొడక్షన్, తిరునావక్కరుసు కూర్పుతో గోపాల్ నిర్మాత.



"రక్త తర్పణం"లో స్మిత సుమన్





జయప్రద, చిరంజీవి "వేట"లో

లాంటి

ష్ణ.

రామకృష్ణ హెగ్డే, పవిత్ర హీరో హీరోయిన్‌లు. సుత్తివేలు అత్తగా, భార్యగా జయమాలిని ద్విపాత్రాభినయం విశేషాంశం. కోవూరు పరిసరాలలో నవంబర్ చివరన రెండవ షెడ్యూల్ ముగించాం," అన్నారు గోపాల్ నండూరి. ఈయన తొలిసారిగా దర్శకత్వం వహించే సుహాసిని చిత్ర వారి "తిరనాళ్ళు"లో సాయిచంద్, వేలు, పి.ఎల్. నారాయణ, జె.పి. తాత, వల్లం నరసింహారావు, ఎం. రాధ, అన్నపూర్ణ, జయవిజయ ఇతర నటవర్గం.


అశ్వని, చంద్రమోహన్, "కొంటె కాపురం"


"ఇదేనా సమాధానం"లో మురళీమోహన్, మాధవి

## సాయిచంద్ చిత్రం "ప్రళయం"

జమిందారి వ్యవస్థకు చెందిన కద ప్రేమ పగ ప్రధానాంశాలుగా ఉంటాయి ప్రేమ పాత్రను నేను పగ పాత్రను చరణ్‌రాజ్ నిర్వహిస్తున్నాం పాటలను కన్యాకుమారిలో పిక్చరైజ్ చేస్తాం అన్నారు అభ్యుదయ నటుడు నవ జావాల యువ నటుడు సాయిచంద్ ఈయన నేతృత్వంలో ఈయన సోదరుడు లండన్‌లోని ప్రముఖ వైద్యుడు డాక్టర్ త్రిపురనేని రమేష్‌బాబు నిర్మించే సాయి సినీ కమర్షియల్స్ ప్రళయం చిత్రం షూటింగ్ డిసెంబర్ 21న మొదలైంది చరణ్‌రాజ్ సాయిచంద్ రమ్యకృష్ణ గిరిబాబు వేలు రాళ్ళపల్లి ప్రతిమటన శ్రీనివాసరావు బాలాజీ రఘురాజు చలపతిరావు నర్రా నవ విలన్ టి జి రవి రాజ్యలక్ష్మి వై విజయ జానకి లక్ష్మిప్రియ నటిస్తున్నారు అదృష్ట దీపక్ గీతాలు కె వి మహదేవన్ సంగీతం కరుణాకర్ చాయ మాండాత ప్రొడక్షన్ మురళి కూర్పుతో ఎం పి ప్రసాద్ సహ నిర్మాత కె రాదాకృష్ణ సమర్పించే ఈ చిత్రానికి




ఎల్మోత్సవ్ సినిమాలు చూశాక నా బుర్రంతా కొత్త రకం కదలతో నిండి పోయింది

అర్ధరాత్రి హత్యలు అనువాద చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన ప్రముఖ మలయాళ డైరెక్టర్ రాజసేన కద సమకూర్చి దర్శకత్వం వహిస్తున్నారు

## మురళీమోహన్, కోడి రామకృష్ణలతో జయ విజయ ప్రొడక్షన్స్ చిత్రం

మురళీమోహన్ సరసన రాదిక నాయిక మార్చి 20 నుంచి షూటింగ్ అన్నారు కోడి రామకృష్ణ ఈయన దర్శకత్వంలో గుమ్మడి శ్రీమన్నారాయణ టి జనార్ధనరావు నిర్మించే జయ విజయ ప్రొడక్షన్స్‌వారి చిత్రానికి గణేష్ పాత్రో మాటలు కె వి మహదేవన్ సంగీతం కె ఎస్ హరి చాయ తార నృత్యాలు సురేష్ కూర్పు నిర్వహిస్తారు


స్రవంతి లో శరత్‌బాబు, సుహాసిని


"లవ్ మాస్టర్"లో కపిల్‌దేవ్, రాగిణి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి ప్రత్యేక ఆకర్షణ!

కొత్త శీర్షిక

# అభిమాన తారలపై అభిప్రాయం !

తెలుగు చలన చిత్రరంగంలోని తమ అభిమాన తారలపై పాఠకులు తమ తమ అభిప్రాయాలని వెల్లడించటానికి ఈ శీర్షిక వేదికగా ఉపయోగపడుతుంది

ఉభయ తారకమైన ఈ శీర్షిక త్వరలో ఆంధ్రసచిత్రవారపత్రిక సినిమా పేజీలలో ప్రారంభం అవుతుంది

పాఠకులు తమ అభిమాన నటీనటులపై తమకి గల అభిప్రాయాలని నటన పాత్రల విషయంలో వారికి మీరు అందించే నిర్మాణాత్మకమైన సూచనలని వివరిస్తూ పాపురావు సైజు పేజి (సుమారు 500 అక్షరాలు) మించకుండా కాగితానికి ఒక వైపే రాసి తమ ఫోటో తో సహా మాకు పంపగోరుతున్నాము

రచన ఫోటోలని సంపాదకుడు ఆంధ్రసచిత్రవారపత్రిక గాంధీనగరం విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షిక పేరు అభిమాన తారలపై అభిప్రాయం అని రాయాలి

ప్రచురణార్హం కాని రచన ఫోటోలని తిప్పి పంపగోరేవారు తమ రచనతో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరిచి పంపాలి వాటి విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకి అవకాశం లేదు

ప్రచురింపబడిన వాటికి పారితోషికం ఉంటుంది

—సంపాదకుడు



"సింహాసనం"లో కృష్ణ, జయప్రద

## హిందీ, కన్నడ భాషల్లో పద్మాలయా వారి పౌరాణిక చిత్రాలు

అర్జునుడు -బృహన్నలగా జితేంద్ర భీముడుగా దర్మేంద్ర ద్రౌపదిగా జయప్రద ఘటోత్కచుడుగా అమ్జాద్‌ఖాన్ నకులుడుగా వినోద్‌మెహ్రా దర్మరాజుగా రాజేంద్రకుమార్ నటించే అజ్ఞాత వాస్ అనే హిందీచిత్రాన్ని విరాటపర్వం ఆదారంగా పద్మాలయా స్టూడియోస్ హిందీలో నిర్మిస్తుంది

కన్నడంలో లవకుశ చిత్రాన్ని జయప్రద డాక్టర్

## సినిమా

రాజ్‌కుమార్ సీతారాములుగా సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో త్వరలో సెట్స్‌కు వెళ్తుంది

## తొలి షెడ్యూల్ పూర్తయిన "జీవన పోరాటం"

దుష్ట శక్తులపై తిరుగుబాటు చేసి విజయం సాదించిన ముగ్గురు అన్నదమ్ముల కథను రోటీ కపడా ఔర్ మకాన్ ఆదారంగా మేం నిర్మిస్తున్నామని తెలియగానే ప్రేక్షక మహాశయు లెందరో రకరకాల టైటిల్స్‌ను సజెస్ట్ చేశారు పదిహేను మంది జీవన పోరాటం టైటిల్‌ను సూచించారు వీరికి అయిదు వేల రూపాయల బహుమతిని సమానంగా పంచాం అన్నదమ్ములుగా శోబన్‌బాబు రజనీకాంత్ నరేష్ నటనలో విజృంబించారు నవంబర్ 29 నుంచి డిసెంబర్ 6 వరకు మొదటి షెడ్యూల్‌ను పూర్తి చేశాం అన్నారు టి సుబ్బరామిరెడ్డి ఈయన సమర్పణలో ఎ శశిభూషణ్ వారి ఎత్తున నిర్మిస్తున్న శ్రీ సురేష్ ఎంటర్‌ప్రైసెస్ వారి పై ప్రతిష్టాత్మకమైన చిత్రంలో శరత్‌బాబు రాదిక విజయశాంతి ఊర్వశి సత్యనారాయణ రావుగోపాలరావు ఈశ్వరరావు గుమ్మడి ప్రసాద్‌బాబు ప్రతిమటన శ్రీనివాసరావు వేలు వీరబద్రరావు పి ఎల్ నారాయణ శుబ పుష్పలత తక్కిన భూమికలు పోషిస్తున్నారు మనోజ్‌కుమార్ కథకు గణేశ్‌పాత్రో సంబాషణకర్త చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి సి నారాయణ రెడ్డి గీతాలు రాశారు తివారి చాయ బాస్కరరాజు శిల్పం కె రంగారావు సహ దర్శకత్వం గీతా సుబ్బారావు ప్రచార విబాగం డి రాజగోపాల్ కూర్పుతో రాజాచంద్ర దర్శకుడు మద్రాసు హైదరాబాద్ బెంగుళూరు మైసూరు నగరాలలో మార్చి నెలకు చిత్రీకరణ ముగుస్తుంది □

సీరియల్




(గత సంచిక తరువాయి)

ముందు అనుకున్నట్లుగానే రవి ప్రతిమ ప్రొద్దునే పరందామయ్య వాళ్లతో ప్రయాణమయ్యారు

అక్కడ రెండు రోజులుండాలన్నాడు పరందామయ్య

రవి అంగీకరించాడు

తను ఇక్కడ వుంటే సుదకు దూరం కాలేడు ఆమెను చూస్తూ తనకేమి పట్టనట్లుండలేడు తన జీవితదారి మారింది ఇక ఆమె జీవితంలో తన పాత్రకాని తన జీవితంలో ఆమె పాత్రకాని వుండగూడదు తను కనిపించకుండా వుంటే డాక్టరే మరో మార్గమేదైనా చూస్తాడు అది తనకు ఆమెకూ గూడా మంచిది అనుకున్నాడు కాని అలా జరగలేదు

మూడో రోజు మద్యాహ్నం ఊరినుండి రాగానే సుదమ్మగారికి ఒంట్లో బాగాలేదట మీకోసం మోహానరావుగారు రెండు రోజులనుండి ఫోన్ చేస్తున్నారు ఈ రోజు గూడా చేశారు సాయంత్రంవరకు చూసి మీరు రాకపోతే హరిపురం రావాలనుకున్నారు నాయర్ చెప్పిన మాటలు విని కలవరపడ్డాడు

సుదకంత సీరియస్‌గా వుందా? స్వగతంగా అనుకున్నట్లుగా అన్నాడు

హాస్పిటల్‌కు వెళ్లివద్దామా? అంది ప్రతిమ

మనం చేసేదేముంది? సుదను చూడగూడదనుకున్న తన నిశ్చయాన్ని మార్చుకో గూడదనుకొని అతడు అక్కడినుండి పైకి వెళ్లబోతుండగా ఫోన్ మ్రోగింది

వెనుక్కు వచ్చి ఫోన్ యెత్తాడు

నాయర్ రవి గారొచ్చారా? మోహానరావు గొంతులో ఆతం ఆందోళన మిళితమై వున్నాయి

రవి బిగుసుకు పోయాడు

తనేం చెయ్యాలిప్పుడు?

నాయర్ మాట్లాడవేమిటి? రవిగారు రాలేదా? మోహానరావు స్వరంలో ధ్వనించిన బయాందోళనలు అతడినిక ఆలోచించ నివ్వలేదు

నేనే రవినే మాట్లాడుతున్నాను రావుగారూ ఇప్పుడే ఊరినుండి వచ్చాను మీరు ఫోన్ చేశారని నాయర్ చెప్పాడు హాస్పిటల్‌కు వస్తున్నాను ఫోన్ పెట్టేసి వెలుపలికి నడుస్తూ ప్రతిమ వంక చూసి నేను హాస్పటల్‌కు వెళుతున్నాను అన్నాడు

నేనూ వస్తాను అంటూ ప్రతిమ అతడ్ని అనుసరించింది

తను సుదకు దూరం కావాలని ప్రయత్నిస్తున్న కొద్దీ ఆమెకు దగ్గర కావాల్సిన అవసరం ఎర్పడుతున్నట్లుంది కొరెక్కుతూ అనుకున్నాడు రవి

బవిషత్తు నెంతో మదురంగా వూహించుకొని కలలు గంటున్న సుదను తను ఒక్కసారిగా అగాదంలోకి త్రోశాడు ఆ అగాదంనుండి ఆమెపైకి వచ్చేందుకు తన సహాయం కావాలంటే తను వెనుకంజ వెయ్యడమా కారు స్టార్ట్ చేశాడు

రవీ నాకెలా బ్రతకాలని వుందో తెలుసా' నవ్వుతూ తుళ్లుతూ నాలాంటి జివితం మరెవ్వరికి లేదన్నట్లుగా అంటూ వూహల ప్రపంచాన్ని వివరించే అందాల బొమ్మ సుద

తల్లిదండ్రుల కొకే ఒక సంతానం

ఆమె ఇలా అయిదంటే వారి మనసు కెంత బాద సుబద్రమ్మ మోహనరావు వదనాలు గుర్తొచ్చాయి

మీ గుండెలో బాద బైటికి చెప్పుకోవచ్చు నా వేదన బహిర్గతం చెయ్యలేను నాలోనే ఇముడ్చుకోవాలి ఈ గుండెలో సుద నిలిచిందని ఈ గుండెకు తప్ప సుదకు గూడా తెలియగూడదు ఎదురుగా బస్సు రావడం చూసి కారు ప్రక్కకు తిప్పుతూంటే కుదిపినట్లై ప్రతిమ అతడిమీది కొరిగింది అప్పుడు కాని బార్య ప్రక్కనున్నదని గుర్తు రాలేదతడికి

ప్రతిమ సర్దుకొని కూర్చుంది

రవి మౌనంగా కారు నడుపుతున్నాడు

సుద రూపు గుండెనుండి చెరుపుకోవాలనుకున్నాడు మళ్లీ ఏమిటీ ఆలోచన్లు

హాస్పిటల్‌కు రాగానే అక్కడ వున్న మోహనరావు బంధువులను స్నేహితులను చూసి బయపడ్డాడు రవి

సుదకెలా వుంది? ఆందోళనగా అడిగాడొకరిని

ఎలా వుందని చెప్పుమంటారు? కేకలు పెడుతోంది ఏడుస్తోంది డాక్టరు ఆమె దగ్గర ఎక్కువమంది వుండగూడదంటే బైటి కొచ్చాము అన్నాడతడు

మోహనరావు సుబద్రమ్మ సుద దగ్గరే వున్నారు

**జరిగిన కద- 4** అప్పు అడగవచ్చిన పరందామయ్య గారితో తనే ప్రతిమని పెళ్లి చేసుకోవాలనుకొంటున్నట్లుగా చెపుతాడు రవి సుదకు దూరం కావాలంటే తను వెంటనే వేరొకరిని పెళ్లి చేసుకోవాలనుకుంటాడు రవి రవి ప్రతిమల పెళ్లి నిశ్చయమయింది ఈ విషయం తెలిసి సుద తండ్రి మోహనరావు తల్లి సుబద్రమ్మ సుదకి విషయం ఎలా చెప్పాలా అని మదనపడతారు ఊరి నుంచి వచ్చిన సుద ఆ రోజే రవికి పెళ్లైందని తెలిసి కొయ్యబారిపోయింది అతనిని కలుసుకోడానికి పెళ్లి జరిగిన గితామందిరానికి ఆమె వెళుతుంది రవి ప్రక్కన ప్రతిమని చూసిన సుదకు మళ్లీ మతి తప్పింది సుదను చూడను హాస్పిటల్‌కి వెళ్లిన రవికి గతం గుర్తుకు వచ్చింది సుద నాట్యం అంటే రవికి ఇష్టం నాట్యప్రదర్శన ఇవ్వడానికి సుద విదేశాలకు వెళ్లడానికి నిశ్చయించుకుంది నృత్య ప్రదర్శనలో కాలి ఎముక విరిగిన సుదకు జీవితమే శూన్యమవుతుంది రవి సాహచర్యంతో సుద తిరిగి కొలుకుంటుంది గతం నుండి తేరుకున్న రవి ఇంటికి వచ్చాడు హాస్పటల్‌కి వెళ్లినందుకు ప్రతిమకి కోపం రాలేదని తెలుసుకొంటాడు

రవిని చూడగానే వాళ్ళ ముఖాలు వికసించాయి కాని అతడి వెనుకే ప్రతిమ కనిపించేసరికి ఆ ఆనందం హరించుకుపోయింది

ప్రతిమ రాక మళ్ళీ ఏ పరిస్థితిని తెస్తుందో! అనుకున్నారు కాని పైకి ఏమి అనలేకపోయారు

రవి వారి మనో భావాలను గ్రహించే స్థితిలో లేడు

సుద వైపే చూస్తున్నాడు

అంతవరకు ఆమె ఎంత గొడవ చేసిందో ఆమేమో చెబుతోంది

సుందర శిల్పంలా వున్న ఈమె కేమిటి దుస్థితి! జాలిగా అనుకుంది ప్రతిమ

రవి సుదకు దగ్గరగా వచ్చాడు

సుదా ఆమె ముఖంలోకి చూసి పిలిచాడు

ఆమె వులకలేదు పలకలేదు

సుదా నీకోసం నీకోసమే వచ్చాను సుదా నీవిలా వుంటే నేను చూడలేను మంచంమీదే ఆమెకు అభిముఖంగా కూర్చుంటూ వేదనగా అన్నాడు

ఆమెలో మార్పులేదు

సుదా ఏమిటి? ఎందుకిలా చేస్తున్నావు? అతడి గొంతులో బాధ చుట్టూ వున్న వారిని కదిలించి వేస్తోంది

సుదా భయం బాధ జీవితాన్ని శాసించే స్థితికి రాగూడదు ధైర్యంగా వుండాలి ఆమె భుజం మీద చెయ్యేసి వేదనగా అంటున్న అతడ్ని చూసి ఆమె ఈ లోకంలో వున్నట్లే లేదు ఏం మాట్లాడుతుంది? అంది ప్రతిమ

ప్రతిమా భార్యమాట వినిపించగానే మంచంమీదినుండి చటుక్కున లేచాడు రవి తను ప్రతిమ వుందన్న విషయమే మరిచాడు తన ప్రవర్తన చూసి ఆమె ఏమనుకుంటోందో! సుద ఈ లోకంలో లేదు అది తనకు తెలుసు కాని తనలో వ్యధ తనను చూస్తూ వూరుకో నివ్వదు తనిక్కడే వుండి అలాగె మాట్లాడుతుంటే తనకు ప్రతిమకు మధ్య అఘాతం ఏర్పడడం తధ్యం అనుకొని వెళ్దామా అంటూ ప్రతిమ వైపు చూసి బైటకి నడిచాడు

రవీ రవి వచ్చాడని డాక్టరుకు కబురు పంపి డాక్టరుకోసం ఎదురు చూస్తున్న మోహనరావు అతడు వెళ్ళిపోతుంటే ఆందోళనగా అన్నాడు

డాక్టరు వస్తుంటారు వుండండి రవీ

నేను వుండి చెయ్యగలిగేదేమి లేదు ఆ మాటే డాక్టరుగారికి చెప్పండి వెళ్లొస్తాను అన్నాడు రవి

మోహనరావు సుభద్రమ్మ అవాక్కులై నిల్చుండిపోయారు

రవి అలా అంటాడని వూహించలేదు వాళ్ళు

రెండు రోజులుగా అతడికోసం ఎదురు చూస్తున్నారు

అతడు వస్తున్నా ననగానే గుండె ఊపిరి పీల్చుకున్నాడు మోహనరావు సుద నింక అతడే చూసుకుంటాడనుకున్నాను ఇదేమిటి? అతడలా వెళ్ళిపోతున్నాడు! భార్యవైపు చూస్తూ అన్నాడు

అతడికేకాదు రవి చర్య ప్రతిమకూ ఆశ్చర్యం కలిగిస్తోంది

ఎందుకింత తొందరగా రావడం? డాక్టరుగారు వచ్చేవరకు వుండాల్సింది వాళ్ళు బాధపడుతున్నట్టున్నారు వెళుతూ వెళుతూ వెనక్కు తిరిగి చూసి వెనక్కు వెళదామన్నట్టుగా అంది ప్రతిమ

నేనక్కడ వుండి చేసేదేమి లేదు సుదనలా చూడలేను తొందరగా వచ్చేస్తున్నందుకు కారణం అంతకన్నా ఏం చెప్పలేకపోయాడు రవి

చాలా కాలంగా స్నేహంగా వుండడం వల్లేమో ఆ కుటుంబంతో అనుబంధం పెరిగింది సుద అనారోగ్యం అతడ్ని బాధిస్తోంది అనుకుంది ప్రతిమ

రవి ఇంటికి రాగానే దుస్తులు మార్చుకొని పడుకున్నాడు కాని మనసంతా సుద దగ్గరే వుంది

సుద ఏమౌతుందో ప్రతిమ వచ్చి ఎదురుగా కూర్చున్నా మాట్లాడలేక పోతున్నాడు

సుద గురించేనా మీ ఆలోచన? ప్రతిమ పలకరింపు అతడ్ని వులిక్కిపడేట్టు చేసింది

ఆమె గురించి నేను ఆలోచించేదేమిటి? డాక్టరు చూసుకుంటాడు ఆఫీసులో ముఖ్యమైన పనులున్నాయి వెళ్లాలా వద్దా అనుకుంటున్నాను వెళ్ళక తప్పేట్టులేదు అంటూ మంచం మీది నుండి లేచాడు

ఈ రోజు విశ్రాంతి తీసుకోండి అంది ప్రతిమ

నేను వెళ్ళి శ్రమ పడేదేముంది? మేనేజర్‌కు పనులు అప్పగించడమే వాష్ బేసిన దగ్గరికి వెళ్ళి ముఖం కడుక్కొని డ్రెస్ చేసుకున్నాడు

ఇంట్లో వుంటే తను విశ్రాంతి తీసుకోడం కాదు అశాంతిని పెంచుకోడమే అవుతుంది ఆఫీసుకు వచ్చి తన రూమ్‌లో కూర్చున్నాడు

తను ఈ వాతావరణానికి దూర అయితే తప్ప ఈ ఆలోచన్లు వదలవు

మేనేజర్ని పిలిచాడు

మిస్టర్ శ్రీదర్ రేపు డిల్లీకి రెండు ఫ్లైట్ టికెట్స్ బుక్ చేయించండి డిల్లీ కాశ్మీర్ హనీ మూన్ వెళ్ళాలనుకున్నాము అన్నాడు

అలాగే అన్నాడతడు

తను టూర్‌కు వెళ్ళి వచ్చేసరికి అతడు చెయాల్సిన పనులు చెప్పి ఇంటికి రాబోతుండగా మోహనరావు వచ్చాడు

కుర్చీలో నుండి లేచిన రవి అతడ్ని చూడగానే రండి అంటూ ఆహ్వానించి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు

శ్రీదర్ అక్కడి నండి బైటికి వెళ్ళిపోయాడు

రవీ మీరిందాక హాస్పిటల్ నుండి వచ్చారు మా ప్రాణాలు గూడా మీతో నే వచ్చాయి మోహనరావు గొంతు అతి దీనంగా పలికింది అతడ్ని చూస్తోంటే లోలోపలే కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నట్టుగా వున్నాడు

రవి శూన్యంలోకి చూస్తున్నాడు

తనేం చెయ్యలేనని చెప్పాడు కాబట్టి అతడిక తన కోసం రాడనుకున్నాడు



# మనసుకు సంకెళ్ళు

కాని పాతుం ప్రతి అవమానాన్ని నెట్టి ఉన్నంత తనెప్పుడు తనకు ఏం చెప్పాలి'

రవి మీ సహాయం లేనిదే డాక్టరు ట్రీట్‌మెంట్ ఇవ్వడం కష్టమంటున్నారు మీరు మాకు చేసే సహాయం మీకు కష్టం కలిగిస్తుందని తెలుసు కాని సుధ స్థితి నన్ను నిలవనియ్యలేదు ఆమె భవిష్యత్తు వుజ్జ్వలంగా వుంటుందనుకున్నాము మతిలేని మనిషయింది ఇంతకన్నా ఆమె చచ్చిపోయి వుంటే బాగుండేది

రావుగారూ వినలేని వాడిలా అన్నాడు

ఎందుకలా అంటారు? సుధ జీవితం నవ్వుల పువ్వులు చిందాలి

నిజమే రవి మా కోరికా అదే కాని అది జరక్కుండా జీవితం భయంకరమైతే ఆ బ్రతుకెందుకు?

లేదు రావుగారూ సుధ మామూలు మనిషౌతుంది అధైర్యపడకండి ఆమె మనలో కలిసి నవ్వుతూ తిరగాలి ఆ రోజుకోసం నేనేమైనా చేస్తాను పదండి రావుగారూ

థ్యాంక్యూ రవి థ్యాంక్యూ సజల నయనాలతో చూశాడు మోహనరావు

మిమ్మల్ని ఇబ్బంది పెట్టి నాకూతురి జీవితం నిలుపుకోవాలనుకుంటున్నాను

కాదు మనిషిగా నాబాధ్యతను గుర్తు చేశారు అన్నాడు రవి

* * * * *

రాత్రి పదిగంటలయినా ఇంటికి రాలేదు రవి

ప్రతిమ అతడికోసం ఎదురు చూస్తూ హాల్లోనే కూర్చుంది

పని పూర్తి కాలేదేమో ప్రతి నిమిషం అనుకుంటోంది ఆపీసుకు పోన్ చేయాలంటే అతడేమనుకుంటాడో నని బయం

పది నిమిషాలు గడిచాక పోన్ మ్రోగింది

రవి పోన్‌చేసి వుంటారు పరుగున వెళ్ళి పోన్ ఎత్తింది ప్రతిమ

హలో

మేనేజర్ శ్రీదర్‌ను మాట్లాడుతున్నాను

నీరుగారిపోయింది ప్రతిమ

రవిగారు ఇంట్లోలేరు మద్యాహ్నం ఆపీసుకు వచ్చారు ఇంకా ఇంటికి రాలేదు కలవరపడుతూ అంటూన్న ఆమె మాటలు విని రవి బార్య మాట్లాడుతోందని గ్రహించాడతడు

నమస్తే మేడమ్ రవిగారు వచ్చి వుంటారనుకున్నాను మద్యాహ్నం మోహనరావుగారు ఆపీసుకు వచ్చి హాస్పిటల్‌కు పిలుచుకెళ్లారు అక్కడే వుండివుంటారు మీకు రేపటికే ఢిల్లీ ప్లైట్ టికెట్స్ దొరికాయి ఈ మాట చెప్పాలనే పోన్ చేశాను

ఢిల్లీకా ఆశ్చర్యంగా అంది ప్రతిమ రవి తనతో ఆమాటే అనలేదే!

ఔను సార్ ఢిల్లీకనే చెప్పారు ప్రోగ్రామ్‌లో పదైనా మార్పువుంటే చెప్పండి టికెట్స్ క్యాన్సిల్ చేయిస్తాను అన్నాడు ఆమె ఆశ్చర్యంగా మాట్లాడేసరికి వాళ్ళు మరేదైనా ఊరికి వెళ్లాలనుకున్నారేమోననుకున్నాడతడు




ఏం లేదు థాంక్స్ పోన్ పెట్టేసింది ప్రతిమ

రవి తనకు చెప్పకుండా ప్రయాణం ఎర్పాటు చేసి తనను ఆశ్చర్యపరచాలనుకున్నాడేమో! పోన్ ప్రక్కనే కుర్చీలో కూర్చుంది

రవి హాస్పిటల్‌కు వెళ్లాడన్నారు ఇంకా రాలేదంటే సుధకెలా వుందో? అనుకుంటుండగానే పోన్ మ్రోగింది

మళ్లీ మేనేజరే చేసి వుంటాడనుకుంది ప్రతిమ కాని మోహనరావు మాట్లాడాడు

సుధస్థితి బాగోలేదమ్మా మద్యాహ్నం మీరు ఇక్కడినుండి వెళ్లిన గంటకే పోన్‌చేస్తే రవి ఆపీసుకు వెళ్లారని చెప్పాడు నాయర్ నేను ఆపీసుకు వెళ్లి అతడ్ని ఇక్కడికి పిలుచుకొచ్చాను ఈ రాత్రి ఇక్కడే వుంటారు మీరు కంగారు పడతారని పోన్ చేస్తున్నానమ్మా

థ్యాంక్సండి పోన్ పెట్టేసి ప్రతిమ పైకి వెళుతోంటే బోజనం చెయ్యండమ్మా అన్నాడు అప్పుడే వరండాలో నుండి హాల్లోకి వచ్చిన నాయర్

నాకాకలి లేదు నువ్వు తినెయ్యి పైకి వచ్చింది ప్రతిమ

రవి హాస్పటల్లో వుండాల్సి వస్తుందని రవి కాకుండామోహనరావు చెప్పడం బాధగా వుందామెకు

రవి చెప్తే తనకెంత తృప్తిగా వుండేది! రవి తనను దూరంగా వుంచుతున్నాడనిపించింది

సుధ గొడవ చేస్తుంటే ఆమె దగ్గర వున్నాడేమో మరో ఆలోచన

తను బయపడుతుందని మోహనరావుగారిని చెప్పమని వుంటాడు రవి గురించి చెడుగా ఆలోచించ నివ్వడం లేదు మనసు

అతడు తనను కోరి చేసుకున్నాడు అర్థం లేని ఆలోచనలతో బాదపడగూడదు

* * * * *

మద్యాహ్నం రవి హాస్పిటల్‌కు వచ్చే సరికి సుధ పెద్దగా అరుస్తోంది

పొండి ఇక్కడి నుండి వెళ్ళి పోండి దిండు విసిరి కొట్టింది

సుధా సుబద్రమ్మ దగ్గరికి రాబోతుంటే మంచం మీది నుండి లేచి ఆమెను బైటికి నెట్టేందుకేమో మెడ మీద చెయ్యి వెయ్యబోతుండగా డాక్టరు మెరుపులా వచ్చి సుధ చెయ్యి పట్టుకున్నాడు

సుదా ఏమిటిది? రెండు చేతులను గట్టిగా పట్టుకొని మంచం మీద కూర్చోపెట్టబోయాడు కాని అంతలోనే సుధ బలం కూడదీసుకొని అతడ్ని వెనక్కి త్రోసేసింది

అది చూడగానే రవి ఒళ్ళు జలదరించింది

సుధ ఏమై పోతోంది? పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వచ్చి ఆమె భుజాలు గుచ్చి పట్టుకున్నాడు అడ్డగించకపోతే ఆమె ఏదైనా చేసేస్తుందనిపిస్తోందా చూపులు చూస్తుంటే

ఏం చెయ్యాలనుకుంటున్నావు నువ్వు? ఇలాగేనా నీవు బ్రతకాలనుకున్నది? రవి స్వరంలో ఆగ్రహమో చూపుల్లో తీవ్రతో బయపెట్టినట్లుంది ఆమె చూపుల్లో మార్పు వచ్చింది మ్రింగేసేలా చూసిన ఆ కండ్లలో ఇప్పుడు బేలతనం మనిషి ముడుచుకుపోయింది

డాక్టరు అదే సమయమనుకున్నాడేమో ఇంజక్షన్ చేశాడు

ఆమె కదల్లేదు మెదల్లేదు

సుదా ఆమెనలా చూసేసరికి బాదేసింది రవికి

కదిలితే తనేం చేస్తాడో నన్నట్లుగా ఆమె బయంగా నిల్చొని వుండడం భరించలేకపోతున్నాడు

సుదా నీవు కోరుకున్న జీవితం ఇదా? ఆమెను ప్రక్కనే వున్న స్టూలు మీద కూర్చొపెట్టాడు

నీ వూహా ప్రపంచాన్ని ఏం చేశావు? మనోధైర్యం లేనిదే ఆ ప్రపంచం అందదని తెలియదా? అతడు బాదగా అంటుంటే మరింత బెదిరిన దానిలా

చూసి కాస్త వెనక్కు జరిగింది సుధ

అలా వున్నది కొద్ది క్షణాలే

సుధా నిన్ను నీవు అదుపులో పెట్టుకోవాలి కోరింది లభ్యం గాకపోతే జీవితమే లేదనుకొనే మూర్ఖత్వం విడనాడాలి అంటూ అతడు చూపులు మరల్చుకున్నాడో లేదో సుధ రివ్వున లేచి బైటికి పరుగు తీసింది

సుధా రవే కాదు అక్కడున్న వారందరూ దిగ్భ్రాంతులయ్యారు ఆమె అలా వెళ్ళడం చూసి

వాళ్ళు ఆశ్చర్యం నుండి తేరుకొనేసరికి ఆమె వరండా మెట్లు దిగిపోయింది

మోహనరావు అందరి కంటే ముందుగా ఆమె ననుసరించాడు కాని ఆమె వేగంగా పార్కు వైపు పరుగెత్తడం చూసి డాక్టరు ఆపాడు

ఆమె బైటికి వెళ్ళదు భయపడకండి మెల్లగా నడుద్దాం ఇద్దరు మెల్లగా నడుస్తున్నారు

సుధ పార్కులో ఓ బెంచి మీద కూర్చుంది

అది చూశాక మోహనరావు కాస్త కుదట పడ్డాడు

మనం వెంబడించామంటే ఆమె అక్కడి నుండి వెళ్ళి పోతుంది పార్కు దగ్గరికి వచ్చి ఆగి సుధ వైపు చూసిన డాక్టరు కండ్లు ఆమె కూర్చున్న బెంచి కాచివర కూర్చున్న యువకుడి మీద గూడా పడ్డాయి

అతడు చదువుతున్న పుస్తకంలో నుండి దృష్టి మరల్చి సుధ వైపు చూసిన సమయంలోనే డాక్టరు అతడ్ని చూశాడు

అతడ్ని పరీక్షించవచ్చు డాక్టరు మెదడు పని చేస్తోంది

రవి సుభద్రమ్మ గూడా డాక్టరు ఆదేశానుసారం అతడి వెనుకే కొద్ది దూరంలో చెట్టు చాటున ఆగిపోయారు

సుధ తన జీవన సుధ కావాలనుకున్నాడు కాని తనకా అదృష్టం లేదు తన గురించి తెలిస్తే ఆమె తన నీడను గూడా అసహ్యించుకుంటుంది సుధ అలా అనుకుంటుందని తనకు తెలిసి వుంటే ఆమె జీవితంలో ఈ హాలాహలం నిండేది కాదు సుధను బాధగా చూస్తున్నాడు రవి

సుధ బెంచి మీద తల వెనక్కు వాల్చి కూర్చొని వుంది

ప్రక్కనున్న యువకుడు పరీక్షగా చూస్తున్నాడామె వంక

చెమటకు చెదిరిన తిలకం గాలికి కదులుతున్న కురులు ఆమె కొవింత అందాన్ని తెచ్చిపెట్టినట్లు వున్నాయి

గులాబి రంగు దుస్తులలో విరిసిన గులాబిలా వుంది సుధ

గుండ్రని ఆ మోములో చారెడేసి కండ్లు ఆ కండ్లలో భయం ఒంట్లో ఒణుకు దేనికోసమో తపిస్తున్నట్లుగా వుందావదనం

మేడమ్ ఏమయింది? ఎందుకలా వున్నారు? ఆ యువకుడి పలకరింపు అక్కడ డాక్టరుకు ఆనందం కలిగిస్తే ఇక్కడ సుధను తృళ్ళి పడేట్లు చేసింది అంత వరకు అతడి వునికే గమనించలేదామె

మీరు మీరు భయంగా లేచి పరుగెత్తబోయింది కాని బెంచి ప్రక్కనున్న చెట్టుకొమ్మకు కొంగు తగలడంతో ఆగిపోయింది

ఎందుకలా భయపడుతున్నారు? ఏమయింది? కొంగు తీసుకొనే ప్రయత్నం గూడా చెయ్యకుండా భయంగా చూస్తున్న ఆమెను చూసి తనే లేచి కొంగు విడిపిస్తూ అన్నాడా యువకుడు

వద్దు వద్దు నన్నేం చెయ్యకండి రవిని నేనేం అనలేదు అనను గూడా కొంగు తియ్యగానే అతడేం చేస్తాడనుకున్నదో పెద్దగా అరుస్తూ వెనక్కు పడబోతుంటే ఆ యువకుడే పట్టుకున్నాడు

ఏమిటిది? ఎవరు మీరు? ఎందుకిలా అయ్యారు? అతడు ఆందోళనగా అంటున్నాడు కాని ఆమె వినే స్థితిలో లేదు అప్పటికే సుధ స్పృహ కోల్పోయింది

మోహనరావు వేగంగా వచ్చాడక్కడికి

ఈమె ఆ యువకుడి మాట పూర్తి కాక ముందే నా కూతురు అంటూ అతడి చేతుల్లో నుండి సుధను తన చేతుల్లోకి తీసుకున్నాడు

ఆ దృశ్యం చూడలేని వాడిలా రవి ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు ఇంత బాధకు కారణం తనే

డాక్టరు మాత్రం తృప్తిగా చూసి తన గదిలోకి వెళ్ళిపోయాడు

(ఇంకా ఉంది)

# కొడుకు

గిడుగు లక్ష్మీదత్

"అత్తయ్యగారూ!

ఏం రేణూ ఏం కావాలి?

నేను నేను రేపు ఊరు వెళ్ళిపోతానండి

అదేమిటమ్మా! అప్పుడే వెళ్ళటం? వచ్చి ఇంకా నాలుగు రోజులు కాలేదు మంచి రోజు చూసుకొని వెడుదుగాని అప్పుడే ఏం తొందర?

అది కాదండి అంటూ నసుగుతోంది కోడలు రేణు

అది కాదు ఇది కాదు ఊర్కో నువ్వు అలా మొహమాటపడకు నువు ఈ ఇంటి కోడలివి ఇక్కడ వుండవలసిన దానవు అలా వెళ్ళిపోతానంటే ఎలా? ఆడపిల్లలు లేని నాకు నువ్వే ఆడపిల్లవు నువు నట్టింట్లో అలా తిరుగుతుంటే ఎంతో ఆనందంగా వుంది పెళ్ళయ్యాక ఇక్కడ పట్టుమని పది రోజులుండటానికి అయినా వీలుపడలేదు పోనీ మేము వద్దామంటే మీ మామగార్కి బోలెడు బాధ్యతలు బరువులు ఇదుగో చూడు కనకాంబరాలు మాల కట్టి బల్లమీద పెట్టాను పెట్టుకో నకు ఇష్టమని జున్ను చేసి ఫ్రిజ్‌లో పెట్టాను ఏం తోచకపోతే పుస్తకాలు తెప్పించుకో రేడియో పెట్టుకో అంటూ కోడలు ఎక్కడ బెంగపెట్టుకుంటుందో ఏం మొహమాట పడుతుందో అని కమలమ్మ తన ధోరణిలో చెప్పుకుపోతున్నది కోడలు తనతో చనువుగా వుండాలని ఉబలాటపడుతూ

తోచకపోవటం ఏంలేదు అత్తయ్యగారూ! మీ అబ్బాయి హైదరాబాదు నుండి ఉత్తరం రాసారు వంట్లో బాగుండలేదని ఇబ్బందిగా వుందని

అయ్యయ్యో! ఎప్పి సన్నాసి! అసలు తేచి తిరుగుతున్నాడా? ఎన్నాళ్ళ బట్టి వంట్లో బాగుండటంలేదు? అసలు ఇంకా ఏం వ్రాసాడు? వాడికి ఇంత ఏసరు జలుబు చేసినా చిన్న ముల్లు గుచ్చుకున్నా - తను అసలు తట్టుకోలేదు

సరే అటయితే వెంటనే బయలుదేరమ్మా! అక్కడ వాడు ఏం ఇబ్బంది పడుతున్నాడో! అంది బెంగారుగా

మరి మంచిరోజు అంటూ నసిగింది రేణు

నీ మొహం! అక్కడ వాడు వంట్లో బాగుండలేదని రాస్తే మంచి రోజంటావేమిటి? మంచి మనసుతో బయలుదేరిన ఘడియే మంచి ముహూర్తం మంచిరోజు ముందు నువ్వు సామానులు అన్నీ సర్దుకో రాత్రి బండికి బయలుదేరుదువుగాని నేను ఈలోగా వాడికి నీకు ఇష్టమైనవి చేసి సర్దిపెడతాను ఈలోగా మీ మావగారి చేత వాడికి టెలిగ్రాం ఇప్పిస్తా స్టేషన్‌కి రమ్మని నువ్వు ఏం బెంగారుపడకు అంటూ కోడలికి సర్ది చెప్పింది కమలమ్మ

* * * * *

పరందామయ్యగారు అప్పుడే బోజనంచేసి తీరిగ్గా వరండాలో పేపరు మరోసారి తిరగేస్తున్నారు

బార్య కమలమ్మ వచ్చి ఏమండి మిమ్మల్నే అంటూ పిలిచింది

ఏమిటి? ఈ ముసలి మొగుడి మీద ఇంత కనికరం? అంటూ బార్యకేసి చూసారు

'ఈ రోజు రాత్రి బండికి కోడలు ప్రయాణం అబ్బాయి దగ్గరకు వెడుతుందిట

అప్పుడే వెళ్ళిపోవటం ఏమిటి? పుట్టింటి నుంచి అత్తవారింటికి వచ్చి నాలుగు రోజులైనా కాలేదు

అబ్బ! మీరూ మీ వ్యాఖ్యానాలూనూ మన అబ్బాయే ఉత్తరం రాసాడు వంట్లో బాగుండలేదని వెంటనే బయలుదేరి రమ్మని

ఏదో సరదాకి కనీసం పది రోజులైనా కోడలు నట్టింట్లో తిరుగుతుందనుకొంటే

సరే బావుంది వరస! అన్నీ మనకి చెప్పే పస్తాయా ఏమిటి? అన్నీ ఒక్కడు ఉండటం పండుకు తినటం ఎలా ఉన్నాడో రాత్రి బండికి కోడలిని ఎక్కించే ప్రయత్నం చెయ్యండి అటు నుంచి బజారు కూడా వెళ్ళి ఓ మంచి చీర జాకెట్టు పళ్ళు పూలు అన్నీ పట్టుకురండి చీర అంటే ఏ గుంటూరో ఏ వెంకటగిరో తెచ్చేరు ఈ కాలం పిల్లలు కట్టుకొనే చీరలు అని చెప్పండి ఖరీదు ఎక్కువయినా సరే మంచిది తీసుకురండి అంటూ! భర్తకు అన్నీ పురమాయించి ఎవరో తరుముకు వస్తున్నట్లు వంటింట్లోకి వెళ్ళింది కమలమ్మ

పరందామయ్యగారు కమలమ్మగారు చెప్పుకో దగిన మంచి దంపతులు ఏదో కొద్దిపాటి ఆస్తి ఉన్నా కన్న మంచి పేరు సంపాదించుకొని ఈ మధ్యనే రిటైరై ఏలూరులో నివసిస్తున్నారు

వీరికి ముగ్గురూ మగపిల్లలే ఆడపిల్ల లేదని కమలమ్మగార్కి దిగులు పెద్దవాడు శంకరానికి క్రితం వేసంగిలోనే పెళ్ళి చేసారు

కోడలిది రాజమండ్రి కోడలు రావటంతో కూతురు లేని కొరత కొంతైనా తీరుతుందని కమలమ్మ తెగ మురిసిపోయింది కాని పెళ్ళయ్యాక వెంటనే మూఢం వస్తుందని ఏలూరులో మూడు రాత్రులు అయీ అవకుండానే వెంటనే హైదరాబాదులో కొడుకు కోడలి చేత కాపురం పెట్టించేసారు ఎట్టుమని కోడలిని నాలుగు రోజులైనా చూసుకోలేదు ఈ మధ్య ఎండాకాలం కోడలు అబ్బాయి రాజమండ్రి వచ్చారు అబ్బాయి శెలవు దొరకలేదని పున్న నాలుగు రోజులు అత్తారింట్లోనే గడిపి అటు నుంచి అటే తిరిగి హైదరాబాదు వెళ్ళిపోయాడు శెలవు లేదంటూ అప్పుడే కమలమ్మ మనసు బాధపడింది కొడుకు రానందుకు పోనీలే కోడలైనా మరల హైదరాబాదు వెళ్ళేలోగా పది రోజులుంచుకుందామని సరిపెట్టుకుంది

ఏలాగైతేనేమి భర్తతో చెప్పి వియ్యంకుడిగార్కి ఉత్తరం రాయించింది కోడలు ముచ్చటా ముచ్చటా చూడాలని

వాళ్ళు అన్నదే తడవుగా రేణుకను రాజమండ్రి నుంచి తీసుకువచ్చి ఏలూరులో దింపి వెళ్ళారు

ఆమె వచ్చి నాలుగు రోజులు కాలేదు

అప్పుడే ప్రయాణం

ఏమిటో ఈ అత్తాకోడళ్ళ ముచ్చట మూడు రోజులు కాలేదు సరే తప్పుతుందా! వాడు కూడా రాసాక అనుకుంటూ లేచారు పరందామయ్యగారు

* * * * *

**అమ్మాయి రేణుకా! వాడికి ఇష్టమైనవన్నీ ఇందులో సర్దాను కాస్త వంట్లో కుదుటపడ్డాక పెట్టు పళ్ళు పచ్చళ్ళు పొడులు పిళ్ళు అన్నీ చిన్న చిన్న మూటలు కట్టి జాగ్రత్తగా సర్దాను అన్నీ జాగ్రత్తగా దింపుకోండి వెళ్ళగానే తడుముకోకుండా ఉంటాయని చిన్న పిల్లవని** ఇస్తున్నాను చాదస్తం అనుకోకు ఇదుగో చీర జాకెట్టు చీర కట్టుకొని మీ మామగార్కి దణ్ణం పెట్టు వాడికి ఏమాత్రం ఎక్కువగా ఉన్నా వ్రాయి మేము రెక్కలు కట్టుకొని వాలతాం డబ్బుకి చూసుకోవద్దు మంచి స్పెషలిస్టుకు చూపించుకోమను ఇద్దరికి కలిసి బెంగారుపడకండి వెంటనే ఉత్తరం వ్రాయి మా ఇద్దరికి మీ మీదే ధ్యాస ఎలా ఉన్నారోనని

ఇలా చెప్పినవి చెప్పకుండా సవాలక్ష జాగ్రత్తలు చెప్పి కోడలిని ఆ రాత్రి గోదావరికి రైలు ఎక్కించారు ఆ దంపతులు

* * * * *

మరునాడు

ఏమిటో కోడలు కోడలు అని

మురిసిపోయినంతసేపు పట్టలేదు అప్పుడే రావటం వెళ్ళటం కూడా అయింది ఎంతయినా ఓ ఆడపిల్ల నట్టింట తిరుగుతుంటే ఎంత ముచ్చట! అసలు ఆడపిల్ల లేని ఇల్లు ఏమి ఇల్లు

ఈ కోడళ్ళు అయినా నా దగ్గర ఎప్పుడుంటారో నా కడుపున పుట్టినదైనా వుంటే ఏదో పండగ పబ్బాలకి ఐదు రోజులు అయినా రాకపోనా! అని తనలో తనే అనుకొంటూ నడుం వాల్చింది కమలమ్మ

నిద్రపట్టటంలేదు మనసుకి కుదురులేదు

ఎప్పుడో కోడలు మరిచిపోయిన పత్రిక ఉంటే అది బొమ్మలు చూస్తోంది అందులోంచి కొడుకు కోడలికి రాసిన ఉత్తరం జారిపడింది

**మనసు ఉండబట్టలేక కొడుక్కి వంట్లో ఎలా వుందో ఏమని రాసాడో జ్వరంగా రాసాడో అని కొడుకు మీద బెంగకొద్దీ ఆతృతకొద్దీ ఉత్తరం గబగబా తీసి చదివింది ఓ పక్క సంస్కారం కాదని తెలిసినా నా కొడుకు అన్న దీమాతో వంట్లో బాగుండ లేదనటంతో**

ప్రియాతి ప్రియమైన ప్రియసఖి రేణుకి

నీవు మావాళ్ల ఇంటికి వచ్చినట్లు మీ నాన్నగారు వుత్తరం రాసారు కాని నువ్వు మా ఇంట్లో ఎలా వుంటున్నావో నేను లేకుండా అన్నదే నా బాధ ఎందుకంటే



నువు మి ఇంట్లో ఎంతో గారాబంతో పెరిగావు మా వాళ్ళకి చాలా చాదస్తం ప్రతి దానికి ఆంక్షలు అడ్డులు నిన్ను ఒక్కర్తిని ఎటూ వెళ్ళనివ్వరు అందులో మా అమ్మ మరీను మడీ ఆచారం అంటూ విసిగించేస్తుంది

పూజా పునస్కారం అంటూ ఒక పట్టాన తెమిలి భోజనం పెట్టదు అది ముట్టుకోకు ఇది ముట్టుకోకు అని గసురుతుంది మి ఇంట్లోలాగా టేబిల్ మీల్స్ సినిమాలు షికార్లు అసలే వుండవు అందులో నేను కూడా పక్కనలేనా ఇంక మా తమ్ముళ్ళు వర్ధి మొద్దురాచిప్పలు ఎంత సేపు వాళ్ళ చదువులు వాళ్ళ క్రికెట్ గోల కనీసం నిన్ను సిలోన్ హిందీ పాటలు అయినా విననిస్తారో లేదో అసలు నువ్వు ఎలా వున్నావో అన్నదే దిగులు అందుకే డియర్ నిన్ను అక్కడ ఎక్కువ రోజులు వుండనీయకుండా నాకు వంట్లో బావుండలేదని అబద్ధం చెప్పి వెంటనే బయలుదేరి వచ్చెయ్యి నా వంట్లో బ్రహ్మాండంగా వుంది నిజానికి నీ కోసం తెగ తహ తహలాడిపోతూ నీ రాక ఎప్పుడా ఎప్పుడా అని ఎదురు చూసే

నీ శంకరం

ఆ వుత్తరం చదివిన కమల్మగార్కి షాక్ తగిలినట్లయ్యింది కొడుకే కొరడాతో కొట్టినట్లు అనిపించింది

తనుపెంచిన కొడుకే అందునా అల్లారుముద్దుగా మొదటి సంతానమని ఎంతో

## కొడుకు

మురిపెంగా పెంచిన కొడుకే తాను గోరు ముద్దలందిస్తే తిని పెరిగిన కొడుకే ఎంత బాగా తన తల్లిని అర్థం చేసుకొన్నాడు?

ఒక సాంప్రదాయకమైన పద్ధతికి కట్టుబాటుగా వుంటే అలవాట్లకు శుచి శుభ్రతకు తలమానికంగా వున్న తను పెరిగిన ఆ వాతావరణాన్నే ఎలా ఊహించి రాయగలిగాడు? తల్లినైన నన్నే అలా ఎలా అనగలిగాడు? గుండెల్లో ఆవేదన కన్నీటి గోదావరి అయిపోయింది వరదలై పారింది

లోపల భార్య ఏం చేస్తోందో ఇంకా నడుం అయినా వాల్చకుండా అనుకొంటూ వచ్చిన పరందామయ్యగారు కూడా ఆ ఉత్తరం చదివారు

ఆయన గుండె కూడా బరువెక్కింది మనసు చెదిరినా ఎలాగో మగవాడిగా తమాయించుకుని ఒక్క నిట్టూర్పు విడిచారు వీడు మన బిడ్డేనా? అని మనసులోనే అనుకొంటూ భార్యను దగ్గరకు తీసుకుని కన్నీరు తుడుస్తూ వెన్ను నిమురుతూ

పిచ్చిదానా! కొడుకులు కొడుకులు అని పిచ్చి ప్రేమను పెంచుకొంటావు వెర్రి ఆపేక్షను చూపిస్తావు నువ్వొక పిచ్చి తల్లివి అడ్డాలనాటి బిడ్డలు గానీ పెళ్లాలు వచ్చాక బిడ్డలా? చెప్పు చిన్ననాడు తల్లి పొత్తిళ్లు స్వర్గం వయసున ప్రియురాలి కౌగిలి స్వర్గం

ఇంక వాడికి మన అవసరం తీరిపోయింది రెక్కలు వచ్చాక ఎగిరిపోయే పక్షులే ఈ కొడుకులు ఇది ఇంతే

అనవసరంగా ఏడ్చి నీ ఆరోగ్యం పాడుచేసుకొని ఈ వయసులో నాకు దూరం కాకు నీకు నేను నాకు నువ్వు మనిద్దరమే అంటూ మరింత ఆర్ద్రతతో ఆపేక్షతో భార్యకు సర్ది చెప్పారు తన గుండెలో అగ్నిరగులుతున్నా 

# మెదడు నశించినా గుండె పనిచేయడం

రోగుల మెదడులో జీవకణాలన్ని చని పోయినా వారి గుండె ఇతర అవయవాలను 54 రోజుల పాటు ప్రాణంతో ఉండేటట్టుగా ప్రపంచంలో మొట్ట మొదటిసారిగా జపాన్‌లో సాదించడం జరిగింది

ఓసాకే విశ్వవిద్యాలయ వైద్య పాఠశాలకు చెందిన ప్రొఫెసర్ సుయోషి సుగిమొటో యీ విషయాన్ని సాదించారు సాదారణంగా మెదడు చనిపోయిన కొద్ది రోజుల తరువాత గుండె కొట్టుకోవడం ఆగిపోతుంది అయితే ఎడిహెచ్ హార్మోన్లు ఆడ్రినలిన్‌ల సహాయంతో గుండె ఇంకా యితర అవయవాలు ప్రాణంతో చాలా కాలం పని చేసేటట్టు ఈయన చేయ గలిగారు (జ వా)

లైబ్రరీ నుండి యింటికొచ్చేసరికి పదకొండు దాటింది

వసారాలో నాన్నగారు వాలుకుర్చిలో ముందుకు వాలి ఆరోజు దినపత్రిక చూసుకుంటున్నారు

గడపదాటి లోనికెళ్తూంటే నాన్నగారు పిలిచారు దగ్గరకెళ్ళి నిలబడ్డాను

నాన్నగారు తన లాల్చి జేబులోంచి ఓ కవర్ని తీసి అందించారు

ఆర్నెల్ల క్రితం నేను ఒక ప్రముఖ పెయింట్స్ ప్యాక్టరిలో అక్కౌంట్స్ ఎగ్జిక్యూటివ్ ట్రెయినీ గా దరఖాస్తు పంపాను మరో మూడు రోజుల్లో-హైదరాబాద్‌లో ఇంటర్వ్యూ వుందని నన్ను రమ్మని రాశారు

ఆవుత్తరాన్ని మడిచి కవర్లో వుంచాను

నీ వెప్పుడెల్తావో చెప్తే ! నాన్నగారు ఆగిపోయారు ఎందు కాగి పోయారో కూడ నాకు తెలుసు రాను పోను చార్జీలను ఆ కంపెనీ వారు బరిసున్నా పై ఖర్చులకు కనీసం ఏభై కావాలి ఆ ఏభై కూడ నాన్న గారు అప్పు చేయాలి ఆ అప్పు సంపాధించడం నేను హైదరాబాద్ కెళ్ళే వ్యవదిని బట్టి వుంటుంది

చూద్దాం! నాన్నా" అంటూ లోనికెళ్తూంటే అమ్మ ఎదురొచ్చింది

చూద్దాం అంటే ఏలాగు? అదృష్టమెలా రాసి పెట్టిందో? వెళ్ళొస్తే బావుంటుందిరా సత్యం ! ఛార్జీలక్కూడ వాళ్ళే యిస్తున్నారాయె! అంటూ అమ్మ నిలబడే చేటలోని రాళ్ళలో బియ్యం ఏరుతోంది

గదిలోనికి వెళ్ళిపోయాను మంచం మీద వాలాను

నేను ఉద్యోగం వేటలో అలసి పోయాను వేసన ప్రతి బాణం గురి తప్పుతోంది ఎన్నో పోటీ పరిక్షల్లో నెగ్గిన నేను కులం తో ఓడిపోయాను పోస్టు గ్రాడ్యుయేట్ గా నిలబడ్డ నేను బతకటానికి కన్న ప్రేవులకు తృప్తి నివ్వటానికి ఎ చిరుద్యోగం దొరికినా బావుణ్ను అని అనుకుంటూనే రెండేళ్ళు గడిచాయి

ఇందాక అదృష్టం అని అమ్మ అంది ఆ మాటంటే నాకు బయం నా చదువు సామర్ధ్యం మీద నమ్మకం లేక అదృష్టం వెంటబడి బతుకు తెరువు కోసం వెంపర్లాడ వలసి వస్తుందనుకోలేదు నా ఆత్మ స్థైర్యం ముక్కవోయింది రిటైరైన నాన్నగారు అనారోగ్యంతో అమ్మ పెళ్ళి కాని అక్కయ్య కాలేజీలో చదువుతున్న తమ్ముడు నిరుద్యోగిగా నేను మా కుటుంబ ఆర్థిక దుస్థితికి ప్రతిరూపాలు ఈ దుస్థితి నుండి మమ్మల్ని రక్షించేది అదృష్టమేనా?

మానసికంగా కృంగి పోతున్నాను నిరాశా వాదమనే ప్రవాహంలో కొట్టుకుపోతున్న నాకు ఆసరాగా యీ గడ్డిపోచ దొరికింది మరి యీ ఆసరా అనబడే యింటర్వ్యూ నా అదృష్టం



అనుకోవాలా? లేక నా ఆత్మ బలానికి మరో పరీక్ష అనుకోవాలా??

ఇంటర్వ్యూ కెళ్తానండి నాన్న గారూ!

శుభం రేపే బయల్దేరు బాబూ!

నాన్న గారు వాలు కుర్చీలోంచి లేచి తుండుగుడ్డను భుజమ్మీద వేసుకుని వీది వైపు నడిచారు ఆనడక అప్పుకోసం ఎండలో ఊరేగుతోంది

ఆ రాత్రి నాన్నగారు అరవై రూపాయలు ఖర్చులకని రైలు చార్జికి ఓ నలభై మొత్తం వందయిచ్చారు అప్పు అంతకన్నా ఎక్కువ దొరికి నట్లు లేదు మరి సూటు కేసులాంటి పెట్టెలో నా సర్టిఫికెట్లు వున్న రెండు జతల బట్టలు సర్దుకున్నాను

ఉదయం గోల్కొండ కు నా ప్రయాణం

హైదరాబాద్ లో ఎక్కడ దిగాలో ఎవరింట్లో వుండాలనే సమస్య నాకు లేదు మా చిన్నత్తయ్య వుండేది అక్కడే! అయినా !

నాకు మా సుందరత్తయ్య యిల్లు నరకంలా వుంటుంది నట్టింట్లో దారిద్రదేవత తాండవిస్తోందా అన్నట్టుగా వుంటుంది ఓ చిన్న కంపెనీలో మా మామయ్య ఎదుగూ బొదుగూ లేని ఓ చిన్న వుద్యోగం చేస్తున్నాడు అతని కెప్పుడూ అనారోగ్యమే ? అద్దె యిల్లు ఒకేగది అందులోనే అన్నీను పిల్లలు నలుగురూ మసిబట్టి సరియైన

# సమిధ

పోషణ లేక ముళ్ళ కర్రల్లే వుంటారు ఇక అత్తయ్య అందగత్తే! అయినా రంగు తగ్గిపోయి పాగ చూరిన కట్టెలా వుంటుంది పిలక ముడితో ఎప్పుడూ ముఖం జిడ్డోడుతూ అసహ్యంగా వుంటుంది వాళ్ళ జీవితాల్లో అసంతృప్తి ఎక్కువ తృప్తిని జయించలేని ఆశలు ఆశల్ని జయించలేని దారిద్రం అందుకనే వాళ్ళిల్లు నాకో ముళ్ళ కంపలా వుంటుంది వాళ్ళకూ వున్నాయి ఆదరాభిమానాలు కాని హైదరాబాద్ లాంటి పట్టణాల్లో ఆర్థికంగా దెబ్బతిని ఏదో జీవితాన్ని నెట్టుకు వస్తున్న మా సుందరత్తయ్య లాంటి వాళ్ళకు నేను చుట్టాన్నే కాదు ఓ గుదిబండను కూడాను నిజంగా చెప్పాలంటే మా రెండు కుటుంబాలు పేదతనంలో సరిసమానంగా తులతూగుతాయి

అత్తయ్య యింట్లో దిగకుండా యింకో చోట వుండటానికి నాకు అవకాశం లేదు ఇతర బంధువులు స్నేహితులు లేరు ఏ హోటల్లో వుండి సరే యిక ఆ తాహతే లేదు

ఈ ఇంటర్వ్యూ లో నేను నెగ్గితే బావుణ్ను ఉద్యోగం వస్తే నా బతుక్కు ఒక సార్థకత అంటూ ఏర్పడుతుంది నా కుటుంబంలో సుఖ సంతోషా-దులు వెల్లి విరుస్తాయి అయినా? ఆశ నిరాశల మధ్య వూగిపోతూ కలత నిద్రపోయాను

ఉదయం

నేను సూటుకేసు పట్టుకుని అమ్మ నాన్నల దగ్గర శెలవు తీసుకుని బయల్దేరుతూంటే కృష్ణక్కయ్య ఎదురొచ్చింది శుభసూచకంగా నే వెళ్ళే ప్రతి ఇంటర్వ్యూ కు అక్కయ్య ఎదురొస్తుంది హైదరాబాద్ నుండి వచ్చేటప్పుడు మంచి పెన్ పట్టుకు రమ్మన్నాడు శేషు 'పప్పుచెక్కలు ఓ సంచిలో వేసి సుందరత్తయ్య పిల్లలకు యివ్వమంది అమ్మ

గోల్కొండ బయల్దేరింది రైల్లోనే కాంపిటీషన్ సక్సెస్ ల్యాంటిక్వెస్తకాల్ని తిరగేస్తు కూర్చున్నాను అలాగే సమయం గడిచిపోయింది

నాంపల్లి స్టేషన్ చేరేసరికి మధ్యాహ్నం ఒంటి గంట దాటింది అత్తయ్య గారిల్లు దోమలగూడా లో వుంది సిటీ బస్సులో వెళ్ళాలంటే కుదరదు నడిచి వెళ్దామంటే దగ్గర దూరం కాదాయె! ఆటో లోనే వెళ్ళాల్సి వచ్చింది అంటే అప్పుడే ఖర్చు మొదలయిందన్న మాట నేను రైల్లో ప్రయాణం చేసిన టికెట్టు నెంబరు వగైరాలు నా డైరీలో రాసుకున్నాను ఆ ఛార్జీ కంపెనీ వాళ్ళ దగ్గర్నుండి వసూలు చేసుకోవాలి అలాగే తిరుగు ఛార్జీలు కూడాను

ఆటో స్పీడు గా వెళ్తూ మరో పావు గంటలో దోమలగూడ చేరింది అత్తయ్యా వాళ్ళిల్లు ఆ మూడో సందులో వుంది నరకంలోనికి ప్రయాణం



ప్రవేశం కూడాను నేను గేటు తీసిన చప్పుడుకు ఆ యింట్లోంచి ఒక స్త్రీ బయటకు వచ్చింది అమెను చూసి వెనక్కి అడుగేశాను అత్తయ్య వాళ్ళిల్లు కాదు కదా ? అని–

సత్యం మనిల్లే! లోనికి రా!!

కంఠస్వరం బట్టి అత్తయ్యేనని పసిగట్టాను గేటు తీసి లోనికెళ్ళాను అత్తయ్యలో ఎంత మార్పు? ఆశ్చర్యపోయాను

ఎప్పుడూ అరవై నెంబరు గుంటూరు ముతక చీరలో కనపడి చిర్రుమనే అత్తయ్య ఎంతో శుభ్రంగా వెంకటగిరి నేత చీరలో అందంగా వుంది నలుగురు పిల్లల తల్లిలా లేదు పిలకముడి స్థానే బారు జడ ముఖానికి స్నో పౌడర్ అదో ఏంత కాంతి దబ్బ పండు ఛాయతో బొద్దగా ఆకర్షణీయంగా వుంది మిసమిసలాడుతూ ముద్దబంతి పూవులా వుంది ఇక వర్ణించడానికి నాకు సంస్కారం అడ్డొచ్చింది ఎంతైనా ఆమె నా మేనత్త ఆ గది చాలా శుభ్రంగా సర్ది వుంది ఓ నాలుక్కుర్చీలు చిన్నసోఫా ప్రక్కగా చిన్న టీపాయ్ పై ఫ్లవర్‌వాజ్ గోడలపై అందమైన దృశ్యాలు వేలాడబడి వున్నాయి

రెండో గది బెడ్‌రూం మంచాలున్నాయి పైన ఫాన్ వుంది మూడో గది కిచెన్ గ్యాస్‌స్టవ్ ఎన్నో స్టీలు పాత్రలు చిన్న పెరడు ఓ ప్రక్కగా బాత్‌రూం వగైరా మురికి బట్టిన మొదటి గదిలో యిరుకుగా సంసార యాత్రను గడిపిన యీ కుటుంబం యీనాడు మూడు గదుల్లో ముచ్చటగా జీవిస్తున్నారంటే! నాకెంతో సంతోషం ఆపై ఆశ్చర్యం కూడాను

రెండో గదిలో నా సూట్‌కేసును వుంచాను

చాలా బావుందత్తయ్యా! ఇల్లు

అత్తయ్య నవ్వింది బొండు మల్లెలు విరిసినట్లు

అద్దె నాలుగొందలు తెలుసా!

నేనేం మాట్లాడలేదు అత్తయ్య వాళ్ళు ఆర్థికంగా అభివృద్ధి చెంది ఎన్నో రెట్లుగా పైకొచ్చారు ఎలా వచ్చారనేది? తెలుసుకోక పోయినా ఫర్వాలేదు అత్తయ్య నన్ను స్నానం చేసి రమ్మంది వచ్చాక వేడిగా భోజనం వడ్డించింది భోజనంలో మూడు రకాల కూరలు పెరుగూను

సత్యం! ఆశ్చర్యంగా వుంది కదూ? అంది అత్తయ్య అదోలా నా వైపు చూస్తూ

ఏంటత్తయ్యా? అంటూ ఆశ్చర్యంగానే అడిగాడు

అబ్బే! ఏం లేదు సత్యం ! కొద్దిసేపు పడుకో! ఇంకో గంటకల్లా పిల్లలు కాన్వెంట్ నుండి వస్తారు

ఎల్లాగూ నిన్ను అల్లరిపెడ్తారు అంటూ మాట మార్చేసింది అత్తయ్య

కడుపునిండా భోజనం చేయడంతో కమ్మగా నిద్రపట్టింది

పిల్లల కలకలంతో మెలకువ వచ్చింది పిల్లలందరూ ఆరోగ్యంగా పుష్టిగా కడిగిన




ముత్యాల్లా వున్నారు అమ్మ యిచ్చిన పప్పు చెక్కలు యిచ్చాను ఎంతో ఆనందంగా తృప్తిగా తిన్నారు

అత్తయ్య కాఫీ యిచ్చింది తనుకూడ కాఫీ తెచ్చుకుని నా ఎదురుగ్గా కూచుంది నాన్న అమ్మల ఆరోగ్య క్షేమ సమాచారాలు గురించి అడిగింది కృష్ణక్కయ్య పెళ్ళి గురించి బాధ పడింది శేషు గురించి ఆరాలు తీసింది

నీ వెందుకొచ్చావ్? అని అడగలేకపోతోంది అత్తయ్య

నా ఇంటర్వ్యూ గురించి చెప్పాను చాలా సంతోషించింది భగవంతుడు నాకు మేలు చేస్తాడని చెప్పింది

మామయ్య గురించి అడిగాను

మీ మామయ్యకేమిట్రా? రావ్ అండ్ రావ్ ఎస్టేట్స్‌లో ఏజెంటుగా వుంటున్నారు నెలకు రెండు వేలు జీతం పైన కమిషన్ అంది ఎంతో గర్వంగా

నిజం ఆపాటి గర్వం ప్రతి స్త్రీకి ఉండాలి తన భర్త గొప్పవాడయినందుకు! అదన్నమాట వీళ్ళ జీవిత జీవానికి మూలం అంటే మామయ్య బాగా సంపాదిస్తున్నాడన్న మాట ఆ సంపాదనతోనే కుటుంబం సుఖ శాంతులతో తులతూగుతోందన్న మాట

రావ్ అండ్ రావ్ కంపెనీలో మానేజింగ్ పార్ట్‌నర్ రాజారావుగారిదేనట యీ యిల్లు రాజారావు గారి మేడ ప్రక్కనే వుందట

ఎన్నెన్నో చెప్పింది అత్తయ్య పిల్లలు కూడ క్రమశిక్షణతో పెరుగుతున్నట్లుంది

హోం వర్క్ అంటూ కూర్చున్నారు పెద్దోడు లెక్కలు చెప్పమంటూ నా వైపుకొచ్చాడు అత్తయ్య నేను మాటలు కట్టిపెట్టాం పిల్లలందరికి హోంవర్క్‌లో సాయపడుతూ కూర్చున్నాను అత్తయ్యను పిల్లల్ని చూస్తుంటే నాకు మనసు తృప్తిగా వుంది అప్పటి నరకం యిప్పటి స్వర్గం ఎంత మార్పు చికటిపడింది

రాత్రి ఎనిమిది అయింది

ఇంటి ముందు ఏదో మోటార్ సైకిల్ చప్పుడవుతే తలెత్తి చూశాను

అత్తయ్య వెళ్ళి గేటు తీసింది పెద్ద చప్పుడు చేసుకుంటూ వచ్చి గది ముందు ఆగింది మోటార్ సైకిల్ స్టాండు వేసి లోనికి వచ్చాడు మామయ్య

ఎప్పుడొచ్చావ్? అంతా బావున్నారా? అంటూ నన్ను పలకరించి లోనికెళ్ళి పోయాడు సన్నగా పీలగా వుండేవాడు ఇప్పుడు ఒళ్ళు బట్టి పొన్నకాయలా వున్నాడు మార్పేమిటంటే అప్పుడు నెత్తిమీద బోలెడన్ని వెంట్రుకలు ఇప్పుడేమి ఎడారిలా బట్టతల

రాత్రికి భోజనాలు మామయ్య కొంత ఆలస్యంగా తింటాడంది మామయ్య రెండో గదిలో లైటు వేసుకొని ఏవో రాసుకుంటున్నాడు మళ్ళీ పొద్దుటికి గాని మామయ్యతో మాట్లాడ్డానికి అవకాశం దొరకలేదు దొరికినా ఏదో అంటీ అంటనట్లు ముట్టీ ముట్టనట్లు పలకరించాడు

మొదట్నుంచీ మితభాషే !

ఏది ఏమైనా నేను కొంత బాధపడ్డాను మామయ్య వాళ్ళ అభివృద్ధిని గురించి అసూయపడటంకాదు కనీసం మా నాన్నగారికి తమ కుటంబ పరిస్థితుల్ని గురించి తెలియజేయక పోవటం అత్తయ్య చేసిన పొరపాటు కాదా? అయినా ఎవరి బతుకులు వాళ్ళవి కష్టాల్లో వున్నప్పుడు మా నాన్నగారేమైనా ఆదుకున్నారా? ఏంటి??

పిల్లలు కాన్వెంట్‌కు వెళ్ళిపోయారు మామయ్య పదిగంటల ప్రాంతంలో వెళ్ళిపోతూ యింకా వుంటావుగా? అంటూ ప్రశ్నించి జవాబు కూడా వినకుండా వెళ్ళిపోయారు మెకానికల్‌గా బతికేస్తు-న్నారు తప్పదేమో వేగానికి అలవాటు పడ్డ బస్తీ బతుకులకు జనం ఏదో అర్జంటుగా పనులున్నట్లు పరుగెత్తుతున్నట్లే నడుస్తుంటారు ఒక్క సెకను ఆలస్యమవుతే కొంపలంటుకుంటాయేమో? మరి

రేపు ఇంటర్వ్యూ ! కరెంట్ అఫైర్స్

చూసుకొంటున్నాను

సత్యం రావుగారొచ్చార్రా ఓసారిలా రా" అంటూ అత్తయ్య పిలుస్తోంది ముందు గదిలో సోఫాపైఓ నల్లటి ఆకారం కూలబడి ఉంది

రావుగారంటే ఎవరో మరి?

నమస్కారం చేశాను అతడు తల మాత్రం వూపాడు బాగా లావుగా కారు నలుపు మొరటుగా గరుత్మంతుడి ముక్కుతో అదె విగ్రహంలా వున్నాడు మెళ్ళో బంగారు గొలుసు వేళ్ళకు వుంగరాలు ఖరీదైన ఎల్కు బట్టలు పెద్ద ధనికుడిగా చూపిస్తున్నాయి చేతిలో ఖరీదైన సిగరెట్ ప్యాకెట్టు

మా అన్నయ్య గారబ్బాయండి అంది అత్తయ్య

ఏం జేస్తున్నావ్ బాబూ' ఎంతో నెమ్మదిగా అడిగారు రావుగారు

ఎమి చేయడం లేదండి ఖాళీగా వున్నా అంటూ జవాబిచ్చాను

మా వాడికి ఏదో కంపెనీలో ఇంటర్వ్యూ వచ్చిందటండి వివరాలు చెప్పరా సత్యం ' అంటూ ఓ కుర్చీ ముందుకు లాగి కూచుంది అత్తయ్య ఆమె ప్రక్క నేను కూర్చున్నాను

నేను పూర్తిగా వివరాలన్నీ చెప్పాను

బలేవాడివోయ్' అదృష్టమంటే అలా వుండాలి ఈ కంపెనీ రెసిడెంట్ డైరెక్టర్ నాకు చాలా క్లోజ్ ఫ్రెండ్ సికిందరాబాద్ క్లబ్ లో రోజూ కలుస్తాం నీ పేరు ఓ స్లిప్ మీద రాసియ్యి ఈ రోజే మాట్లాడుతా' అత్తయ్య లేచి వెళ్ళింది వంటింట్లోకి

నేను నా పేరు వగైరాలు రాసిచ్చాను ఓ పేపర్ మీద రావుగారు తమ పర్సులో వుంచుకున్నారు

ఇంతలో కాఫీలు వచ్చాయి

కాఫీలు తాగాకతను వస్తానంటూ లేచాడు రావుగారు గేటు వరకు వెళ్ళి రావుగారికి వీడ్కోలు చెప్పింది అత్తయ్య రావుగారు టయోటా లో వెళ్ళిపోయారు

అత్తయ్య గేటు దగ్గర్నుండి వస్తుంటే ఎంత సమ్మోహనంగా నడుస్తోంది ఎండలో చిరు చెమటలు పట్టిన ఆమె పచ్చటి శరీరం బంగారులా మెరుస్తోంది

రావుగారు చాలా మంచోర్రా' ఇటు రా'' ఆ మేడ చూడు వారిదే' కోటీశ్వరుడు ఈ వూళ్లో రెండు సినిమాహాళ్ళున్నాయి పెద్ద హోటలుంది

ఊ కొట్టాను ముప్పైగజాల్లో పెద్ద సరికొత్త మేడ ఆ మేడకు ఔట్ హౌస్‌లా వుంటుంది అత్తయ్యగారిల్లు

రావుగారి గురించి ఊదరగొడ్తోంది అత్తయ్య

ఈ యిల్లు చూశావుగా అప్పట్లో ఎంత యిబ్బంది పడేవాళ్లం పాపం రావుగారు మన బాధను చూళ్ళేక రెండు గదులు ఖాళీ చేయించి మనకే యిచ్చార్రా ' మన కుటుంబ స్థితిగతులను తెలుసుకుని మామయ్యకు తన కంపెనీలో మంచి వుద్యోగం యిచ్చార్రా' వినికంతా రావుగారి

# నవ మల్లిక

నా యెద విరిసెను నవ మల్లిక
తీయని కవితల కది మాతృక
ప్రణయ సుగంధము వెదజల్లుచు
వలపు పసందులు ఘటియించుచు
క్రొంగొత్త తలంపులు నించుచు
క్రొమ్మెఱుంగు హొయలు పెంచుచు
మోహన కాంతులు గురిపించుచు
నా హృదయమ్మును గదలించుచు
సుందర స్వప్నము లలరించుచు
సుఖానుభూతిని కల్పించుచు
నా యెద విరిసెను నవ మల్లిక
తీయని కవితల కది మాతృక
నా మది గల జాజి తీవెలను
నా హృదిగల గులాబి తరులను
పెనవేసుకు ఈ నవ మల్లిక
వినిపింపదె సమైక్య గీతిక
ఆ గీతికలో ఆ మధురిమలో
ఆ మధురానంద పథములో
పయనించుచు నే పరవశించెద
పరవశించి నవ కవిత లల్లెద

— భారతి

# సమిధ

చలవే ' అంటూ ఆగింది అత్తయ్య

నిజంగా కష్టాల్లో ఆదుకున్న ఆపద్బాంధవుడిని గురించి పొగడటంలో తప్పేముంది? రావుగారి రికమెండేషన్ వల్ల నాకు వుద్యోగం దొరికితే నేను రావుగార్ని దేవుడిలా కొలువనూ? అది అంతే' అయినా ఆ రావుగార్ని గురించి మరి అంత గొప్పగా చెప్పుకోవటం నాకంత యిష్టంలేదు

నీకు తప్పకుండా ఉద్యోగం వస్తుంది రావుగారన్నారంటే తప్పదు అంది మళ్లీ అత్తయ్య నేను చిరునవ్వు నవ్వాను మళ్ళీ పుస్తకాలందుకున్నాను రావుగారి మాట మీద నమ్మకం వున్నా లేకపోయినా ఇంటర్వ్యూలో నా పర్‌పార్మెన్స్ బావుండొద్దు?

నేను అలా కూరలకెళ్లొస్తాను నీకేమైనా కావాలా" అంది అత్తయ్య ఆమె చేతిలో ప్లాస్టిక బుట్ట నాకేం వద్దన్నాను అత్తయ్య వెళ్ళిపోయింది తింటానికి కూడ సరిగా తిండిలేక కట్టుకోడానికి సరైన చరల్లేక చిర్రు బుర్రుమంటూ ప్రతిదానికి ప్రతి చిన్న విషయానికి మామయ్యను చీదరించుకుని ఎగిసిపడుతూ శారీరక మానసిక అలసటను ఎల్లల మీద చూపిస్తూ సంసారిక పాకుడు రాళ్లపై పాకిన అత్తయ్యను చూస్తుంటే అనాటి సుందరమ్మత్తయ్యేనా" అని అనిపించింది

**సు**ందరమ్మత్తయ్య కాదు' సుందరి అత్తయ్య''

పిల్లలు వచ్చారు నన్ను ప్రాజెక్టు వర్క్ కు సాయపడమంటే పిల్లల్ని కోప్పడింది నా ప్రపరేషన్ కు ఏలాంటి అంతరాయం కలుగకుండా అత్తయ్య జాగ్రత్తపడింది రాత్రిని మామయ్య వచ్చాడు వస్తూనే భోజనం వద్దంటూ అవే బట్టలతోనే ముసుగు కప్పేశాడు అతడి దగ్గర నాకో విదమైన వాసన గుప్పుమంది

అంతస్తుతో బాటు అలవాట్లు కూడాను

రావుగారు మళ్ళీ రాలేదు! ఆ రోజు గడిచిపోయింది

సనత్‌నగర్ లో పదికంతాఇంటర్వ్యూ బస్సుల్లో వద్దు ఆటో లో వెళ్ళమంది ఆటో ఛార్జీలకని డబివ్వపోతే వద్దని నా దగ్గరుందని సర్ది చెప్పాను అత్తయ్య యింకేం మాట్లాడలేదు

ఓ ఫైల్లో నా సర్టిఫికెట్లు వుంచుకుని సనత్‌నగర్‌కు ఆటో లోనే బయల్దేరాను

ప్యాక్టరీ ముందే ఆటో ఆగింది అభ్యర్థులు చాలామంది వచ్చారు సరిగ్గా పది గంటలకు ఇంటర్వ్యూ మొదలైంది నేను ఎనిమిదో వాణ్ణి

ఒక్కొక్కరికి పావు గంటకి పైగా పట్టింది బయటికొచ్చిన ప్రతి అభ్యర్థిని ఏం ప్రశ్నలడుగుతున్నారని చుట్టేశాం

నా వంతు వచ్చింది గదిలోనికెళ్ళాను ఇంటర్వ్యూ మొదలయింది

పావు గంటలో గదిలోంచి బయటకొచ్చేశాను ఇంటర్వ్యూ సరిగ్గా చేయలేదు

ఇంటర్వ్యూ బోర్డుకు నా పెర్‌పార్మెన్స్ అసంతృప్తి నిచ్చి వుండాలి వాళ్ళు అడిగిన ప్రతి ప్రశ్నకు తికమక పడ్డాను ఇలా జరగడం నాకు మొదటసారి నేను ఓడిపోయానంతే!

రాను పోను ఛార్జీలు ప్యాక్టర్ క్యాష్ కౌంటర్లో వసూలు చేసుకున్నాను దార్లో శేషుకు పెన్నొకటి అక్కయ్యకు రంగు దారాలు కొన్నాను అత్తయ్యగారి పిల్లలకు అర కె జీ స్వీట్లుకొని యిల్లు చేరుకున్నాను

ఎలా జరిగిందని అని అడిగింది అత్తయ్య బాగానే జరిగిందన్నాను ఏం చెప్పాలో తెలియక

రావుగారొస్తే బావుణ్ను అంది అత్తయ్య నా ఖర్మ యిలా వున్నప్పుడు ఆయన గారేం చేస్తారు ఏదో మాట వరసకు ఆరెసిడెంట్ డైరక్టర్ నాకు తెలుసన్నాడు గొప్పగా' మళ్లీ వస్తే ఎక్కడ పట్టుకుంటామోనని మొహం తప్పించుకొన్నాడు ఆ రావుగారు

ఆ రాత్రికి బయల్దేరుతానన్నాను ఇంకో రెండు రోజులుండి వెళ్ళమంది అత్తయ్య రావు గారితో చెప్పి యింకేదైనా వుద్యోగ ప్రయత్నం చేదామంది ఎందుకనో నాకు మనస్సంగీకరించలేదు ఈ వుద్యోగం గురించి ఆశ నిరాశల మధ్య వూగిన నాకు మనశ్శాంతి లేకుండా పోయింది అందుకనే వూరికి వెళ్ళిపోవాలనుకున్నాను ఇక నాకు ఉద్యోగం రాదు నా చదువు వ్యర్థం నా బతుకు వ్యర్థం సాయంకాలం వరకు రెండో గదిలో అశాంతిగా

# ఆదా చేయండి రు.11లు!




పోస్టుద్వారా భారతి తెప్పించుకోండి!

ఆఫ్‌సెట్ ముద్రణలో భారతి !

భారతి సంవత్సర చందా (పోస్టు ద్వారా రు 51/-లు) ఒకేసారి చెల్లించే వారికి రు 11/-ల 'ముదరా వుంటుంది

**అంటే మీరు కేవలం రు 40/-లు చెల్లిస్తే ప్రతినెలా భారతి పోస్టు ద్వారా మీ ఇంటికే అందుతుంది**

చందా పైకమును ఆంధ్రపత్రిక, గాంధినగరం, విజయవాడ-3కి మనియార్డరు లేదా డిమాండు డ్రాఫ్టు ద్వారా పంపుతూ ఈ దిగువ కూపను జతపర్చ కోరుతాము

---

**నేను 'భారతి' మాసపత్రికకు చందాదారునిగా చేరదలుచుకున్నాను చందా పైకము రు 40/- డి డి / ఎం ఒ ద్వారా పంపుతున్నాను**

పేరు ____________________

ఊరు ____________________

చందాదారుని సంతకం

గడిపాను   పాపం అత్తయ్య కూడ నన్ను డిస్టర్బ్ చేయలేదు

రావంకుల్ వచ్చాడంటూ పిల్లలు గోల చేశారు ఆయనగారు చెప్పేదేమిటో నాకు తెలుసు అందుకని గదిలో నే వుండిపోయాను

సత్యం అదృష్టవంతుడివిరా? నీకు వుద్యోగం వచ్చిందట రావుగారు రమ్మంటున్నారు అంటూ ఎంతో సంతోషంగా వచ్చి అత్తయ్య నన్ను కుదిపింది నిజమా! నేను నమ్మలేకపోతున్నాను గదిలోంచి బయటకొచ్చాను రావు గారికి నమస్కారం పెట్టాను

నిన్న రాత్రే చెప్పానయ్యా నీ సంగతి తప్పకుండా నిన్ను సెలెక్ట్ చేస్తానన్నాడు డైరక్టర్ గారు ఓ గంట క్రితం మళ్ళీ ఫోన్ చేసి కనుక్కున్నాను నిన్ను సెలెక్ట్ చేశామని బొంబే హెడ్డాఫీసులో నీవు ట్రెయినింగ్ కోసం వెంటనే వెళ్ళాలని రేపు వెళ్తే నీకు ఆర్డర్ యిస్తామన్నారు ఏమయితేనేం అదృష్టవంతుడివి అంటూ సిగరెట్ వెలిగించారు రావుగారు

నాకు నోట మాట రాలేదు కృతజ్ఞతాభావంతో తలవంచాను సంతోషంతో గుండె లయ తప్పుతోంది

స్వీట్ అందుకోండి రావుగారూ! అంటూ అత్తయ్య ఒక ప్లేట్లో స్వీట్లు తెచ్చి పెట్టింది.

"అమ్మో! 'స్వీటే'!" అంటూనే ఒక ముక్క అందుకున్నారు నవ్వుతూనే రావుగారు....

కొంపతీసి భూకంపం లాంటిది కాదు కదా!



# సమిధ

ఇక వస్తా! సుందరిగారూ!! వస్తానయ్యా సత్యం వెంటనే రేపు వెళ్ళి ఆర్డర్ తెచ్చేసుకో అంటూ లేచారు రావుగారు అలాగేనంటూ మరోసారి నా కృతజ్ఞతలను తెలుపుకున్నాను

గేటు వరకు మా అత్తయ్య వెళ్ళి రావుగారికి వీడ్కోలు చెప్పింది రావుగారు నవ్వుకుంటూ వెళ్ళి టయొటా లో కూచున్నారు చేయి వూపుతూ శెలవు తీసుకున్నారు రావుగారు

రావు గారిని పొగిడాను భగవంతుడన్నాను! అత్తయ్య ఎంతో సంతోషించింది రాత్రి మామయ్య యింటి కొస్తూనే నా వుద్యోగం సంగతి చెప్పింది అత్తయ్య వెరిగుడ్ అంటూ మళ్ళీ ముసుగు తన్నేశాడు మామయ్య మళ్ళీ అదే వాసన ఆ రాత్రి పొద్దుపోయే వరకు అత్తయ్య నేను పెద్దోడు వూసు కబుర్లతో గడిపాం

తెల్లారింది ఎప్పుడెప్పుడు పది గంటలవుతుందా? ఫ్యాక్టరి కెళ్ళి ఆర్డర్ తెచ్చుకోవాలి తొమ్మిది గంటలకే టిఫిన్లు ముగించి రోడ్డున పడ్డాను ఆటోలోనే ఫాక్టరి కెళ్ళాను అప్పటికే ఆఫీసు తెరిచి వుంది పర్సనల్ మానేజర్ని కలిశాను అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ యిస్తూ బెస్ట్ ఆఫ్ లక్ అని కరచాలనం చేశారు ఆయన వెంటనే బొంబే కెళ్ళి జాయినవ్వాలని రైలు చార్జీలు అక్కౌంట్స్ డిపార్ట్‌మెంట్ కెళ్ళి తీసుకోమన్నారు ఫస్ట్ క్లాస్ చార్జి యిచ్చారు ట్రెయినింగ్ పిరియడ్ మూణ్ణెళ్ళు నెలకు వెయ్యి రూపాయలు స్టైపండ్ ట్రెయినింగ్ పూర్తయ్యాక రెగ్యులర్ అపాయింట్‌మెంట్ అపుడు నెలకు పదకొండు వందల వరకు జీతం... ఎన్నెన్నో "పెర్క్స్"... రావుగారు భగవంతుడి రూపంలో కన్పించారు... నన్ను ఆదుకున్నారు..." బొంబే రేపే వెళ్ళండి... వెంటనే జాయినవడం... మీకు అన్ని విధాల

మంచిదన్నారు ఛిఫ్ ఫైనాన్స్ మేనేజర్‌గారు ప్యాక్టరి నుండి బయట పడ్డాను నాకు ఎగిరి గెంతేయాలని నడిరోడ్లో ఎచ్చి ఎచ్చిగా గెంతు తేయాలని వుంది

ఇల్లు చేరుకుని అత్తయ్యకు నా వుద్యోగ వివరాలు గురించి వివరించాను ఆమె కూడా రేపె వెళ్ళి పొమ్మంది నాన్నగారికి మళ్ళి తెలుపొచ్చుని అంది రేపు మినార్ కు నా ప్రయాణం వెంటనే పోస్టాఫీసు కెళ్ళి నాన్నగారికి కూడ వుత్తరం రాసేశాను నాన్న గారెంత సంతోషసా్తరో!

ఆ రాత్రంతా నాకు కలత నిద్ర బవిష్యత్తుపై ఎన్నో ఆలోచనలు సరికొత్త జీవితం

ఆ వుదయం ఎంతో ప్రశాంతంగా వున్నాను నేను అత్తయ్య రావు గారింట కెళ్ళాం అతడి దగ్గర శెలవు తీసుకున్నాను

బాంబే కెళ్తూనే వుత్తరం రాయమంది అత్తయ్య ఎల్లలతో స్టేషన్‌కు వచ్చింది రైలు కదులుతూంటే అత్తయ్య కంట్లో తడి కనిపించింది ఫస్టుక్లాస్ ప్రయాణం జీవితంలో మొదటసారి అదో గర్వంగా వుంది

బాంబే చేరాను హెడ్డాఫీసు కెళ్ళి 'ఆర్డర్స్ చూపించాను ట్రెయినీగా వెంటనే నమోదు చేసుకుని వాళ్ళు హాస్టల్లో సిటిచ్చారు కూడాను

ముందు అత్తయ్యకు వుత్తరం రాశాను రావుగార్ని అడిగినట్లు చెప్పమన్నాను నాన్న గారికి కూడ రాశాను 'ట్రెయినింగ్ అయిపోతూనే వస్తానని రాశాను పోస్టులో పెన్ను రంగు దారాలు పంపాను

ట్రెయినింగ్ క్లాసెస్ మొదలయ్యాయి మొదట్లో కొత్తగా వున్నా, వాతావరణానికి అలవాటు పడిపోయాను ఓ నెల గడిచిపోయింది మొదట్లో అత్తయ్య నుండి వుత్తరాలు వచ్చేవి కాని తగ్గిపోయాయి రాను రాను అత్తయ్య కెన్ని సంసార బాధ్యతలో మామయ్యకు తాగుడు ఎక్కువయి జబ్బు పడ్డాడేమో?

ఓ సారి నాలుగు రోజులు శెలవులు కలిసొచ్చాయి కొలీగ్స్ అందరం కల్సి పిక్నిక్ వెళ్దామనుకున్నాం ఓ బస్సు మాట్లాడుకున్నాం నాసిక్ కెళ్లాం త్రయంబక్ చేరుకున్నాం

ఎంతో ప్రశాంతమైన వాతావరణం దేవి గుళ్లోంచి గంటలు మోగుతున్నాయి గోదావరి నదిలో స్నానం చేయడానికి బయలుదేరాం చల్లటి చిరుగాలికి శరీరం పులకరిస్తోంది

నేను స్నానం చేయడానికని బట్టలు విప్పాను నదిలో దిగుతున్నాను పక్కనే అతడు పెరిగిన గడ్డంతో రావుగారు అతడి ముక్కును చూసి గుర్తుపట్టాను

రావుగారూ! అంటూ సంతోషంతో కేకేట్టాను

రావుగారు తలెత్తి చూశారు చూపులో అదో నిర్లిప్తత

సత్యానివి కదూ?

అవును అంటూ రావుగార్ని అకస్మాత్తుగా




కలవడంతో నాకు నోట మాట రాలేదు సంతోషంతో ఉక్కిరి బిక్కిరయ్యాను

మిరిలా!

రావుగారు మౌనంగా వుండిపోయారు

మా సుందరత్తయ్య వాళ్ళెలా వున్నారు రావుగారూ!

రావుగారి చేతిలో సంచి వుంది అందు లోంచి చిన్న మూటను తీశారు అందులోంచి అస్థికలు తీసి పవిత్ర గోదావరిలో కలిపారు

మి అత్తయ్య అదిగో సత్యం అంటూ బోరున ఎడ్చేశారు రావుగారు

అత్తయ్య చనిపోయిందా? రావుగారు అస్థికలు కలుపుతున్నారంటే వాళ్ళిద్దరి అనుబంధం ఏమిటో తెలిసిపోయింది చెప్పలేని బాధ నా అంతరాంతరాల్లో ఎక్కడో లోతుగా కదులుతూ అశాంతిని కల్గిస్తోంది ప్రశాంత మానస సరోవరంలో నికి ఓ రాయి విసిరింది అత్తయ్య

అత్తయ్య చనిపోయిందంటే నమ్మలేని నిజం ఎలా చనిపోయింది? ఎందుకు చనిపోయింది? అనేవి ప్రశ్నలు కావు ఆమెలో యింత అపవిత్రతకు చోటుందా?అనేది సమస్య ఆ సమస్యకు మూలం బీదరికం బీదరికానికి పరిష్కారం వారి అనుబంధం

అయినా!

ఇప్పుడు నా దృష్టిలో వారి అనుబంధాన్ని నీచంగా వూహించుకోలేక పోతున్నాను

ఇంటర్వ్యూ గురించి వెళ్ళినప్పుడు అత్తయ్యకు రావుగారికి సంబంధం వుందని తెలిస్తే యీ వుద్యోగాన్ని నిరాకరించేవాణ్ణి అత్తయ్యను క్షమించేవాణ్ణి కాదు

రావుగారు పుణ్య పురుషుడు ఇల్లాలు కాకపోయినా తనతో బంధం పెంచుకున్న స్త్రీ కోసం ఆమె పుణ్యగతుల కోసం కర్మలు చేస్తున్నాడు కాని రావుగారికి ప్రస్తుతం ఓదార్పు కావాలి ఆ శక్తి నాకుందా? భగవాన్! ప్రసాదించవూ!! □

# రెడి. సీరియల్



## ఇచ్ఛాపురపు రామచంద్రం

(గత సంచిక తరువాయి)

రామారావ్ ఎమ్ కామ్ ఫైనలియర్‌లోకి వొచ్చేసరికి – పాపారావ్‌కి ఉద్యోగం పోయింది ఎభై ఐదేళ్ల క్లాజు వల్ల ఆ వేళ పాపారావ్ పిచ్చివాడే ఐపోయాడు పిట్‌లాగ వొచ్చేసి నిరుద్యోగ నిర్మూలనంటే ఉద్యోగంలో ఉన్నవాళ్ల కడుపు కొట్టడం కాదు కొత్త ఉద్యోగాలు సృష్టించడం నన్ను ముందుగా రిటైర్ చేయించిన వాడికిదే నా సవాల్ చేతనయితే – నా ఉద్యోగాన్ని నా కొడుక్కిచ్చి నాకు చేసిన చాలా అన్యాయానికి – కొంచెమయినా న్యాయం చెయ్యమను నేను నోరు మూసుకుంటాను ఉద్యోగం పీకేడం కాదు గొప్ప ఉద్యోగం వెయ్యడం నాశనం ఎవరేనా చెయ్యగలరు నిర్మాణం కొందరికే సాధ్యం నా వుసురు నీకు కొట్టక మానదు మి మంత్రుల కక్కరలేని వయోపరిమితి పదవీ విరమణ వయస్సు – మాలాటి బోడి గుమాస్తాల కెందుకు? ఇది అన్యాయం దారుణం కొర్చులు మి తొత్తులు కనుక యిలా చేయగలిగారు ఇక్కడితో సరికాదు ఇందరి కడుపులు కొట్టిన పాపం వూరికే పోదు రేపు – బగవంతుడి పంచాయితీలో నీకేం శిక్ష పడుతుందో తెలుసుకో రౌరవాది నరకాల పాలవుతావు దేముడున్నాడు అందరినీ ఓ కంట కనిపెడుతూనే ఉంటాడు అంటూ చిందులు తొక్కుతూ అరవసాగాడు

షాక్ అన్నాడు డాక్టరు – సెడెటివ్ ఇంజక్షను చేస్తూ కొన్ని నిముషాలకి పాపారావ్ నిద్రపోయాడు జాగ్రత్తగా చూసుకోండి వయస్సు మీరింది బి పి ఉంది ఆయన మనసు కష్టపెట్టకూడదు అంటూ మందులు రాసి రామారావ్‌కి చీటి యిచ్చాడు వెళ్తూ

రామారావ్ నిశ్చలంగా ఉండిపోయాడు అతని కనిపించింది- డాక్టరు బ్లడ్ ప్రెషరని డయాగ్నైజ్ చేశాడు కాని నిజంగా తన తండ్రికి వొచ్చిన జబ్బు జాబ్ ప్రెషర్ ఆయన మనసు కష్ట పెట్టకుండా ఉండడం తమ తరంకాదు. ఉద్యోగం పోయిందన్న బాధ మళ్లీ ఉద్యోగం వొస్తే తప్ప తగ్గదు జీతం లేకుండా యిల్లెలా గడుస్తుందని అసలు బయం దానికి ఎవరూ జవాబు చెప్పలేరు పరిష్కారం చూపలేరు ఆయన చేసిన తప్పు – తనని ప్రొఫెషనల్ చదువుకి పంపక పోవడం అప్పు చేసయినా చదివించవలసింది అన్నట్టు నాన్నకి ఉద్యోగం లేదు కదా తన ఎమ్ కామ్ ఏం కాబోతూంది? ఈనగాచి నక్కలపాలు చేసినట్టు- సెకండియరు వరకూ వొచ్చి ఆపేయవలసి రాదు కద? ఎమ్ కామ్ ఏదో ఉద్ధరిస్తుందని కాదు బి కామ్ కంటె నయమని గుడ్డికన్ను మెల్ల నయమని

జీతంతో యిల్లు గడవడం లేదు– అనే వాడు నాన్న జీతంతో గడవని యిల్లు పెన్షన్‌తో నడుస్తుందా? అసలు – పెన్షన్ వొస్తుందా? ఎప్పటికి? ఎంత? ఎందుకయినా మంచిది తను – మానసికంగా సిద్ధపడి ఉండడం మంచిది తన చదువు ఆగిపోవచ్చు

అసలు – తన చదువు కంటూ ఔతున్న ఖర్చేముంది ఫీజులు తప్ప? పుస్తకాలకి – ప్రండ్సు లైబ్రరీనే ఆశ్రయిస్తున్నాడు ఫీజులే కదా? లేదు ఆపెయ్యకూడదు తన చదువాపి వెయ్యకూడదు ఎమ్ కామ్ అనిపించుకోవాలి కునికే నక్క మీద తాటి పండులా – నాన్నకిప్పుడే ఉద్యోగం పోవాలా? కనీసం మరొక్క ఏడాది తన చదువై పోయే వరకూ అయినా ఉంటే ఎంత బాగుండేది!

★ ★ ★ ★ ★

మరొక్క సంవత్సరం ఎలాగో కళ్లు మూసుకుంటే ఇంజినీరింగ్ డిగ్రి చేతికి వొచ్చేస్తుంది చదువుకోవలసిన న్యూసెన్స్ తప్పుతుంది ఇంజినీరింగ్ మరీ బోర్ ఎలా బరించాడో యీ నాలుగేళ్లూ అఫ్‌కోర్స్ తను-లైఫ్ ఎంజాయ్ చేయడం లేదని కాదు కాని యీ చదువు మాత్రం విసుగే

పరీక్షల ముందు – వెంకటేశ్వరరావ్ వొచ్చారు

హలో డాడి! హౌ డుయుడు? పలకరించాడు నిఖిల్

బాగానే ఉన్నాం నేను మి అమ్మ నువ్వెలా ఉన్నావ్?

ఫైన్ వెరి ఫైన్ నవ్వాడు

ఊఁ పరీక్షలు దగ్గర పడ్డాయి

బాగానే చదువుతున్నాను డాడ్

మరి ఎక్కువ శ్రమపడకు అన్నట్టు – నీకు అమెరికాయిష్టమా రష్యానా జపానా జర్మనీయా?

ఆశ్చర్యంగా చూశాడు తండ్రి ప్రశ్నకు ఏమిటి డాడీ?

నువ్వు వెళ్లబోతున్నావు చదువు నెపం మీద ఒకసారి ఫారిన్ వెళ్లిరాబోతున్నావు నిజానికది –ప్లెషర్ ట్రిప్పే అనుకో కాని – నిన్ను పంపేది ప్రభుత్వం కదా అందుకు చదువు ముసుగు మినిష్టరు – నవ్వారు గంబీరంగా నిఖిల్‌కి అర్థమైపోయింది థాంక్యూ డాడ్ థాంక్యూ వెరిమచ్ రష్యా – కమ్యూనిస్ట్ కంట్రీ లైఫుండదు జపాన్ మరి ఇండస్ట్రియలైజ్‌డ్ జర్మనీ – వన్స్ రూయిన్డ్ అమెరికా బాగుంటుంది డాడీ హాలివుడ్

జరిగిన కథ- 6 నిఖిల్ రెసిడెన్సియల్ స్కూల్లో రామారావు మామూలు బడిలో చేరారు ఎంకటేశు బ్రతుకు బడిలో పాఠాలు అబ్యసిస్తున్నాడు రెండున్నరేళ్లు గడిచిపోయాయి నిఖిల్ రామారావ్ తమ తమ స్కూళ్లలో చదువుకుంటున్నారు ఎంకటేశు కంపెనీలో పనికి చేరాడు నిఖిల్‌కి క్రీడలంటే ఆసక్తి ఎక్కువ రామారావు మంచి మార్కులతో క్లాసులో ప్రథముడిగా ఉంటున్నాడు కంపెనీలో ఘోర ప్రమాదానికి గురైన శంకరం శరీరం చూసి ఎంకటేశుకి జ్వరం వచ్చింది పాపారావుకి తన కొడుకు రామారావే ఆశాకిరణం వెంకటేశ్వరరావు తన కొడుకు నిఖిల్ కొసం తాను ఎమ్మెల్యే కావాలనుకుంటాడు నిఖిల్‌కి అమ్మాయిల స్నేహం ఎక్కువయింది రామారావు ప్రేమ ఫలించలేదు ఎంకటేశుకి ప్రేమకన్నా బ్రతుకు ముఖ్యం చేసే కూలి పని ఉంటుందో ఊడుతుందో అని బెంగపెట్టుకున్నాడు నిఖిల్ డబ్బు, పలుకుబడి ఉపయోగించి ఇంజనీరింగ్‌లో చేరాడు రామారావు బి కామ్‌లో ఎనభై శాతం మార్కులు వచ్చినా ఆర్థిక ఇబ్బందుల వల్ల ఉన్న ఊర్లో ఎమ్ కామ్ లో చేరాడు

చూడొచ్చు థ్రిల్లింగ్‌గా ఉంటుందక్కడ లైపే ఐ లైక్ అమెరికా!

సరే మరి నేను వెళ్ళొస్తాను

రైట్ డాడీ

నిఖిల్ – నలుగురి ఫ్రెండ్స్‌ని పిలిచి పార్టీ యిచ్చాడు ఆనందంతో

* * * * *

ఏం చెయ్యాలో అర్థం కాలేదు ఎంకటేసుకి వాళ్ల కౌన్సిలరు దగ్గరకి తనొక్కడే వెళ్లాడు వెళ్లి – సంగతి చెప్పుకున్నాడు అతను వినినట్లు నటించాడు

ఎంకటేసూ! ఎనకబడ్డ కులమయినంత మాత్రాన చాలదు అలా మనం కాయితం చూబించగలగాలి

ఎక్కడుంటుంది కాయితం?

ఆఫీసులో ఉంటుంది మునిసిపలూ తాలూకాపీసుల్లో ఉంటుంది

తెచ్చి పెట్టన్నా నీకు పున్నెముంటుంది

బొళ్ళున నవ్వేశాడు కౌన్సిలరు అదేం మాటలతో

పనేటి? మదుపు పెట్టాలి

ఎంతవుద్దేటి?

నువ్వు పుట్టినట్లు రికార్డు సృష్టించాల దానిలో నీ కులం ఏయించాల పాత రికార్డు ఓ పది వందలౌతుంది తేలిగ్గా అనేశాడు

పదొందలే!

పోనీ ఒక వెయ్యి



ఎందుకన్నా అంత? నేను పుట్టాను కనపడుతూనే ఉన్నాను అమ్మా అయ్యా కద జాతివోళ్ళు ఆళ్ళకి పుట్టిన నేనూ ఆ జాతివోణ్ణే కదా ఇవన్నీ సత్యమే కద

నిజం – కాగితం మీద కనిపించాల సర్కారు కాగితం మీద కనిపించాల అప్పుడే అది సత్యమౌతుంది ఇలువుంటుంది

సర్కారు కాయితం – ఎయ్యి రూపాయిలు!

ఎయ్యి రూపాయలు జన్మలో కళ్ళ చూడగలడా ఒక్క సారయినా? అంత దబ్బే ఉంటే దానితో కాయితం ముక్క తెచ్చుకోడం దేనికి? యాపారమే చేసుకోచ్చు హాయిగా బతకొచ్చు వెయ్యి రూపాయలంటే ఎంతో సరిగ్గా తెలీదు ఎంకటేసుకి చాలా ఎక్కువని మాత్రమే తెలుసు తనలాటి వాళ్ళకి అంత దబ్బొక్కసారి చూడడం కూడా తటస్థించదని తెలుసు అయ్య చెప్పింది నిజివే అన్న మాట ఐదో పదో అయితే – అయ్యకి తెలియకుండా యిచ్చుకుందామనుకున్నాడు

తను కౌన్సిలరు దగ్గర కెళ్ళినట్టు అయ్యకి చెప్పలేదు ఎంకటేసు

# 14

నిఖిల్ అమెరికా వెళ్ళి ఓ సంవత్సరం అక్కడున్నాడు – ప్రభుత్వం వారి ఖర్చుతో సాంకేతిక విద్య నభ్యసించే నెపం మీద అతను తిరిగి వొస్తున్నాడు వెంకటేశ్వరరావ్ గారితో పురప్రముఖులు కూడా పదిమంది వరకూ వెళ్ళారు ఎయిర్ పోర్ట్‌కి – నిఖిల్‌ని రిసీవ్ చేసుకుందుకు ఔను నిఖిల్ – మినిష్టరు గారబ్బాయి పారిన్ రిటర్‌ఖడ్

సాయంత్రం –టౌన్ హాలులో బ్రహ్మాండమైన స్వాగత సభ ఏర్పాటయింది పట్నంలోని – లయన్స్ వంటి సేవా సంస్థలు చాలా కలసి – నిఖిల్‌కి స్వాగతం పలికేందుకు సన్నాహాలు చేస్తున్నారు అట్టహాసంగా మైకులు పెద్ద శబ్దంతో సినిమా పాటల వర్షం కురిపించేస్తున్నాయి రోడ్ము మీద నడిచే ప్రజల మీద రంగురంగుల కాగితాలతో స్వాగతం బోర్డు – తయారౌతూంది

అదే సమయంలో –

రామారావ్ – పెద్ద క్యూలో మద్యన ఉన్నాడు

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలో తమ పేరు నమోదు చేయించుకుందుకు ఆత్రత పడుతున్న – విద్యావంతులు నేటి యువతరం అక్కడ క్యూ కట్టి నిలుచుంది పైన ఎండ నిలుచుని నిలుచుని కాళ్ళు పీకులెడుతున్నాయి కాని – ఒక్కసారి క్యూని వదిలి బయటకు వెడితే మరి మళ్ళీ ప్లేసు దొరకదు – చివరన తప్ప అందుచేత నోరెండి పోతున్నా – ప్రాణాలుగ్గ బట్టుకుని – తమ వంతు ఎప్పుడా అని అసహనంతో – విదిలేక నిరీక్షిస్తున్నారు – కాలేజిల నుంచి యూనివర్సిటీల నుంచి – జీవిత రణ రంగంలోకి అడుగు పెట్టబోతున్న పూర్వ విద్యార్థులు ప్రతి వారి చేతిలోనూ సర్టిఫికేట్లు గ్రాడ్యుయేట్లు పోస్ట్‌గ్రాడ్యుయేట్లు అండర్ గ్రాడ్యుయేట్లు టెక్నికల్ నాన్ టెక్నికల్ స్కిల్డ్ అన్‌స్కిల్డ్

అందరూ ఆత్రంగానూ అసహనంగానూ నిలుచున్నారు క్యూలో క్యూ – మెల్లగా చాలా మెల్లగా కష్టాలలో ఉన్న వారికి కాలంలా – బారంగా కదులుతోంది రామారావ్‌కి తన మీద తనకే జాలి వేసింది కొంచెం కాలం కిందట

యూనివర్సిటీ తనకి ప్రత్యేక ఆహ్వానం పంపింది– స్నాతకోత్సవానికి హాజరై ఎమ్ కామ్ డిగ్రీ తీసుకోమని మెరిట్‌లో వొచ్చినందుకు అలాగ ఆహ్వానించబడడం ఎంతో గర్వమనిపించింది అప్పుడు ఆ గర్వమంతా యిప్పుడు కరిగిపోతూంది క్యూలో అనామకుడిలా అందరిలోనూ వొకడిగా గంటల తరబడి నిలుచునేసరికి తానేమిటో – చేదుగా తెలిసి వొస్తూంది

ఎట్టకేలకు అతని వంతు వొచ్చింది సర్టిఎట్లందించి క్లర్కు అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పి యివతలకి వచ్చేసరికి – చాలా నరసంగా నిస్పృహగా అనిపించింది కాఫీ తాగుదామన్నా జేబులో డబ్బుల్లేవు కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడు ఎక్కడేనా కొంచెం సేపు కూర్చుంటే బాగుండుననిపించింది ఎక్కడ కూర్చుంటాడు? ఏమని కూర్చుంటాడు? అతనలాగే కాళ్ళీడ్చుకుంటూ నడవసాగాడు అప్పటికి సాయంత్రం నాలుగౌతూంది

మీటింగ్ మొదలవబోతూంది ఆహూతులకి టీ యిస్తున్నారు రోడ్ము మీదకే కనపడుతూంది హాలులో ఏం జరుగుతున్నది ఇంకా నిఖిల్ రాలేదు రాబోతున్నాడు

రామారావ్ అటు చూశాడు మీటింగు కనుక ప్రవేశాని కభ్యంతరం ఉండదు టీ యిస్తే వాళ్ళకి మనసులో కృతజ్ఞతలు తెలుపుకోవచ్చు ననుకుంటూ– తెగించినట్టు అటువేపు నడిచాడు వొక్కసారి తన బట్టల వేపు చూసుకుని పరవాలేదు మరి చెడ్డగా లేవు అందరితో పాటూ అతనికీ టీ యిచ్చారు మనసులో అనుకోటయిన థాంక్స్ పొరపాటున బయటికే అనేసి గబగబ టీ తాగేశాడు ఆరాటంగా ఒక కాళీ కుర్చీ– ఫ్యాను కిందది చూసుకుని కూర్చున్నాడు ప్రాణం తెరిపిన పడ్డట్లని ఎంచింది సుఖంగా పీలయ్యాడు అతని పక్క కుర్చీలో యువకుడే కూర్చున్నాడు అతని చేతిలో తెలుగు నవలుంది దాని కింకో అట్టుంది అట్టమీద అమ్మాయి బొమ్మ మహ అందంగా ఉంది విత్ యువర్ కైండ్ పర్మిషనంటూ దాని నందుకున్నాడు అట్ట వెనుక చూశాడు కథా సంగ్రహం మూడు వాక్యాలలో నవల సారం ప్రయత్నించాలే కాని కండక్టరు కొడుకు కలక్టర్ కాగలడు కండక్టరు కొడుకు కండక్టరే కానక్కర లేదు కృషితో నాస్తి దుర్భిక్షం

తృప్తిపడ్డాడు రామారావు నిజంగా కండక్టరు కొడుకు కలక్టరు కాగలడా? తను– క్లర్క్ కొడుకు రిట్రెంచ్‌డ్ క్లర్కు రిటైర్డ్ క్లర్క్ కొడుకు క్లర్కు కొడుకయిన తను– కలక్టరు కాగలడా?

ఎందుకు కాలేడు? ఐ ఏ యస్ లో సెలక్టయితే సరి కావొచ్చు కాని– అయ్యేయస్ పైపైన ఉందా? ఉహుఁ తను కష్టపడి చదవగలడు అందుకు సందేహం లేదు ఇది– మంచి అవకాశం నిజంగా మంచి అవకాశం

ఐ ఏ యస్ కి ప్రపేరవాలి ఔను

థాంక్స్ టు తెలుగు నవలా! అనుకుని మరోసారి అట్టమీద బొమ్మని చూసేసి నవలను తిరిగి యిచ్చేశాడు ఇంత చిన్నవయసులో అంత చదువు పారిన్ రిటర్న్‌డ్ నిఖిల్ సామాన్యుడు కాడు పైకలా కనిపిస్తున్నాడు కానీ అతని పుట్టిన తేదీ ఎదనుకుంటున్నారు? ఇరవయ్యారేళ్ళ కింద– సరిగ్గా యిదే రోజు మహత్తర సత్యాన్ని చెప్పినట్టు చెబుతున్నాడు వక్త



రామారావ్ తుళ్ళి పడ్డాడు తన పుట్టిన రోజా యివేళ సరిగ్గా ఆ తేదినే- నిఖిల్ జన్మించిన తేదినే తనూ జన్మించాడు ఇంట్లో పరిస్థితులు బాగులేక వాళ్ళూ తనూ కూడామరచి పోయారాసంగతి

అలాగ ఆ రోజే పుట్టిన వాడు- ఆ హాలులోనే మరొకడున్నాడని రామారావ్ కి తెలియదు వాడిది అదే పుట్టిన తేది అనీ తనది నిఖిల్ యీడేననీ అతనికి తెలియదు వాడు- ఎంకటేసు

ఎంకటేసు అంతవరకూ ఆ హాలులోకి బెంచిలూ బల్లలూ మోశాడు ఇప్పుడు హాలులో ఒక మూల కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు బల్లలు మోసి మోసి చాలా అలసి పోయాడు మీటింగయిపోయాక- మళ్ళీ వాటనన్నిటినీ బయటికి మొయ్యాలి- వాడు మీటింగు జరిగే అంతసేపే వాడికి విశ్రాంతి దానిని వాడు వృధా చెయ్య దలుచుకోలేదు

వేదికమీద- వక్తలు- నిఖిల్ ని తెగ పొగుడు తున్నారు మినిస్టరు గారిని పొగిడే అవకాశం రాదేమో వారబ్బాయిని పొగిడే అవకాశం వొచ్చినందుకు దానిని పూర్తిగా వినియోగించేసుకోవాలని విపరీతంగా ప్రయత్నిస్తున్నారు వింటున్న రామారావ్ కి చిరాకేసింది వక్త మహానుబావా! నిఖిల్ కంటె నువ్వు తెగ పొగుడుతున్న నిఖిల్ కంటె చాలా ఎక్కువ మార్కులు తెచ్చుకున్నవాడు నీ ఎదురుగానే ఉన్నాడు అవకాశాలు అణచివేసి అనామకుడిలా పడున్నాడు- అని అరవాలనిపించింది అతను- కాళ్ళ పీకు తగ్గటంతో- లేచి- బయటకు వెళ్ళిపోయాడు- మీటింగయ్యాక మళ్ళీ టీ యివ్వరు కదాని

వక్త నిఖిల్ ని పొగుడుతూంటే- ఎంకటేసుకి చిరాకెయ్యలేదు ఎందుకంటే వాడు గోడకి చేరబడి- హాలవతల నిద్ర పోతున్నాడు మైకు గట్టిగానే అరుస్తూందక్కడికి కాని- వాడు మరి గాడంగా నిద్రపోతున్నాడు అందుచేత వాణ్నేమి చెయ్యలేక పోతూంది వక్త ఉపన్యాసాన్ని వర్షంలా కురిపించేస్తున్న మైకు అలసి సొలిసిన వాడు మైకాతీతంగా నిద్రపోగలడని నిరూపిస్తున్నాడు వాడు ఎంకటేసుకి- బల్లలు మొయ్యడం పని కొత్త వాడు- శాయశక్తులా ప్రయత్నించాడు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలోనే ఉండి పోదామని కాని- యాజమాన్యం వొప్పుకోలేదు

నిన్నింతవరకూ ఉండనివ్వడమే పొరపాటు నీకేమి తక్కువ వయసుండదు పాతికేళ్ళుంటాయి- ఉరమరికెగా అన్నారు పెద్దవాళ్ళని పనిలో ఉంచుకుంటే చాలా నష్టాలు వాళ్ళకి ముఖ్యంగా- ఎక్కువ కూలీ యిమ్మంటారు యూనియన్లంటారు సమ్మె లంటారు పిల్లలైతే యీ గొడవ లేవీ ఉండవు ఓ బిస్కట్ ముక్కో టీ చుక్కో పోస్తే చాలు- ద్విగుణీకృతమయిన ఉత్సాహంతో పని చేస్తారు

కంపెనీ పని పోడంతో ఎంకటేసు బతుకు- నీటి నుంచి వొడ్డున పడేసిన చేపపిల్లలా ఐపోయింది- యీ ఏడాది నుంచి

రిచ్చాలాగు అన్నాడు సింహాచలం

ఎంకటేసుకి ఎందుకో రిక్షా లాగడమంటే బయం అది తప్ప ఏపనయినా చేసేడానికి సిద్ధమే కర్రలు కొట్టాడు వ్యవసాయప్పనుల కెళ్ళాడు క్వారీలో రాళ్ళు కొట్టాడు ఏ పనీ స్థిరంగానూ శాశ్వతంగానూ ఉండేది కాదు రెండ్రోజులు పని దొరికితే రెండ్రోజులు కాళీ అయ్య తిట్టేవాడు చేతకాని చవటా అని

వాడికి బాదేసేది

ఎందుకు తిడతాడు అయ్య అలాగ? తనేం కష్టపడనన్నాడా? పన్జెయ్య నన్నాడా? పన్దొరకాలే కాని దేనికయినా సిద్ధమే పన్దొరక్కపోతే తన తప్పేమిటి? తనేటి చేస్తాడు?

తనకి- నాలుక్కాలాలపాటు నిలిచే పని దొరికితే అంటిపెట్టుకుని చెయ్యాలనే ఉంది కాని ఎవడూ యివ్వందే?

అయ్య కసలే నోరు జోరు ఎటంటాడో ఆడికే తెల్దు తాగేసొస్తాడేమో తెగపేల్తాడు

ఒరేయ్ బతకడం సేతకాని బడుద్దాయీ నిన్ను నువ్వేలాగా పోషించుకో లేవు నా మాటిని ఓ గుంటని కట్టేసుకో అదే నిన్ను పోషిస్తుంది అన్నాడు ఎంకటేసుకి సిగ్గూ ఏసింది పౌరుసమూ వొచ్చింది నేనేటంత సేతకానోణ్నిలా కనపడ తున్నానా నీ కంటికి? అని ఎదురు తిరిగాడు

సేతకానోడికి శవుర్య మెక్కువ నవ్వాడు సింహాచలం అయినా- నేనేటి తప్పుమాటన్నానని? పెళ్ళి చేసుకో మన్నా నంతేగా ఆ మాటే యిషమూ ముషిణి ఐపోయిందా? నువ్వేం మొగాడివి కావా పెళ్ళి చేసుకునే వొయసు రాలేదా?

పెళ్ళాం నన్ను పోషించేదేటి? నేనే దాన్ని పోషించ గలిగాలి అప్పుడే పెళ్ళి

ఓరి ఎర్రిమాలోకమా! అదేం పౌరుషంరా పెళ్ళాన్ని మొగుడే పోషించడానికి మన వేమైనా పెద్దోళ్ళమా గొప్పోళ్ళమా? ఆడదానికి మాత్రం నోటితో పాటు రెండు సేతు లివ్వలేదా బగమంతుడు? ఒరేయ్ ఎంకటేసూ అలాటి పనికిమాలిన పౌరుసాలకి పోయి బతుకు సెడగొట్టేసుకోమాక సేతులారా తినే నోరున్న ఎవళ్ళైనా పని చేసి పొట్టకు సంపాదించొచ్చు అందులో మగా డెక్కువా లేదు ఆడదాని తక్కువా లేదు నీకేం తక్కువ వయసు లేదు సరిగా పెళ్ళి చేస్తే యీ తలికి నలుగురు బిడ్డల్ని కనేవోడివి నువ్వు పుట్టాక నాలుగో ఐదో ఒట్లలచ్చన్నొచ్చాయి అంటే- యిరవయ్యేళ్ళ పైనే

ఎంకటేసుకి ఆ మాటలు నచ్చ లేదు తన కష్టంతో పెళ్ళాన్ని పోషించ గలిగేవరకూ పెళ్ళి చేసుకోడం యిష్టంలేదు వాడికి కాని అయ్య మాటల్లోనూ అంతో యింతో నిజం లేకపోలేదనిపించింది

## బొమ్మ-పశువు

పెళ్ళిచూపులప్పుడు
అమ్మాయి
షోకేసులో బొమ్మ!
అబ్బాయి
సంతలో పశువు!!
పెళ్ళయ్యాక
బాకీ కట్నం తెమ్మని
బాదలు
పెట్టేటప్పుడు
అబ్బాయి
కీలుబొమ్మ!!
అమ్మాయి
బలి పశువు!!!

— సింహం

## 15

ఏమిట్రా అది? పోస్టుమానేదో యిచ్చినట్లుంది? అడిగాడు పాపారావ్ అది అపాయింట్మెంటార్డరేమో అని అతని ఆశ

రిగ్రెట్ కార్డు వొళ్ళు మండుతున్నట్లు విసుగ్గాచెప్పాడు రామారావ్

ఏమిటో! పెద్ద తెలివయిన వాడివనుకున్నాను ఎన్నిసార్లు ఎన్ని పరీక్షలు రాసినా యింటర్వ్యూల కెళ్ళినా ఫలితం కనపడటంలేదు ఎప్పుడూ రిగ్రెట్ కార్డులే

లోపం నా తెలివితేటలది కాదు కత్తిలా కరకుగా ఉందతని కంఠం

మరెవరిది? ఆశ్చర్యంగా చూశాడు

నీది! నిర్భయంగా నిస్సంకోచంగా అన్నాడు

నాదా! నేనేం చేశాను మధ్య? తలపాగా చుట్టలేక తల వొంకరన్నట్లు

చూడు నాన్నా నా మేరకు నేను వ్రాత పరీక్షలూ ఇంటర్వ్యూలూ బాగానే చేస్తున్నాను ఉద్యోగం సంపాదించటంలో అవి తొలి మెట్లు మాత్రమే చివరి మెట్లు రికమెండేషనూ లంచమూ అవి సాధించవలసింది నువ్వు ఇవి నీ రోజులు కావని తెలుసుకో ఇప్పుడు కొడుక్కి ఉద్యోగం రాలేదంటే ఆ నేరం అతనిది కాదు తండ్రిది

వెర్రి మొహం వేశాడు పాపారావు

కొడుకు చెప్పింది అబద్ధం అనలేకపోయాడు కాని నిజమని అంగీకరించడానికి అహమూ పెద్దరికమూ అడ్డుపడ్డాయి దానితో ఎంత మాటన్నావురా! పెద్దా చిన్నా లేకుండా అంటూ అరిచాడు

నిజానికి పెద్దా చిన్నా ఉండదు

సరే నేనే వేయిస్తానుద్యోగం నీకు చేతకాదంటె

నువ్వు ఉద్యోగం వేయిస్తావా! ఓహో! ఏ కోమటి కొట్లోనో పద్దులు రాయడమేనా? హేళనగా నవ్వాడు

ఏం? అది నీకంత తేలిగ్గా ఉందా? నెలకి నూటయాభై యిస్తారు ఊరికే తిని కూర్చోడం కంటే ఆ మాత్రమేనా నయం కదా? గుడ్డి కంటే మెల్ల నయం

నేనేమి ఊరికే తిని కూర్చోడంలేదు -

మరేం రాచకార్యం వెలగబెడుతున్నారో తమరు?

ఐ ఏ ఎస్ కి ప్రిపేరవుతున్నాను

తెల్లబోయాడు పాపారావ్ తన కొడుకు చెప్పేది నిజమేనా?

నిజమే అని అతనికి ఆరు నెలల తరువాత నిరూపించబడింది

రామారావ్ ప్రిలిమినరీ పాసయ్యాడు!

ఐతే సగం కలక్టరయినట్లే మన కష్టాలు సగం గట్టెక్కినట్లే పొంగిపోయాడు

లేదు ముందున్నది ముసళ్ల పండుగ

అదేమిటి?

ఫైనల్ ఎగ్జామ్‌కి కేవలం యిక్కడ చదివితే చాలదు

మరి?

మద్రాసో ఢిల్లీయో వెళ్లి కోచింగ్ తీసుకోవాలి ఆరు నెలలు కోచింగ్ తీసుకున్నానో ఫైనల్ పాసయ్యే అవకాశాలు చాలా

## త్రివేణి

ఎక్కువుంటాయి

నగరంలో ఆరు నెలలు అంటే కనీసం మూడు నాలుగువేలు! అసాధ్యం అని చెప్పకనే చెబుతోందతని కంఠం అంతలోనే అతను ముఖ కవళికలు మార్చేసి నవ్వుతూ దగ్గరగా వొచ్చి భుజం మీద ప్రేమగా చెయ్యేసి రామం! నీ సత్తువ నీకు తెలియదు ఆ విషయంలో నువ్వు ఆంజనేయుడివే నువ్వు తలుచుకోవాలే గానీ యిక్కడ సాధించి పాసవగలవు అన్నాడు తను అతని తెలివితేటలని పూర్తిగా అంచనా వేసేసినట్లూ అభినందిస్తున్నట్లూ

నాన్నా! నీటిలో ఉన్నవాడిని నేను నాకు తెలుసు నా శక్తి నువ్వెందుకలా అంటున్నావో అదీ నాకు తెలుసు కాని ఒక్కటాలోచించు కారణాలేవైతేనేం నన్ను మెడిసిన్ చదివించలేకపోయావ్ ఇంజినీరింగ్‌లో చేర్పించలేకపోయావు గతం నాస్తి ఇది చివరి అవకాశం చిట్టచివరి అవకాశం నా అర్హత నీ అదృష్టాన్ని పరీక్షించుకునే వీలు కల్పించు అక్కడికి వెళ్లి కోచింగ్ తీసుకుంటే తప్ప కాంపిటిషన్‌లో రావడం ఇంటర్వ్యూలో నెగ్గడం నేను సాధించలేక పోవచ్చు ఐదారు వేలు నా జీవితమూ మన కుటుంబ పరిస్థితీ కూడా బాగుపడవచ్చు దీనికి వెనుకాడకు ఎలాగో ఒకలాగ

నా చివరి అవకాశాన్ని చేజార్చుకోకుండా అదృష్టాన్ని అర్హతని పరీక్షించుకొని బ్రతిమాలుకుంటున్నట్లే అన్నాడు రామారావ్ తండ్రి ముఖంలోకి అత్యంత ఆశగా చూస్తూ

పాపారావ్ యిరుకున పడ్డట్టు చూశాడు అతనికయితే కొడుకుని తప్పకుండా అలా పంపించాలనే ఉంది కాని - పరిస్థితులు కలసి రావడం లేదదేం దురదృష్టమో కాని నిజంగా రామం దురదృష్ట జాతకుడు

నీకు తెలియనిదేముందిరా మన యింటి పరిస్థితీ నా ఆదాయమూ? అప్పు పుట్టే పరపతి కూడా మిగలలేదు అవతల నీ అక్క పెళ్లీడు ఏనాడో దాటిపోయి కూర్చుంది వొస్తున్న పెన్షనూ కిరాణా కొట్లో జీతమూ వీటిలో ఎలా బతుకుతున్నామో భగవంతుడికే తెలియాలి నన్ను నమ్మరా అబ్బాయ్! నిజంగా నిన్ను కలక్టర్‌ని చేయాలనే ఉంది కాని కాని

రామారావ్‌కి తెలిసిపోయింది తన భవిష్యత్తు తేలిపోయింది తండ్రి తనని పైకి రానివ్వడు గాక రానివ్వడు కారణాలేవయితే ఏం? ఇటువంటి యింట్లో పుట్టడం తన కర్మ

(ఇంకా ఉంది)

కె ఏ ఏ ఆర్ పెండేకల్

★ ఉద్యోగంలో – ప్రమోషన్ కోసం స్కాలర్‌షిప్పుల కోసం ఒక కులం బయట సమాజంలో – ఇంకో కులం చెప్పుకుంటారెందుకు?

● కులం బలం ఎక్కువగా వున్నప్పుడిలాగే నాణెంలాగా వాడుతారు దాన్ని

జి ఏ ఆర్ దూసి

★ కులం మతం వీటితో సంబంధం లేని స్నేహం ఏది గొప్పది?

● స్నేహానికి ప్రేమకి– కుల మతాలతో నే కాదు అంతస్తులతో కూడా ఏం సంబంధం వుండదు కులం మతం చూసి స్నేహించడం– జాతకాలు చూసుకొని కట్నాలు చూసుకుని ప్రేమించడానికి ప్రయత్నించడం లాంటిదే

పి ఆర్ ఎమ్ కడప

★ 15–21 నవంబరు సంచికలో వరంగల్లు నుండి కె ఎస్ పి గారు విశాల దృక్పథంతో మిమ్మల్ని విమర్శించారు ఇలాంటి విశాల హృదయులు వుండబట్టే మైనారిటీ వర్గాల వారికి తప్ప మిగిలిన వారికి చస్తే పూడ్చుకోను స్థలం దొరకడం లేదు అంతా మనదే అనుకుని ఏది లేకుండా పోతుంది బావి కాలాల వారికి సెక్యులరిజం అనే చిప్ప చేతికిచ్చేలో పలె

● మీది మరి నిరాశా వాదం మూర్తిగారూ మైనారిటీ అదారిటీ కంటె హుకుమ్ ఎక్కువగానే వుంది కాని అంతమాత్రంచేత– తిరోగమనం దొరణిలో ఆలోచించడం తగదు హక్కుల కోసం పోరాడాలే గాని హక్కులున్న వారిని చూసి బాధపడడం– పొరపాటు కదూ?

పి ఆర్ గుంటూరు

★ స్త్రీని పూజింపవలసిన దేశంలో స్త్రీకే రక్షణ లేకుండా పోయింది ఎందుకంటారు?

● తొలినుంచి సాటి మనిషిలా చూడమని బోదించక పోవడం వల్ల – స్త్రీకి పవిత్రత అంటకట్టి పూజించడమో అపవిత్రత అంటకట్టి కాలరాయడమో అనవాయితీ అయిపోయింది మనిషిగ తప్ప యింకెలాగనా ఆడదాన్ని చూడొచ్చునన్న అలవాటు– స్త్రీ యీనాటి దిగజారుడుకి కారణం

డి ఏ ఆర్ హైదరాబాదు

★ బోర్ అంటే ఎవరు?

● మన మాట వింటే బాగుందు ననుకునేప్పుడు తెగ వాగేవాడే బోర్!

రమ, నరసరావుపేట

★ గత 5సంవత్సరాలలో దేశంలో నిరుపేదల సంఖ్య 10/ పెరిగిందని నేటి వార్త మరి కోటీశ్వరుల సంఖ్య?

● అంతే పెరిగి ఉంటుంది!




కె బి కోడూరు

★ దేవాలయి ముఖద్వారాలు తూర్పు దిక్కునే ఉంటా యెందుకు?

● సూర్యోదయం అయ్యేది అటే - కనుక శుభప్రదం అని

★ ప్రస్తుతం బాగా అబివృద్ధిలో ఉన్న దేవుడు మీ దృష్టిలో ఎవరు?

● డబ్బు? కాదా? డబ్బున్న దేవుడు

ఎస్ బి ఆర్ బోదన్

★ ప్రతి స్త్రీ అందంగా ఉండాలనుకుంటుంది ఎందుకు?

● ఇది మరి బాగుంది అందంగా వుండాలనుకోడం కూడా తప్పా?

పి కె పి 56 ఏ పి ఓ

★ నేటి ప్రజాస్వామ్యం గురించి మీ అబిప్రాయం?

● ఇంకేం ప్రజాస్వామ్యం మహాశయా? ఓడిపోయిన హితులని దొడ్డి దోవన రాజ్యసభ కెక్కిస్తూంటే!

జి ఏ ఎల్ మండవల్లి

★ కె రా గారూ ప్రతిఘటన సినిమాపై మీ అబిప్రాయం?

● సారి ఇంకా చూడలేదు ఇక్కడ అది ఆడుతున్న థియేటర్లో కూర్చుని చూడలేం - పబ్లిక్ లావెట్రీలా ఏ సి థియేటరు కంపు కొడుతుంది అందుకే తెలుగు సినిమాలు చూడలేకుండా వున్నాను!

సి ఏ కె ఎమ్మిగనూరు

★ మీకు చాలామంది ప్రేమికులు నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె లేనిదే బ్రతకను అంటూ ఉత్తరాలు రాస్తారు కదా వీళ్లలో పెళ్ళిళ్ళు అయ్యాక చాలామంది అసలా ప్రేమ విషయాన్నే మరిచిపోతారు

● అది నయమే కదా తమ్ముడూ లేకపోతే పెళ్ళాం దగ్గర నా ప్రేయసి నా ప్రేమ అంటూ వాగి వాగి విసిగిద్దురు!

జి ఏ పి రాజమండ్రి

★ మీ బర్త మీ ప్రవర్తనను శంకించి మిమ్మల్ని విడిచిపోయాడని నా అనుమానం

● ఇంకా లేదయ్యా వరప్రసాద్!

ఆర్ ఎమ్ ఆర్ వనస్థలిపురం

★ మనదేశంలో అవినీతి లేనిదెక్కడ?

● ఉండే ఉంటుందక్కడక్కడ కాని అవి కనిపెట్టడం కష్టం దుర్గంధం వ్యాపించినంత త్వరగా సుగంధం వ్యాపించదు కదా?

ఎన్ ఆర్ కె కాకినాడ

★ ఆడవారికి శోబన్‌బాబు అంటే చాలా యిష్టం మీకు?

● నాకూను ప్రేమ దృశ్యాలలో యుగళ గీతాలలో అసభ్య పోకడలు వుండవని

టి ఎమ్ హెచ్ మండపేట

★ మనిషి దేవునికంటే డబ్బుని ఆరాదిస్తున్నాడు కారణం ఎమిటి?

● ఏముంది బాయీ డబ్బు ఈనాడు దేవుడ్ని కూడా కొనేటంత బలమైనది కదా

వై హెచ్ ఆర్ గుంతకల్

★ బారతీయ సంప్రదాయం ప్రకారం బార్య బర్త యొక్క ఎడమ వైపున కూర్చోవాలి మీరు కుడి పక్క ఎందుకున్నారు?

● ఉంటే ఎమవుతుందో చూద్దామని! యీ సంప్రదాయాలు మనం సృష్టించుకున్నవే కద

ఎ ఎస్ ఆర్ బావదేవరపల్లి

★ ప్రబుత్వం మద్యపాన నిషేదం అంటూ ప్రకటనలు యిస్తుంది కాని ప్రబుత్వమే మద్యం అమ్మిస్తుంది

● అదే విచిత్రం - ఆదాయం కోసం అమ్మిస్తుంది నైతిక బాధ్యతగా నిషేదం అంటుంది!

ఎస్ ఎ ఎన్ ఖర్గపూరు

★ మహాబారతంలో ద్రౌపతి ఐదుగురు బర్తలను పొంది పాంచాలి అయింది మరి బర్తను మార్చి మరో బర్తను పొందే యీ యుగపు ద్రౌపతి నేమనాలి?

● ఏమి అనాలని వుంది మీకు? అదే అనండి ఎవరేనా వద్దన్నా మీరు మానరు కద బర్తను వదలి మరో బర్తను చేపడితే మీకు యింత లోకువగా ఉందే మరి బార్య వుండగానే యింకో బార్యని పెట్టుకొనే వారంటే గౌరవం ఎలా వుంటుందనుకుంటున్నారు?

ఏ ఆర్ ఆర్ రాజోలు

★ ప్రశ్నావళిలో వేస్తున్న ఫొటో మీదేనా?

● కాదు మహాప్రబో అది చిత్రకారుని బొమ్మ □

# "డ్యూటీ"

## సింగరాజు రామచంద్రమూర్తి

"పండగవస్తోంది మరి అంది పద్మావతి

మాస్ వేసుకుంటున్న వాడల్లా తలెత్తి ఎస్ మాడమ్ కోరికలుంటే చెప్పు పట్టుచీర ఉంగరం లేక పదిరోజులు మీ పుట్టింటికి వెళ్ళి వచ్చుట – ఛాయిస్ అన్నమాట! ఏదో ఒక్కటి మాత్రమే! అన్నాడు

పద్మావతి నవ్వింది అలా అన్ని కోరికలూ మీరే ఇచ్చేస్తుంటే నాకేం సరదా ఉంటుంది? నేను అడగటం నో ఇప్పుడు కాదు మాడమ్ అని మీరనడం నేను అలగడం అప్పుడు మీరు సరే ననడం – థ్రిల్ ఉండదు ఊరికినే వచ్చేస్తుంటే!

ఓల్డ్ కథలవి ఇప్పటి మగవాడికి తన డ్యూటీ తెలుసు నా ఇంటి అవసరాలు

మధ్యలోనే అందేసుకుంది పద్మావతి అబ్బ ఆపండి బాబూ ఆ డ్యూటీ వచ్చిందా ఇక చచ్చానే! అది రాకుండా మాట్లాడలేరా?

బూట్లతో పనయిపోయి నిటారుగా నిలబడ్డాడు జానకిరాం

మనిద్దరమూ ఎప్పుడూ క్లాష్ అయేది ఇక్కడే! అంతా డ్యూటీ మయం నా పట్ల నువ్వు నీ డ్యూటీ చేస్తుంటే నీ పట్ల నేను నా డ్యూటీ నిర్వర్తిస్తాను

అయ్య బాబోయ్ మీ డ్యూటీ ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాను మహాశయ ఆపండిక

ఎంత దూరం కొట్టుకుపోయావు? కొట్టుకు పోకుండా ఆపడం కూడా నా డ్యూటీనే! అని నవ్వి ఇదుగో పద్మావతి అలమేలు మంగతాయారూ

నా పేరుతో మాత్రమే పిలవడం మీ డ్యూటి

కరెక్ట్ ఇప్పటికి నా మాట యొక్క విలువ గ్రహించావు థాంక్స్! ప్రపంచం యావత్తూ డ్యూటీ అన్న ఇరుసు మీద నడుస్తోంది అన్నది నగ్నసత్యం ఇక నగ్నంకాని సత్యం ఏమిటయ్యా అంటే అంటూనే ఆమెను గబాలున చేతుల్తో చుట్టేసి ఇది అన్నాడు

మీ దృష్టిలో ఇది డ్యూటీనే! ఒక్క అయిదు నిముషాలు భార్యని కౌగలించుకునుట అవునా! అంతెత్తున్న అతని గుండెల మీద ఒదిగి పోవడం ఆమెకి చాలా ఇష్టం

చూడు పిల్లా కొన్ని విషయాలు మరి లోతుగా తర్కించకూడదు ముసలి మొగుడ్ని పడుచు పెళ్ళాం ఎందుకు భరించలేదు? చెప్పు

నాకెందుకు ఆ గొడవ – మా ఆయన ముసలి కాదుగా!

నగ్నసత్యాలని స్థిరీకరించుతున్నప్పుడు వాళ్ళ పరిస్థితి ఊహించాలి మనం ఆమెను అతను లేక ఆయన చాలా ప్రేమతో చూస్తాడు

ఎవరు? ఎవరిని?

విషయం మిస్ కాకూడదు ముసలి మొగుడు మా అందరి కన్నా ఎక్కువగా ఆ పడుచు పెళ్ళాన్ని ప్రేమిస్తాడు వాడు చేయగలిగింది అది ఒక్కటే కనుక! అయినా ఆ పిల్ల కంటనీరు పెడుతుంటుంది బోలెడు ఆస్తిని చూసి ఆమెను ఆయన కిచ్చిన వారు బోరున ఏడుస్తారు ఎందువల్ల?

ఛీ అంది పద్మావతి సిగ్గుపడుతూ

చూశావా ఊహించావు ఆయన ఆ పిల్ల పట్ల తన కర్తవ్యం అనగా డ్యూటీ చేయడం లేదు కనుక! సరే ఇప్పుడు మన విషయంలోకి వద్దాం ఇందాక పండుగ వస్తోంది మరి అన్నావు వస్తే!

మీ చెల్లెలు

గబుక్కున ఆమెను చుట్టుకున్న అతని చేతులు సడలిపోయాయి అందుకు పద్మావతి సిద్ధమయే ఉంది అది కాదండి మీ నాన్నగారు మీ చేతుల్లో పెట్టారు ఆ అమ్మాయిని మాట్లాడితే డ్యూటీ అంటారే ఆమె బాగోగులు చూడడం మాత్రం మీ డ్యూటీ కాదా? మనం కాక ఇంకెవరున్నారు తనకి పుట్టిల్లు అని చెప్పుకునేందుకు! పద్మావతి కళ్ళు చెమ్మగిల్లాయి

ఒక్క క్షణం ఆమె వంక చూశాడు జానకిరాం ఆల్‌రైట్ టకటక రెండు ప్రశ్నలు వేస్తాను సమాధానాలు చెప్పు నంబర్ వన్ – ఒక్కసారి చుట్టూ చూడు టి వి ఫ్రిజ్ డబుల్‌కాట్ వాషింగ్ మిషన్ అడ్వర్టయిజు మెంటుల్లోలా ఉండే మన బాత్‌రూం – ఇవన్నీ లేకుండా ఉండగలవా?

ఎందుకుండాలి?

అసలు ఉండగలవా అనడుగుతున్నాను

నేననేది అదే ఎందుకుండాలి అని! చిన్నతనం నుంచి నాకు ఇవన్నీ అలవాటు మా పుట్టింటిలో ఉండేవి ఇప్పుడూ ఉంటాయి అదంతే అని నవ్వి ఉండకుండా నేనసలు రానుగా అంది

రైట్ రెండవ ప్రశ్న నన్ను చేసుకునే ముందు ఇంకెంత మందిని చూశావు?

ఛీ అదేం ప్రశ్న?

సారి అడగడం తప్పడిగ్గాను ఎంత మందికి చూపబడ్డావు? ఐ మీన్ ఎన్ని పెళ్ళి చూపలయినాయి?

పద్మావతి మాట్లాడలేదు

నేనే మొట్టమొదటి మన్మధుడ్ని అయుండను కదా!

నవ్వింది పద్మా మొదటి వారు కాదు కాని మీరన్న ఆయన మాత్రం మీరే! అందుకే చేసుకున్నది కూడా!

థాంక్స్ ఎప్పుడయినా మీ ఫాదర్‌ని నాకు కాబోయే భర్త ఇలా ఉండాలి అని కాని అయ్యో ఈ మన్మధుడ్ని ఏమయినాసరే నా కిచ్చి చేయాలి అనిగాని చొరవ తీసుకుని చెప్పావా?

చొప్పదంటు ప్రశ్న!

అసందర్భం ప్రశ్నకి సూటిగా సమాధానం రావాలి

నాకేం ఖర్మ అలా చెప్పేందుకు మా నాన్నగారు లేరా?

అంటే?

అంటే! ఏమిటండి ఏ ఆడపిల్లయినా బరితెగించి చెపుతుందా! పెద్దవాళ్ళకి మా బాగోగులు తెలియవా! మీరు ఆడదయుంటే తెలిసేది

అప్పుడు నువ్వెక్కడెందుకుంటావు? సో నా పెద్దవాళ్ళు నా విషయాలు చూస్తారు అని భారం వాళ్ళ మీదనే వేశావు

వేయడంకాదు నిశ్చింతగా ఉన్నాను ఏ ఆడపిల్లయినా అంతే!

నౌ మా చెల్లెలు ఏం చేసింది?

పద్మ మాట్లాడలేదు

వెనకేసుకుని వచ్చావుగా మాట్లాడవేం? నేను నా డ్యూటీ ఎక్కడ చేయనో అని తనే ఒకరిని వెతుక్కొని వాడిని తీసుకొచ్చి ఆశీర్వదించండి అన్నయ్యా వదినా అంది వదిన ఆశీర్వదించేసింది అన్నయ్య? నో ఆశీర్వదించలేదు ఇందాకటి సౌకర్యాలు అన్ని ఎందుకుండవు? అన్నావు రైట్ నా చెల్లెలికి ఉండేవి అన్ని ఉన్నవాడిని తెచ్చే శక్తి ఈ అన్నగారికి ఉంది కనుక కాని నా డ్యూటీ నన్ను చేయనియ లేదు ఆ పిల్ల! అసలు తన డ్యూటీ ఏమిటి నా చేతుల్లో తన భవిష్యత్తు భద్రంగా ఉందని నమ్మి నిశ్చింతగా ఉండటం ఉండలేక-పోయింది! అంటే దాని డ్యూటీలో అది ఫెయి-లయింది ఇప్పుడు ఆ పిల్ల జీవితంతో నా కేమిటి సంబంధం? ఎవరయినా చివరికి నువ్వయినా అంతే తన జీవితాన్ని జాగ్రత్తగా చూసేవారు ఉన్నారా లేరా అన్నది ముందు తేల్చుకోవాలి ఉన్నారన్న ధైర్యం కలిగాక ఇక భవిష్యత్ గురించి

బెంగెట్టుకోకూడదు

ఆపీసు కారు వెయిట్ చేస్తోంది వెడుతున్నాను అలిమేలు పద్మావతి మంగతాయారూ అంద మయిన ని బుర్ర పాడు చేసుకోకు అంటూనే వెళ్ళి కారులో కూర్చున్నాడు జానకిరాం డ్రయివర్ బ్రీఫ్‌కేస్ తెచ్చి కారు స్టార్ట్ చేశాడు మెత్తగా కదిలిపోతోంది కారు

ముందున్న రోడ్డుకి బదులు ఎదురుగా చెల్లెలు రూపం కనబడసాగింది జానకిరామ్‌కి దీనంగా తనవంకే చూస్తోంది! పక్కన ఒక కుర్రాడు అసలు అతనెలా ఉన్నాడో కూడా చూడలేదు తను అన్నయ్యా అంటూ ఏదో చెప్పబోతోంది నో నేను వినను ని ఫైల్ మూసేశాను అన్నాడు తను నిజంగానే అంతే! తన ప్రాణ సమానంగా చూసుకున్నాడు తనకన్న హైస్థాయి జీవితం ఆమె కివ్వాలని అందుకు ప్రయత్నాలలో కూడా ఉన్నాడు తన దృష్టిలో ఒక బ్రిలియంట్ ఆఫీసర్ రావ్ ని ఏరుకుని అట్టే పెట్టుకున్నాడు ఏం చేసింది తను! మొత్తం తన ఆశలన్ని కూలదోసేసింది ఎక్కడో రెండు గదుల ఇంటిలో అన్నిటికి వెతుక్కుంటూ కణతలు చేతులతో నొక్కుకున్నాడు

నో అనవసరంగా ఈ ఫైల్ తెరిచింది పద్మ ఆఫీసర్‌గా తన ట్రయినింగ్ ఏమిటి నిర్ణయం తిసుకోగానే ఆ ఫయిలు మూసేయడం! ఆలోచన-ల్లోంచి దాన్ని చెరిపేయడం సో ,

మనసు క్లియరయిపోయింది అతనికి! టైము చూసుకున్నాడు ఆపీసుకి చేరుకునేందుకు అరు నిముషాలు పడుతుంది ఆ వ్యవదిలో ఏదయినా ప్లెజంట్ దాట్ ఇంకెన్నాళ్ళు ఈ ఆఫీసు కారు?



నెక్స్ట్ రౌండులో నీకు ప్రమోషన్ ఖాయం జానకిరాం! నేను లేనూ! అన్నాడు బాస్ కైలాసపతిగారు

తనంటే విపరీతమైన ప్రేమ ఎన్నిగారు అమ్మాయి పద్మా అని ఎలుచుకునే సాన్నిహిత్యం పద్మకి లలితాంబగారికి మధ్య ఉంది మా లలితాంబ ఊరుకుంటుందా నీకు స్వంత కారు లేకుండా ఉంటే నవ్వుతారు బాస్

ఆయన మేనేజరుగా ఉన్నప్పుడు తను కొత్తగా చేరాడు ఆ బ్రాంచిలో! పద్మ కాపురానికి వచ్చింది అక్కడే!

ఆఫీసులో అందరికి తెలుసు కైలాసపతిగారికి తనంటే ఎంత ప్రేమో! చనువు ఎక్కువున్నవాళ్ళు ఎకాఎకి మీ బాబాయిగారు అనేస్తారు తనతో ఆయన ప్రస్తావన వచ్చినప్పుడు

నవ్వుకున్నాడు జానకిరాం

కారు ఆఫీసు పోర్చికోలో ఆగింది వాచ్‌మన్ సాల్యూట్‌చేసి డోర్ తీశాడు దిగుతూ అయ్యగారు వచ్చారా? అనడిగాడు

రాలేదు సార్ అన్నాడతను

గబగబ తన చాంబర్‌లోకి వెళ్ళిపోయాడు కూర్చున్న అయిదు నిమిషాలకి ఫోన్ రింగయింది అందుకొని జానకిరాం హియర్ అన్నాడు ఆ కుర్చీలో కూర్చోగానే అతను పూర్తిగా మారిపోతాడు

నేను లలితాంబను జానకిరాంగారు

గబాలున రిలాక్సయి నమస్కారం అమ్మా బాబాయిగారు రాలేదు ఒంట్లో బావుందా? అన్నాడు

అంతలో నే అతనికి పద్మావతి మాటలు గుర్తొచ్చాయి నాకూ మీకూ కూడా ఆవిడ పిన్నిగారు ఆయన బాబాయిగారు ఎలా అని

లేకపోతే మావగారు అననా? అలా అనగానే ఆయన కట్నం ఇవ్వాలి పండగలకి పిలవాలి!

మీ బాబాయిగారే మాట్లాడుతారు అడుగో మీ జానకిరాం అంతలోనే కైలాసపతిగారి గొంతు వచ్చింది ఫోన్‌లోకి జానకిరాం అంటూ

నమస్కారం సార్ అన్నాడు జానకిరాం

అది సర్లే మధ్యాహ్నం కలెక్టర్‌గారి మీటింగ్ - అందర్నీ పొగేసి లొన్లు మళ్ళీ మనం అప్పుచ్చుకునే మనుష్యుల్ని వెతకాలి అది సర్లే అంతకన్న ముఖ్యమయిన పనొచ్చి మీ పిన్నిగారు నీకు ఫోన్ చేయమంది మధ్యాహ్నం టిఫిన్‌కి రా నేను మీటింగ్‌కి వెడతాను నువ్వు మాట్లాడవలసింది మా రాణివాసంతోటే

తప్పకుండా సార్

ఆవిడా నువ్వు కలిసి దానికొక పరిష్కారం చేయండి న్యూసెన్స్ అంటూనేపెట్టేశాడాయన

జానకిరాంకి అర్థం కాలేదు ఆయనకి ఆ న్యూసెన్సు ఏమిటి? బుర్ర వేడెక్కింది పద్మ అంటుంటుంది అంతా డ్యూటీ డ్యూటీ అంటారు మీరు మీ కైలాసపతిగారికి మీరంటే ఎందుకంత ప్రేమ? ఆయన మీ పై ఆఫీసరు! అంతవరకే కదా నిజానికి అని

# "డ్యూటీ"

అందుకు తను కనుకనే నిన్ను మంగతాయారూ అని కూడా పిలుస్తుంటాను అంటే అమాయకురాలా అని అర్థం నిఘంటువు వెతక్కు అందులో అలా అని ఉండదు! నేను ఒళ్ళు దాచుకోకుండా నావీ ఆయనవీ అన్నీ పనులూ నెత్తిన వేసుకుని చేస్తాను కనుకనే ఆయనకి నేనంటే ఇష్టం! నా డ్యూటీకి ప్రతిఫలం నాకు చూపించడం అంటే నన్ను ప్రమోట్ చేయించడం ఆయన డ్యూటీ! ఆఫీసర్ అన్నవాడు మస్ట్ గెట్ థింగ్స్ డన్ చేయించాలి అదే ఆయన చేస్తున్న పని! నేను చేయని నీతో ప్రేమలుండవు దోమలే మిగుల్తాయి అంటాడు

సో ఇప్పుడు కైలాసపతిగారిపట్ల తన డ్యూటీ టేబుల్ కాలెండర్‌మీద మధ్యాహ్నం రెండు కైలాసపతిగారు అని రాసి ఇంటర్‌కంలో స్టెనోకి చెప్పాడు సరిగా రెండింటికి నాకు ఫోన్ చేయండి అని

ఏమని? అందామ్మాయి

ఊరికినే చేయమన్నారు అనండి చాలు

రెండు చేతులతో తలని గట్టిగా నొక్కుకుని ఇక ఈ ఫైల్ మూసేయాలి అనుకున్నాడు అనుకోవటమే ఆలస్యం ఆఫీసు అవతారం ఎత్తాడు!

సరిగా రెండుకిస్టెనో గుర్తు చేసింది

ఏమని గుర్తు చేయమన్నాను? అన్నాడు ఆఫీసు కౌగిలాలలోంచి తలెత్తి

ఏమోసార్ ఊరికే చేయమన్నారు

అప్పుడు టేబుల్‌మీది కాలెండర్ చూశాడు కైలాసపతిగారి పేరు కనబడింది వెంటనే బుర్రలో ఆ ఫైలు తెరచుకుంది నవ్వుకున్నాడు మనిషి మిషిన్ అయిపోతున్నాడు అయితే అలా అవుతూనే వృత్తిలో పైకి రావడం సో ఇప్పుడు బయలుదేరుట!

పావుగంటలో కైలాసపతిగారింటిలో లలితాంబగారిముందు కూర్చుని ఉన్నాడు జానకిరాం

పిల్లాడిలాంటివారు కనుక పిలిపించాను మిమ్మల్ని నాకేమీ పాలుపోవడం లేదు ఆయనది మొండి పట్టుదల ఈ సమస్య పరిష్కరించి కుటుంబాన్ని ఒడ్డెక్కించాలి అంది ఆవిడ ఉపోద్ఘాతంగా

జానకిరాం కిది అలవాటే సినిమాకి న్యూస్ రీల్స్‌లా అవన్నీ అవుతేగాని ఆవిడ అసలు విషయంలోకి రాదు చెప్పండి అన్నాడు

మన బేబి లేదూ అది నిన్న ఇంటిలో పెద్ద బాంబు పేల్చింది ప్రేమించిందట!

ఎవరిని?

ఎవరినని చెప్పను నా ముఖం దానికి ఒక్క ఏడు సీనియర్‌ట ఆ అబ్బాయి అతన్ని తప్ప ఇంకెవరినీ చేసుకోనంటుంది మీ బాబాయిగారి విషయం మీకు తెలియనిది ఏముంది నా శవం ఇంటిలోంచి వెళ్ళాకనే నీ మెడలో వాడిచేత తాళి కట్టించుకో

అనేశారు అది కళ్ళనీళ్ళు! ఈయన చిందులు శివతాండవాలు నిన్నటినుంచి ఇంటిలో అన్నం తిన్నవారు లేరనుకోండి జానకిరాం గారు!

చివరికి మీరు నాకు ఆశాకిరణంగా కనబడ్డారు ఆయనకి నచ్చచెబుతారో పిల్లదాన్ని ఒప్పిస్తారో - నన్ను మీరే రక్షించాలి!

వెంటనే జానకిరాం మనసులో ఈ ఫైలు తెరుచుకుంది మీరంతమాట అనకండి బేబి ఎక్కడుంది? బేబి అతనికి బాగా తెలుసు ఆ పిల్ల చిన్నతనంనుంచి తెలివిగలది చలాకి అయినది అంకుల్ హిందీ సినిమా హీరోలా ఉంటారు అంటీ నువ్వు అదృష్టవంతురాలివి అంటుంటుంది పద్మతో తనంటే ఆరాధన! అంతవరకే

కనుకనే సమస్య పెద్దదిగా అనిపించలేదు జానకిరాంకి! ఏ విషయాన్నయినా ఎలా డీల్ చేయాలో క్షణంలో అతను వ్యూహం వేసేస్తాడు తన వ్యూహంపై అతనికి నమ్మకమూ ఎక్కువే!

మీ కోసమే ఇంటిలో అట్టే పెట్టాను కాలేజీకి పంపకుండా! వాళ్ళ నాన్నగారి కోపానికి ఏడిచింది ఈ కాలప్పిల్లలు

మీరు ఇక వర్రీ కాకండి నాకు వదిలేయండి

బేబి గదిలోకి వెళ్ళడం అలా ఒక ఘంట అభిప్రాయాలు పరస్పరం మార్చుకుందాం బేబి కమాన్ అని పిలవడం దారిలో ఆ అమ్మాయి ప్రేమించిన కుర్రాడిని పికప్ చేసుకోవడం - అంతా క్షణాలమీద జరిగిపోయింది

తన మానేజిరియల్ ఎబిలిటీస్ మీద అచంచల విశ్వాసం అతనికి అంతా వెల్ ఆయిల్డ్ మెషినరీలా కదిలిపోతోంది అనుకున్నాడు ఆనందంగా

తన చాంబర్‌లో వాళ్ళిద్దరిని తన కెదురుగా కుర్చీలలో కూర్చోపెట్టి తను తన సీట్‌లో కూర్చున్నాడు ఇంటర్‌కంలో స్టెనోకి చెప్పాడు గంట-వన్ అవర్ డిస్టర్బ్ చేయకండి అని అప్పుడు బేబి వైపు తిరిగి—

వెల్ బేబి, నిన్ను కిడ్‌గా ఉన్నప్పటినుంచి ఎరుగుదును అవునా? టెన్ ఇయర్స్‌గా యూ ఆర్ ఎయిటీన్ నౌ అన్నాడు

అవునంకుల్! అంది బేబి నవ్వుతూ

చాలా అందంగా నవ్వుతుంది మా బేబి బహుశ ఆ నవ్వే మిమ్మల్ని ఆకర్షించి ఉంటుంది అన్నాడా కుర్రాడితో జానకిరాం

సారి అంకుల్ ఇతను రవికిరణ్ అని నవ్వి తెలుసుననుకుంటా మా ఇద్దరి విషయం మమ్మల్ని తీసుకొచ్చింది అందుకేనని కూడా అనుకుంటా డాడీ బాగా వర్రీ అవుతున్నారు

అవును బేబి పిల్లలవట్ల పెద్దలకి బాధ్యత ఉంటుంది ప్రతి తండ్రి తన కన్నా తన కూతురు అన్ని విధాల పై అంతస్తులో బ్రతకాలని అనుకోవడంలో తప్పు లేదు జీవితంలో పెళ్ళి అన్నది జరిగేది ఒక్కసారే! కట్నాలు నిషిద్ధం వగయిరా మరిచిపో నాలుగు రూపాయిలు ఖర్చుపెట్టయినా-సరే నంబర్ వన్ సంబంధం చేయాలనిగడ

అనుకునేది అలాగే కూతురి డ్యూటీ తండ్రిమీద భరోసా ఉంచి నిశ్చింతగా ఉండు అని నవ్వి నాట్ లైక్ దిస్ నో నన్ను పూర్తి చేయనియ్ మీ పాదర్ సంపంలో విపరీతమయిన గొప్ప పొజిషన్‌లో ఉన్నారు ఆయన చిటికవేస్తే అర్హతలుగల కుర్రాళ్ళు పరుగెత్తుకొస్తారు పొగడడంలేదు కాని బేబి నువ్వు చాలా అందంగా ఉంటావు అతి అందంగా నవ్వగలవు! ఇవన్నీ కలిస్తే ని స్టాటస్ ఎంత గొప్పగా ఉంటుంది?

నువ్వు చేస్తున్నది తప్పు అని అనడం చిన్నమాట! మిస్టర్ రవి కోపం తెచ్చుకోకండి బేబి శ్రేయస్సు మికూ ముఖ్యమేకదా! అన్నాడు జానకిరాం

ఇప్పుడు నన్ను మాట్లాడనివ్వండి అంకుల్ రవి నన్నేమి వంచించలేదు మొదట అది స్పష్టంగా చెబుతున్నాను తరవాత తరం మారింది అంకుల్ మీరూ అదునిక బావాలు కలవారు కలిసి ఉండవలసింది మేమిద్దరం! మామధ్య అవగాహన ఉండాలి ఉంది కూడా! డ్యూటీ అంటున్నారు మీరు ఉంది నాకు డాడీ పట్ల ఆయనకి నా పట్ల కాని వా మనసు తెలుసుకోవడం కూడా ఆయన డ్యూటీ అని నవ్వి అలా నచ్చచెప్పడం అంకుల్‌గా మి డ్యూటీ జీవితంలో నష్టపోతాను అంటున్నారు పద్దెనిమిదేళ్ళ వయస్సు అంకుల్ నాది! పూర్వకాలపు ఆడది ముప్పయి సంవత్సరాలలో సంపాయించలేని అనుబవం ఈకాలపు ఆడపిల్ల నా వయస్సుకే సంపాయిస్తోంది! ఎందువలన? నలుగురిలో తిరుగుతూ పెరిగాం మేము కనుక నష్టపోయినా తెలిసి తెలిసి ఆనందంగా! లేచిపోను నాలుగు మాటలు అడుగుతాను మిమ్మల్ని ఏమి అనుకోకుండా సమాదానం చెబుతారా అంకుల్? అంది

అడుగు అన్నాడు జానకిరాం అతను ఇంత చిన్నపిల్ల నుంచి ఇంత ఎదురుగాలి వస్తుందని అనుకోలేదు

సినిమాలో వెలిగే తారలు అంద మయిన వాళ్ళు కదా అంకుల్ అయితే అంతకన్న అందమయిన వాళ్ళు లేరంటారా బయట?

ఎందుకు లేరు?

గుడ్ అలాగే పాటలు పాడే వాళ్ళు కూడా!

డెపినెట్‌గా అంతకన్న, బాగా పాడే వాళ్ళూ ఉన్నారు

వాళ్ళు వాళ్ళకున్న అందాన్ని టాలెంట్‌ని అవకాశాలని వాడు కోవటానికి ఇష్టపడని వాళ్ళు అన్నమాటే కదా అంకుల్ నష్టపోతున్నారు పాపం అని మనం అనుకున్నా వాళ్ళు అనుకోవడం లేదు తృప్తి అన్న మాట! అవునా అంకుల్

జానకిరాం మాట్లాడలేదు

మీరు మా డాడీ ఆఫీసర్లు మీరు చాలా మందికి ప్రమోషన్లు ఇప్పిస్తుంటారు కొందరు ట్రాన్స్‌ఫర్లు ఇష్టం లేకనో మరెందు కనో వాటిని తిరస్క రిస్తుంటారు అవునా అంకుల్!

అవునూ అన్నాడు తను అనుమానంగా

అంకుల్ మరి వాళ్ళని మీరు ఉద్యోగాల నుంచి తీసేస్తున్నారా?

ఎందుకు తీసేస్తాము? వాళ్ళకి అక్కరలేదు కాబోలు ననుకుని కావలసిన వాళ్ళకి ఇస్తాము

నవ్వింది బేబి అదే అంకుల్ నేననేది మి డ్యూటీ ప్రకారం మీరు ప్రమోష నిచ్చారు వాళ్ళు వద్దన్నంత మాత్రాన మీరు కోప్పడి వాళ్ళని డిస్మిస్ చేయరు జీవితమూ అంతే కదా అంకుల్!

జానకిరాం ఇక ఆమె ముందు మాట్లాడ లేక పోయాడు అయితే తరవాత కైలాసపతిగారి ముందు మాట్లాడాడు అది సార్ బేబి నన్ను వేసిన ప్రశ్నలు నాకు సబబుగానే అనిపించాయి మనం ఏదో గొప్ప స్టాటస్ ఇద్దాం అనుకుని వాళ్ళు ఆ అవకాశం వాడుకోనంత మాత్రాన వాళ్ల మీద మనకి కోపం దేనికి సార్? కుర్రాడు మంచి వాడు మాట్లాడించి చూశాను బ్రిలియంట్ మంచి ఫ్యూచరుంది పైగా బేబి ఇంకో మాట కూడా అంది నవ్వుతూనే అంత శ్రద్ధ మీకూ మా డాడీకి ఉంటే రవికిరణ్‌కే మంచి పొజిషన్ ఇప్పించండి అతనేమి తెలివిలేని వాడు కాదు కద! అది మి డ్యూటీనే అనుకొండి అని ముగించి ఆయన వంక చూశాడు ఆశగా

పక్కనే ఉన్న లలితాంబగారు అందుకుంది ఊ అందురూ అని

సరే మి ఇష్టం అన్నారాయన

హమ్మయ్య పెద్ద బరువు దింపారు జానకిరాం గారు ఈయన్ని సర్ధలేక దానికి చెప్పలేక చస్తున్నాను పోనీ మికులాగా ఆయనకి చెల్లెలి విషయం అయితే నేనూ వదిలేద్దును కన్న కూతురయిపోయింది ఎలా? మనవడు పుడితే మి పేరేపెట్టిస్తాను

జానకిరాంకి ఇంకేమి వినబడడం లేదు ఒక్కటే మాట ఆయనకి చెల్లెలు విషయం అయితే కూతురయిపోయింది అన్నది అతని ఆలోచనలకి అడ్డేసింది అన్నయ్యా నా మాట విను ఆయన మంచి వాడు తెలివి గలవాడు ఏదో చెప్పబోయిన చెల్లెలి మాటలు తను వినలేదసలు అహం అడ్డు వచ్చిందా? ఇప్పుడు ఆపీసర్‌గారి కూతురు మాటలు శ్రద్ధగా విన్నాడు చెల్లెలి మాట వినడం మాత్రం తన డ్యూటీ కాదూ?కూతురయితే కన్న కూతురయితే

గబగబ బయటికి వెళ్ళి పోయాడు

పకాలున నవ్వారు కైలాసపతి గారు పోన్ చేయి అన్నారు లలితాంబగారిని

ఆవిడ రింగ్ చేసి పద్మా ఆ నేనే పిన్నిగారిని – లలితాంబని! అంతా సవ్యంగా జరిగింది బేబి రవికిరణ్‌ల సంబందం మేము ఎప్పటి నుంచో అనుకుంటున్నది అని కాని మి బాబాయిగారు ఎప్పుడో ఒప్పేసుకున్నారని కాని పొరపాటున కూడా జానకిరాంతో చెప్పబోకు సుమా! మనం ఆడిన నాటకం అతని కెప్పటికి తెలియకూడదు మా బేబి బ్రహ్మాండంగా ప్రశ్నలు వేసింది మి ఆయన్ని! ఉండు మి బాబాయిగారు మాట్లాడతారట అంటూనే కైలాసపతి గారి కిచ్చింది ఆవిడ

ఇదుగో చూడమ్మా మి ఆయనకి తల తిరిగేలా ఒక మాట అనేసింది మి పిన్నిగారు ఇప్పు డెంతయింది సాయింత్రం అయిదు కదా ఎనిమిదింటి కల్లా మి ఇంటి ముందు కారాగు తుంది అందులో మి ఆయన మి ఆడబిడ్డ ఆ అమ్మాయి బర్త ఉంటారు
పండగ సరదాగా చేయి నన్నూ
మి పిన్నిగారినీ పిలుసుమా! అన్నారు

చాలా థాంక్స్ బాబాయిగారు అంది పద్మ

ఎనిమిది అవకుండానే ఇంటి ముందు కారాగింది కారులో ఉన్న ఆడపడుచు కోసం ఆనందంగా పరుగెత్తింది పద్మావతి □



# హైదరాబాద్ నోట్‌బుక్

## జనశక్తి చైతన్య యాత్ర-
## మహానాడు మహానది –

తెలుగుదేశం పార్టీ మహానాడు జనవరి 2 3 4 తేదిలలో బ్రహ్మాండంగా జరిగింది 4వ తేది శనివారంనాడు జరిగిన పెద్ద ఊరేగింపు హరిత నదివలె జంటనగరాలను ముంచెత్తింది పసుపు రంగు దుస్తులు దరించిన పార్టీ కార్యకర్తలు తదబిమానులు ఫోషామహల్ క్రిడాస్థలి నుంచి సికిందరాబాద్‌లోని జింఖానా మైదానం వరకు దాదాపు పన్నెండు కిలో మీటర్లు జంటనగరాల ప్రదాన వీదులగుండా పసుపురంగు వెల్లువలా ఊరేగారు పసుపురంగు పతాకాలు పసుపురంగు తలకట్లు పసుపురంగు దోవతులు చొక్కాలు పాంట్లు చీరలు రైకలు చేతిసంచులు వాటర్ బాటిల్స్ సకలమూ పసుపురంగే! చైనాలోని యల్లో రివర్ పాయ హఠాత్తుగా జంటనగరాలలో పారిందా! అని అనిపించింది ఈ హరితనది ఉదయం 10 30కు ఫోషామహల్ క్రిడాస్థలి నుంచి బయలుదేరి మోజంజాహి మార్కెట్ నాంపల్లి కంట్రోల్ రూమ్ బషీర్‌బాగ్ నారాయణగూడ ఆర్ టి ఎ క్రాస్ రోడ్ ముషిరాబాద్ కల్పనాథియేటర్ కబాడిగూడ రాణిగంజ్ పారడైస్‌ల మీదుగా తరలి జింఖానా మైదానాన్ని దాదాపు సాయంకాలం 4 00కు చేరింది రాష్ట్రంలోని వివిద ప్రాంతాల నుంచి దాదాపు 2500 బస్సులలో లక్షన్నర కార్యకర్తలు తెల్లవారు జామున 3 గంటల నుంచే ఫోషామహల్ క్రిడాస్థలిలో జిల్లాలవారిగా సిద్ధంగా ఉన్నారు ఆయా జిల్లాల కార్యకర్తల బృందాలకు ఆయా జిల్లాల మంత్రులు విదానసబ సభ్యులు నాయకత్వం వహించారు చిట్ట చివరన ముఖ్యమంత్రి తెలుగుదేశం పార్టీకి మరల అద్యక్షులుగా ఎన్నికయిన శ్రీ ఎన్ టి రామారావు చైతన్య రథంపై నిలబడి ఊరేగింపులో పాల్గొన్నారు పోలీసు కమిషనర్ శ్రీ ప్రబాకరరావు యాదగిరి హెలికాప్టరులో ఊరేగింపు ఏర్పాట్లను ప్రయాణీకుల రాకపోకల ఏర్పాట్లును పరిశీలించారు ఊరేగింపు 60 మంది పచ్చదుస్తుల సిక్ బ్యాండు బృందం ఎడుగురున్న ఆశ్విక దళం నాదస్వరం రికార్డున్న వ్యాను ముందు నడవగా శ్రీకాకుళం జిల్లా బృందంతో ప్రారంబమయింది మంత్రి శ్రీమతి ప్రతిబాభారతి ఈ బృందానికి నాయకత్వం వహించారు నల్లగొండ బృందంలో అత్యదిక సంఖ్యాకులున్నారు దాదాపు 30 వేలమంది మంత్రి శ్రీ జానారెడ్డి దీనికి నాయకత్వం వహించారు ఊరేగింపు దారిలో 25 చోట్ల స్వాగత కేంద్రాలు ఏర్పాటు చేశారు ఊరేగింపులో మహిళలు దాదాపు 40 శాతం ఉన్నారు కొందరు పసిపిల్లలను ఎత్తుకుని నినాదాలు చేస్తున్న తల్లులూ కనిపించారు ఊరేగింపు ప్రారంబంలోను అక్కడక్కడ బాణ సంచా కాల్చారు ప్రేల్చిన కొన్ని చోట్ల నుంచి తెలుగుదేశం పార్టీ ప్రబుత్వం సాదించిన విజయాలు సాదించదలచిన కార్యక్రమం తెలిపే కరపత్రాలు ఆకాశం నుండి పడి ప్రజలకు వినోదం కలిగించాయి మొదటి బృందం జింఖానా మైదానం చేరే సమయానికి చివరి బృందం ఫోషామహల్ క్రీడాస్థలి నుంచి బయలుదేరింది ఫోషామహల్‌లో ఈ బృందాల నిర్దేశకుడు మాజీ ఎం ఎల్ సి మాజీ డ్రిల్ మాస్టర్ శ్రీ డి శివరామరాజు ఎత్తైన వేదికపై నిలబడి చివరి బృందం కదలే వరకు 10 30 నుండి 3 30 వరకు క్విక్ మార్చ్ అంటూ పెద్ద గొంతుకతో ఆదేశాలు ఇస్తూనే వున్నారు ఈ ఊరేగింపుకు జనశక్తి చైతన్య యాత్ర అని ముఖ్యమంత్రి నామకరణం చేశారు ఇంత పెద్ద ఊరేగింపు ఇదివరకు జరుగలేదని జనాన్ని అదుపులో పెట్టడానికి ఇంత శ్రమ ఎప్పుడూ పడలేదని పోలీసు అదికారులు తెలిపారు ప్రత్యేకాహ్వానంపై మహానాడుకు వచ్చిన ప్రతిపక్ష నాయకులు ఈ జనశక్తి చైతన్య యాత్రలో పాల్గొనడం విశేషం!

## పదమూడు ప్రతి పక్షాల ఫోరం -

తెలుగుదేశం మహానాడులో పాల్గొనడానికి ప్రత్యేకాహ్వానితులైన పదమూడు ఇందిరా కాంగ్రెసేతర రాజకీయ పక్షాలు రాష్ట్రాల హక్కులు కాపాడడానికి వాస్తవమైన పెడరల్ ప్రజాస్వామ్య వ్యవస్థను పాదుకొల్పడానికి తగిన ఫోరంను ఏర్పాటు చేయాలని జనవరి 4వ తేదీన శ్రీ ఎన్ టి రామారావు గృహంలో జరిగిన సమావేశంలో నిర్ణయించాయి ఈ సమావేశానికి ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు అద్యక్షత వహించారు ఈ సమావేశంలో అఖిలభారత పక్షాలు జనతా కాంగ్రెస్ ఎస్ పార్టీల నాయకులు ప్రాంతీయ పక్షాలయిన తెలుగుదేశం అస్సాం గణపరిషత్ అకాలీదళ్ ద్రావిడ మున్నేట్రకషగం నేషనల్ కాంగ్రెస్ ఫరూక్ వర్గం ఉత్తరప్రదేశ్ సమతా పార్టీ మేఘాలయ ఆల్ పార్టీ హిల్ లీడర్స్ కాన్ఫరెన్స్ అరుణాచల్‌ప్రదేశ్ పీపుల్స్ పార్టీ నాగాలాండ్ నాగా నేషనల్ డెమొక్రాటిక్‌పార్టీ జమ్ము కాశ్మీర్ పంథర్ పార్టీ గుజరాత్ రాష్ట్రీయ కాంగ్రెస్ నాయకులు పాల్గొన్నారు నాలుగు గంటలపాటు జరిగిన చర్చలో పంజాబ్ ముఖ్యమంత్రి శ్రీ సర్జిత్ సింగ్‌బర్నాలా కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే ప్రముఖ పాత్ర వహించారు ప్రాంతీయ పక్షాలు దేశ శత్రువులు కావని ప్రాంతీయ పార్టీల సమైక్యం వల్ల రాష్ట్రాల హక్కులు సురక్షితమై కేంద్రంలో పెడరల్ ప్రబుత్వ వ్యవస్థ స్థిరపడుతుందని ఈ సమావేశం అబిప్రాయపడింది

## ఉపశ్రుతి -

మిత్రులు శ్రీ ఎన్ ఎ శేషాచార్యులు పరమ హాస్యప్రియులు అక్షరాల గుడి దీర్ఘాలు మార్చి నవ్వు పుట్టించగలరు మీ బస ఎక్కడ? అని ఒక మారు నన్ను ప్రశ్నించారు ఆయన బహదూర్‌పురా దగ్గర అన్నాను బహుదూర్‌పురాకు వెళ్లారే అన్నారు ఆయన నా మిత్రుడొకడు చాల అందగాడు కాని అజీర్ణ రోగి కావడం వల్ల వాయు బాద ఎక్కువ శ్రీ శేషాచార్యులు ఆయనను చూచి మీ మిత్రుడు రూపంలో తుంట విలుకాడు బాణాలు వదలడంలో తుంటవిలువాడు అన్నారు

-తిరుమల రామచంద్ర



జనవరి 4వ తేదీన తెలుగుదేశం పార్టీ మహానాడు సందర్భంగా జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు. కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ హెగ్డే, పంజాబ్ ముఖ్యమంత్రి శ్రీ బర్నాలాలని కూడా చిత్రంలో చూడవచ్చు.







# చిల్లిగవ్వకూడా ఖర్చు కాకుండా లక్ష రూపాయలు సంపాదించడం ఎలా?

## ఈ రోజే మీదగ్గరలోని పోస్టాఫీసులో సేవింగ్స్ ఖాతాను తెరవండి.
## మొదటి బహుమతి ఒక లక్ష రూ॥ గెలిచే అవకాశం పొందండి

మీరు ఏపోస్టాఫీసులోనైన ఒక సేవింగ్స్ ఖాతాను తెరిచి 6 మాసాలపాటు రూ 200ల కనీస బ్యాలన్సు ఉంచితే మీరు మొదటి బహుమతి రూ ఒక లక్ష లేదా ఇతర 22,000 బహుమతులలో ఒకదానినైనా పొందడానికి అర్హులు అంతే కాదు మీ అసలు మొత్తంతో పాటు సం నికి 5 5/ వడ్డీతో ఖాతా మీపేర కొనసాగుతుంది అవసరమైనపుడు డబ్బు విత్‌డ్రా చేసుకొనే సౌకర్యం చెక్‌బుక్ సౌకర్యాలు కూడా ఉన్నాయి

| | | |
|---|---|---|
| మొదటి బహుమత | రూ | 1 00 000 |
| 5 రెండవ బహుమతులు | రూ | 50 000 |
| 10 మూడవ బహుమతులు | రూ | 20 000 |
| 100 నాల్గవ బహుమతులు | రూ | 5 000 |
| 2 000 అయిదవ బహుమతులు | రూ | 500 |
| 20 000 ఆరవ బహుమతులు | రూ | 50 |

బ్యాంకు ఖాతా ఉంటేనే డబ్బున్న వారిలా పరిగణింపబడరు పోస్టాపీసు ఖాతా కూడా అంతే విలువైనది అంతే సులువైనది






కమీషనర్, స్మాల్ సేవింగ్స్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హిమాయత్ నగర్
హైదరాబాదు 500 029



**జాతీయ పొదుపు సంస్థ**
మీ భద్రతే మా లక్ష్యం

TARA/CSS/8/8586

# వాయులీనంలో ప్రపంచ రికార్డు!

ఇటీవల సికింద్రాబాద్‌లోని సీతాఫలమండి అన్నమాచార్య సంగీత కళాకేంద్రం సహోపాధ్యాయుడు శ్రీ గరిమెళ్ల గోపాలకృష్ణ (19) సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ సమీపంలోని శ్రీ గణపతి దేవాలయంలో 30 గంటలు అఖండ వయొలిన్ వాదనం చేసి ప్రపంచ రికార్డు నెలకొల్పారు ఇంతకుముందు మద్రాసు కళాకారిణి కుమారి మీరానారాయణన్ స్థాపించిన 26 గంటల రికార్డును ఈయన అధిగమించారు

సంగీత కుటుంబంలో జన్మించిన శ్రీ గోపాలకృష్ణకు ప్రముఖ నేపథ్య గాయని శ్రీమతి ఎస్ జానకి పినతల్లి కాగా శ్రీ గరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ (తిరుపతి అన్నమాచార్య (పాజెక్టు) సోదరుడు

దేవస్థానం చైర్మన్ శ్రీ అన్నా శివలింగం ఈ కార్యక్రమాన్ని ప్రారంభించారు శ్రీ గరిమెళ్ల గోపాలకృష్ణ వయొలిన్ కళాధ్యాపకులు శ్రీ తంపెళ్ల సూర్యనారాయణ, శ్రీ వినాయక దేవాలయ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ జిన్నా లక్ష్మణస్వామి శ్రీ గోపాలకృష్ణను అభినందిస్తూ ప్రసంగించారు ముగింపు కార్యక్రమానికి డా దివాకర్ల వెంకటావధాని అధ్యక్షత వహించారు

ఈ కార్యక్రమంలో పూర్తిగా అన్నమాచార్య గీతాలనే ఆలపించడం ప్రత్యేకంగా చెప్పుకోదగిన విషయం

## అపి-ఇపి-అన్నీ



శ్రీ గరిమెళ్ల గోపాలకృష్ణ

* * * *

## మహిళలకి విజ్ఞప్తి

జ్యోతి ఇంటర్‌నేషనల్ (సికింద్రాబాదు) వారు ఉద్యోగినులు రచయిత్రులు, మహిళా పాఠకులు, మహిళా మండలుల వివరాలతో విడివిడిగా నాలుగు డైరెక్టరీలని ప్రచురించాలని ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలియ చేసారు ఈ కృషి జయప్రదం కావటానికి మహిళలంతా తమ వివరాలని జ్యోతి ఇంటర్ నేషనల్, పోస్టుబ్యాగ్ నెం 36 సికింద్రాబాద్–500003కి పంపవలసిందిగా కోరుతున్నారు ☐




Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S. Radhakrishna

Phones Business 61247, 61248, Editorial 75667


లక్ష్మీ ఫిలింస్ డివిజన్
ప్రొడక్షన్ నెం.3 చిత్రంలో
భానుచందర్; అర్చన.
















# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ

మృదువైన మూలపదార్థము వల్ల ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల మందు శక్తికి రక్షణ






1984 ఒలింపిక్స్ క్రీడలలో పాల్గొన్న భారత క్రీడాకారులకు అధికారపూర్వకంగా పెయిన్ బామ్ సరఫరా చేసినవారు.

# అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 8708 TG